# భారతి

సాహిత్య మాసపత్రిక
సెప్టెంబరు 1978

ఆ పి లు పు
నా రా య ణ రె డ్డి

క వి త
బాలగంగాధరతిలక్

సు లో చ నా లు
రా మా రా వు

న వ్వు
ర మేశ్ చౌదరి

శుంగ - కాణ్వ - సాతవాహన నాణాలు
ప ర బ్ర హ్మ శా స్త్రి

నవల - ఒక పరిశీలనం
రం గా రా వు

గణితము-ఆధునిక సమాజము
అ రు ణా చ లం

పత్రికా రచనలో- భాషాప్రయోగం
రా మా రా వు

ఇంకా సత్యనారాయణ, రఘునాథం, వనమాలి, చైతన్య, సుందరేశ్వరరావు, సుబ్బారావు, స్ఫూర్తిశ్రీ, గోపాలరెడ్డి, వేంకటరావు ఇతరుల రచనలు

వ్య వ స్థా ప కు లు
దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)



సెప్టెంబరు 1978

సంపుటము : 55 సంచిక : 9

విడిపత్రిక వెల రూపాయిన్నర

# అమృతాంజన్
## లిమిటెడ్‌వారి
## విశిష్టమైన
# ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.




మూడు
సైజులలో
లభిస్తుంది:
50 మిలి
100 మిలి
200 మిలి

అమృతాంజన్ ఆముదము

OBM 3770/3 TGIAH

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1978





# ఆ పిలుపు

డా॥ సి. నారాయణరెడ్డి

నీ పిలుపు లేదు
  నేటి ఉక్కు తీగకు.
రేపటి ఆశాస్వరానికి
రెక్కలు తొడిగి ఎగరేసే
ఆ పిలుపు లేదు
నేటి బక్క వాగుకు.

అయినా — ఆ పిలుపులేక
పోయినా — నిల్చున్నాను
కళ్లు తెరుచుకుని;
తూర్పులా -- నక్షత్రాల ని
ట్టూర్పులా.

తెలుసు నాకు;
పొద్దులా నువ్వు
పొడుచుకొస్తావని -
నిశ్శబ్దాన్ని నంజుకుంటూ
నిశీథాన్ని మింగుకుంటూ.

ఆగమంటావా అందాకా ?
మూగలా; పొగమంచు
   తీగలా —
నన్ను నేను పోగొట్టుకుంటూ
నాదంలో ఊపిరి చుట్టుకుంటూ.



**శ్రీ మాదిరాజు రంగారావు**

# నవల - ఒక పరిశీలనం

నవల ఎంతో స్వతంత్రమైందీ విస్తృతమైన అవకాశంతో జీవితాని కత్యంతమూ సన్నిహితమైందీ ఇది ఎక్కువమందిని ఆకర్షించేది కావడంతో ఒక స్థాయిని నిల్పడంలో రచయిత బాధ్యత అనల్పమైంది ఏదో వినోదంకోసం కాకుండా దీన్ని అధిగమించి, ఆలోచనకూ, ఉన్నతమైన ప్రయోజనానికీ ఉద్దేశింపబడడంతో, రచయిత ప్రతిభచేత కవిత్వమూ, నాటకంతోపాటు ఆమోదయోగ్య మౌతూంది ఇది వచనంలో ఉండడం మూలంగ నిర్ణీత నియమాలు అంతగా లేకపోవడంవల్ల రచయితలనూ, విస్తృతమైన జీవితం ఆధారంగా ముఖ్యంగా సుగమత్వం, అనుకూలత్వంవల్ల పాఠకులనూ ఎక్కువగా ఆకర్షించగలుగుతూంది. ఇందులోని వస్తువులోకాన్నీ, మానవుణ్ణీ అనుక్షణం భావింపజేస్తూ రచయిత దర్శించే మనోజగత్తుకు ఎక్కువ చేరువతనం కలిగింపజేస్తూంది.

పాశ్చాత్య సాహిత్యంలో 1700 ప్రాంతంలో ఈనాడు మనం అనుకునే విధంగా నవల వ్రాయడం ఆరంభమైంది.

"A fictitious prose narrative of considerable length in which characters and actions representative of real life and portrayed in a plot of more or less complexity."

Bocccaccio మున్నుగువారు వ్రాసిన, చిన్న కథారూపమైన ఇటాలియన్ నావెల్లా, క్రమంగా సుదీర్ఘమైన కథతో వాస్తవమైన జీవితంలోని వ్యక్తులు పాత్రలుగా, సంశ్లిష్ట గుణంలో ఆలోచనాత్మకమైన వచన రచనగా రూపొందింది నవల మధ్యతరగతీ, జర్నలిజం వాతావరణంలో ఉదయించింది అయినప్పటికీ ఈనాడు క్రమక్రమంగా అన్ని తరగతులవారికీ అందుబాటులోనిదైంది. పూర్వం తీరిక ఉన్న పై తరగతివారే ఎక్కువగా చదివేవారు. విద్య బాగా వ్యాప్తి చెందడం, సామాజికమైన అవగాహన ఎక్కువ కావడంతో దీని విస్తృతి ఈనాడు అధికతరమైందని చెప్పవచ్చు

తెలుగులో స్వతంత్రమైన నవల అవతరించి వందసంవత్సరాలైంది 1872లో గోపాలకృష్ణమ చెట్టి, 'శ్రీరంగ రాజచరిత్ర', 1878లో కందుకూరి వీరేశలింగం 'రాజశేఖర చరిత్ర' మొదట పేర్కొదగినవి

ఇంగ్లీషు, బెంగాలీ భాషల ప్రభావంతో, ఇతర ప్రాంతాలతో వ్యక్తులతో సంబంధాలవల్ల తెలుగు సాహిత్యంలో ఆధునిక వాతావరణానికి క్రొత్తదనం వచ్చింది సమాజంలో వచ్చే మార్పులు, ఇతర ప్రక్రియలపైకన్నా నవలపై ఎక్కువగానూ, వేగంగానూ ప్రసరించడంలో ఆశ్చర్యంలేదు. ఇది సహజమూ, వాస్తవికమూ ఐన జీవితాని కత్యంత సన్నిహితం కావడమే

కవిత్వంలో శబ్దాల ఎన్నిక, వీటి సంయోజనం సాంద్రమైన భావన, ఆపైన అలంకారాలూ ఇంకా ఛందస్సు, ఇతర సామగ్రీ సంభారం అవసరం నవలలో విశిష్టమైన శైలిని సంపాదించేంత వరకూ వాక్య విన్యాసంలో శిల్పానికి సంబంధించిన మెలకువ అవసరం. ఇంకా ఎక్కడైనా వర్ణన, ఒక్కొక్కచోట మన స్థితి చిత్రణలో, భావబంధురమైన భాష చోటు చేసుకోవచ్చు. కాబట్టి ఈ రచనాశిల్పం వేరు. మౌలికంగా కవిత్వం చదివేప్పుడు అనుభూతి రీతీ, నవల చదివేప్పుడు అనుభూతి రీతీ వేరు. ఆ విమర్శ పద్ధతికీ, ఈ విమర్శ పద్ధతికీ భేదం ఉంది. స్థూలంగా, నవల చదవడానికి పాఠకులకు కవిత్వంకన్నా తక్కువ సామగ్రీ, ప్రయత్నమూ అవసరం అన్న అభిప్రాయం ఉంది చాల కొద్ది నియమాలతో ఎక్కువ స్వాతంత్ర్యమూ, అవకాశమూ కలిగిన కారణంగా దీనిపట్ల కొంత చులకనభావం లేకపోలేదు.

అత్యుత్తమమైన నవలలు ఏ విధంగానూ ఉన్నతమైన ఆలోచనలో గాఢమైన భావనలో ఏ ప్రక్రియకూ తీసిపోవు. ఒక విషయం చూద్దాం, లోకంలో నియమాలు తక్కువగా ఉండి స్వేచ్ఛ ఎక్కువగా ఉన్నప్పుడు, వ్యక్తి బాధ్యత పెరుగుతుంది. వివేకం అవసరమూ ఎక్కువౌతుంది స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో సమాజంపొందిన మెలుకువనుబట్టీ, ఈ ప్రక్రియవైపు ఎక్కువగా ప్రజలదృష్టి మరలడం సహజం. ఇది వాళ్ళ ఆశలూ, ఆశయాలూ బింబించే సాహిత్యరూపంగా, సాన్నిహిత్యం పొందడానికీ, భావించడానికీ వీలైంది.

కవిత్వం, నాటకం గురించి జరిగినంతగా, శాస్త్రీయమైన ఆలోచన, లక్షణవివేచన దీన్నిగురించి జరుగలేదు దీనికి కారణాలు, ఇది బాగా ఇటీవల ప్రక్రియకావడం, పేరెన్నికగన్న సాహిత్యవేత్తలు, దీని కంతగా ప్రాధాన్య మొసగకపోవడమూ, కవిత్వం నాటకంతో పోల్చిచూస్తే, దీని జీవిత కాలం ఇప్పటికి చాల స్వల్పమైంది. నాటకం, అందునా కవిత్వం, కొన్ని వందల సంవత్సరాల క్రితం నుండి బాగా వ్రేళ్ళూదన్నుకొని ఉందన్న విషయం, ఆపైన శాఖోపశాఖలుగా విస్తరించిన సంగతి, మరువరాని సిద్ధాంతపరంగా, విమర్శనా దృష్టితో, వీటితో సమానమైన వ్యవస్థ ఏర్పడడానికి, ఇంకా వ్యవధి అవసరం. ఈనాడు సాహిత్యంపట్ల పెంపొందుతూన్న అభిరుచి, ఇతర సాధనాలు మనకు అందుబాటులో నున్న తీరూ, దృష్ట్యా దీన్ని కొంత వేగవంతం చేసే అవకాశం ఉంది. మానవ జీవితంలో బహు విధాలైన స్థితుల్నీ, ప్రవర్తనా రీతుల్నీ విస్తృతమైన అవకాశంలో ప్రతిబింబింపజేస్తూ, పురా రూపాన్నీ, వర్త

మానాకృతినీ దర్శింపజేస్తూ, నవల ఈనాడు కావ్యమూ, నాటకమూ ప్రక్కన నిలబడే స్థాయికి చేరుకోవడం గొప్ప విషయమే.

భారతీయ భాషల్లో, కొన్నిపదుల సంవత్సరాలుగా మాత్రమే వర్ధిల్లే నవలా సాహిత్యంలో, కొన్నినవలలు తలలెత్తుకొని శిఖరాగ్రాన నిలబడడం చూస్తే, ఈ ప్రక్రియకుగల అనన్యమైన వర్ధమాన జీవశక్తి ఎంతటిదో, స్పష్టమవుతుంది.

# II

ఆధునిక జీవితంలో అన్ని రంగాల్లోనూ వచ్చే వేగవంతమైన మార్పులనూ, వైవిధ్య పూరితమైన వాతావరణాన్నీ ప్రతిబింబించే శక్తి, నవలకు సంపూర్ణంగా ఉంది. ఇది ఏలాంటి వస్తువునైనా, భావాన్నైనా సులభంగా తనలో ఇముడ్చుకోగలది. హెన్రీ జేమ్సు, మాటల్లో—

"The house of fiction has the possibility of millions of windows, any which can be fashioned to open on the spreading field of the human scene by The pressure of an individual will and vision".

నవల అనేది, ఒక గృహం అనుకుంటే దీనికి అనేకమైన గవాక్షాల అవకాశం ఉంది. వ్యక్తి ఇచ్ఛ, దర్శనంచేత విశాలమైన మానవ దృశ్యాల్ని విలోకించడానికి దేన్నైనా తెరచి చూడవచ్చు.

వ్యక్తినీ,జీవితాన్నీ, సంఘాన్నీ ఒక్కొక్క రచయిత ఒక్కొక్క విధంగా దర్శిస్తాడు. మానవ సంబంధమైన అవగాహనతో, సమాజపరమైన చిత్రణం ప్రధానంగా కలవి, ఒకరకం నవలలు వ్యక్తి ప్రధానంగా వ్యక్తిత్వంపై ప్రసార రేఖలతో, అంతర రూపాలను ఆవిష్కరింపజేసేవి, మరో రకమైనవి. ఒకవిధంలో మరో విధం అక్కడక్కడా చోటు చేసుకోవచ్చు.

నవలలో సంఘటనలు—పాత్రల సంబంధాన్ని పురస్కరించుకొని, నిర్మాణరూపం ఉంటుంది. దీని నిర్వహణలో కేవలం భౌతికమైన వర్ణనలకేకాక, బయటికి కన్పించని వ్యూహాలవంటి, ఆంతర రీతులపై ఈనాటి రచయితల శిల్పదృష్టి కేంద్రీకృతమై, మనస్తత్వ విశ్లేషణకు ప్రాధాన్యం ఇస్తుంది.

కేవలం సమాజ స్వరూప చిత్రణమే కాకుండా, పైకి కన్పించని అంతర్గతమైన వాస్తవ శక్తులూ, వీటి సమన్వయంలోని స్థితినీ, సంఘర్షణలోని గతినీ పరిశీలిస్తాడు రచయిత. ఈ విధంగా స్థితికీ, గతికీ కారణమైన అదృశ్య శక్తుల్ని గుర్తించే ప్రయత్నంలో, సామాజిక శాస్త్రమూ, రాజకీయశాస్త్రమూ, మనస్తత్వ శాస్త్రమూ, ఇంకా తదితరమైన విషయాలకూ సంబంధించిన అంశాలతో పరిచయం అవసరం. రచయితకు లోతుకోసం, అనుబంధ శాఖల పరిచయం అవసరమైతే, విమర్శకునికె లోతు తెలుసుకోడానికి వీటి అవగాహన అవసరం.

ఏ రచన ఐనా గాఢత్వం (seriousness) లేకపోవడంవల్ల అనుకున్న ప్రభావాన్ని నెరవలేకపోతుంది కళాత్మకత లోపిస్తుంది. ప్రయోజన తత్పరత దెబ్బతింటుంది. మరీ ముఖ్యంగా, వచనరూపం ఐన నవలలో మధ్య మధ్య అనాంతరాల్లో, కొంతసేపు అభిలాషను నిలిపే, ఇతర రక్షకశ్రేణి లేకపోవడంవల్ల ఇది సులభంగా సంప్రాప్తమౌతుంది. కవిత్వంలో ఐతే, పద్య రచనచేతనో, శబ్దాలంకారం చేతనో వర్ణనలు కాస్త పెంచో ఈ స్థితిని కొంతసేపు నిలవడానికి అవకాశం ఉంది. నవలలో దీనినిబట్టి హాస్యమూ, వినోదమూ ఉండకూడదని కాదు. దీన్ని కళాత్మకంగా ఉపయోగించే తీరులో, ప్రయోజనపరంగా సంయోజించే రీతిలో గాఢత్వం ఉండాలి

ఒక్కొక్క విధం నవల వ్రాసేప్పుడు దీనికి ఆయా విషయాల పరిజ్ఞానమూ ఎంతో తోడ్పడుతుంది ఉదాహరణకు చారిత్రకేతివృత్తం తీసుకున్నపుడు ఆ కాలంలోని రాజకీయ, సాంఘిక వ్యవస్థ, ఆచార వ్యవహారాలు, వేషభూషణాదులూ చిత్రించే అంశాలతో, కథ సంయోజితం కావాలి. అప్పటి వాతావరణానికి తగిన సమాచారంతో నిర్మించాల. అవసరమైతే, ఆయా స్థలాలు – సందర్శించవలసీ ఉంటుంది.

అలాగే, ఒక సమస్య గురించీ, ఒక పాత్ర గురించీ, పలుకూ ప్రవర్తనా రీతులూ మనస్తత్వం—ప్రత్యక్ష సంబంధంతో క్షుణ్ణంగా పరిశీలించి చిత్రించినపుడే, సహజత్వమూ వాస్తవికతతో మనల్ని ఆకట్టుకుంటుంది కొంత న్యాయమూ చేకూరుతుంది. ఏదో కల్పనతో కాలక్షేపం చేయడంవల్ల, ఒక నవలకూ, మరో నవలకూ, జీవన భూమికలో వైవిధ్యం లోపించి అనుభవ ప్రపంచంలో చెప్పకోదగ్గ భేదం లేకపోగా—విసుగూ కలుగుతుంది.

వ్యక్తి,సమాజం—చరిత్ర,సంస్కృతీ—ఆలోచన, అనుభవం సమన్వయం, సంఘర్షణ—మొదలైన విషయాలపై అవగాహననూ, దృక్పథాన్నీ కలిగించే ముఖ్యమైన సాధనం నవల. ఇది చేతినుండి సులభంగా జారిపోయే ప్రమాదం ఉంది. ఇది ఇటీవలి ప్రక్రియ కావడంవల్ల, ఒక్కొక్క సమయంలో తక్కువ స్థాయికి చెందిన రచనలు పరంపరగా రావడంతో అపోహకు అవకాశం ఉంది రచయితపై నిశ్చయేతరమైన, కళేతరమైన కొన్ని ఒత్తిడులవల్ల, అతనిలో అనుకోకుండా గాఢత్వం సన్నగిల్లి, దృక్పథం విశ్లథమై ఫార్ములా రచనల విహారం అనివార్యం అవుతుంది.

నవల ఆనందాన్ని కలిగిస్తూనే, ఆలోచననూ వికసింపజేయాలి, పరివర్తనలో భాగం కావాలి. ఇవి ఒక ప్రమాణంలో సామరస్యాన్ని పొంది, పాఠకుల మనస్సుపై చెరగిన ముద్రవేసి కదలికనూ, అంతకుముందులేని ఏదో క్రొత్తనూ, గతినీ కలిగించాలి.

రచయిత, పరిచయంలేని క్రొత్త ప్రపంచాన్ని మన అనుభవంలోకి తేవడానికీ, పరిచయం ఉన్న పాత ప్రపంచం గురించి ఆలోచింపజేయడానికీ ప్రయత్నించాలి అనుభవానికీ, ఆలోచనకూ విస్తృతినీ, వైవిధ్యాన్నీ, గాంభీర్యాన్నీ కలిగించడంలోనే అతని ప్రతిభా స్పర్శ ఉంది.

## III

ప్రతి వ్యక్తీ, ఒక స్థలంలో, ఒక కాలంలో ఒక సాంఘిక, రాజకీయ, ఆర్థిక, నైతిక, వైజ్ఞానిక వ్యవస్థలో భాగంగానే ఉంటాడు. ఒక స్థలంలో నివసించి, ఒక కాలంలో పెరిగి, తోటి వ్యక్తులతో పరస్పర సంబంధం కలిగినపుడు, ఇతని వ్యక్తిత్వం ఎన్నో అంశాల ప్రభావంతో నిర్మితమై ఉంటుంది ఎందరో వ్యక్తుల ఉనికితో, అవసరంతో ఏర్పడిన సమాజం నుండి,రచయిత కథలో తన లక్ష్యానికి ఉపయోగకరమైందీ, విచిత్రమైందీ, విశిష్టమైందీ దారాలుగా లాగి సాలీడు గూడువలె నిర్మిస్తాడు. నవల మానవ జీవితానికి ప్రతి రూపం అనడంలోని యాధార్థ్యం ఇదే. సమాజంలోని వ్యక్తివలెనె ప్రతి పాత్ర, నిర్మాణ రూపాన్ని పొందుతుంది ఈ పరంపరలో ఆశ, నిరాశ — ఆవేదన, ఆరాటం — ఆనందం, విషాదం —సుఖమూ శాంతి మొదలుగా అనేక బింబాలు, ఒకదాని ప్రతిబింబంతో మరొకటీ, మనల్ని ఆకర్షించి మానసికమైన అనుబంధం నెరపుతాయి.

వీని భావనలో ఒక రూపం ఇవ్వడంలో, కొంత కల్పన ఉండవచ్చు అయితే ఎట్టి పరిస్థితులలోనూ మానవీయ సంబంధాలకూ, మానవత్వపు విలువలకూ భంజకంగా ఉండకూడదు. రచయిత చూచిందీ, విన్నదీ ఎంత చిత్రిద్దామనుకున్నా వాస్తవమైన అనుభవ బింబంపై ఎంతో కొంత కల్పన తప్పదు దీన్ని ఒక సంఘటన లేదా పాత్ర రూపంలో ఒదిగింపజేసి కళాకృతి నిచ్చేది రచయిత శక్తి. ఒక గతిని సూచించేది రచయిత దృక్పథం

కథావసరాన్ని బట్టీ, దృక్పథం వైపునా పాత్రలు తీర్చబడతాయి. రచయిత అభిప్రాయాన్ని బట్టి లక్ష్యం ఉంటుంది (1) సమాజంతో అతడు సమన్వయ భావం పొంది ఉండవచ్చు (2) లేదా వ్యతిరేక భావం కలిగి ఉండవచ్చు (3) లేదా సమాజం నుండి తప్పుకునే మనస్తత్వం కలిగి ఉండవచ్చు. రచయిత అభిప్రాయానికీ, వర్తమాన కాలానికీ మధ్య ఎపుడూ ప్రసార రేఖ ఉంటుంది అయితే రచయిత దీన్ని గుర్తించి బాధ్యతను నిర్వహించడంపైనే సమాజంలో నవలకు గల స్థానం ఆధారపడి ఉంటుంది సమకాలీన సమస్యను తీసుకున్నపుడు అందులోనూ వివాదాస్పదమైన సమస్యను ఎత్తుకున్నపుడు ఇతని బాధ్యత మరీ గురుతరమౌతుంది. రచయిత జీవితాన్ని దర్శించి, స్పందించి ఉత్సాహంతో తన అనుభవాన్నీ ఆలోచననూ ఇతరులకు సూటిగా అందజేసే సంకల్పంతోనే ఈ ప్రక్రియను సమీపిస్తాడు — ఆతని అనుభవంలో, సర్వమూ వివేచింపబడి సారభూతమైన రూపాన్ని పొందుతుంది.

ఇక్కడ భాష విషయంలో ఒక మాట - కథనం - సంభాషణ — వర్ణన — వ్యాఖ్యానం, ఇవి వచనంలో ఆవిష్కృతమయ్యేప్పుడు కొంత శిల్పం చోటు చేసుకోక తప్పదు. ఇది పరిమితమై ఉన్నా, దీనిపైనా కొంతవరకు సాహిత్యం విలువలు ఆధారపడి ఉంటాయి.

అన్ని సాహిత్య ప్రక్రియలవలెనే, నవల కూడా సృజనరూపమే. అయితే పాఠకుల బాధ్యత కూడ మనం గుర్తించాలి. రచనలో సారమూ, ఆకర్షణ, లక్ష్యమూ ఉండాలి. పాఠకునిలో తృష్ణ, ప్రయత్నమూ, ఆవేగమూ అవసరం. అనుభూతి, ఆలోచన విషయంలో రచయితతో స్పందనమూ, సుస్వరత అనువదించాలి. ఏక రూపతను పొందాలి.

## IV

బోధనలో కవిత్వానికీ నవలకూ భేదం ఉంది కవిత్వంలో దృష్టిని ఆవరించి చదువుతూ అన్వయక్రమంతో — శబ్ద శిల్పం మొదలుకొని అర్థాంతరం వరకూ, అవగాహనతో మనన శీలంతో ఒక్కొక్కప్పుడు ఒకటికి రెండు మూడు సార్లు చదువుతూ పోవలసి ఉంటుంది ఈ సమయంలో పొందే అనుభవ బింబాన్నీ, ఆలోచనా రీతినీ వివేచిస్తూ పోవడంతో విమర్శ మొదలౌతుంది. నవలలో బోధన సందర్భంలో ప్రతి పంక్తి చదవడం కుదరదు. ఇతివృత్తం స్థూలంగా చర్చించి, సంఘటనల క్రమం, పాత్ర చిత్రణం, సంఘర్షణా విధం, రచయిత దృక్పథం ఇంకా రచనలో ఏవైన ప్రతీకలు ఉంటే అవీ, సిద్ధాంతపరమైన అంశాలూ, వివేచించడం జరుగుతుంది దీనికి ముందు విద్యార్థి ఒకమారు చదువుకొని ఉంటే మంచిది. నవల చదవడానికి ప్రతి విద్యార్థికీ కనీస స్థాయిలో అభిరుచి అవసరం. దీన్ని ప్రోత్సహించి, అతనిలో సంకీర్ణంగా ఉన్న ఆలోచనలను ఒక పద్ధతిలో సుగమంగా తీర్చడానికి అవకాశం ఉంది నవలకు ఉండే ప్రవేశయోగ్యమైన సౌలభ్యం అలాంటిది.

ఒక సంఘటన లేదా ఒక పాత్ర మనలను ఎందుకు ఆకర్షిస్తోంది ? లేదా ఎందుకు వైముఖ్యాన్ని కలిగిస్తోంది ? ఇది పాత్ర వ్యక్తిత్వం వల్ల కలుగుతుందా ? రచయిత నిర్వహణం వల్లనా ? ఈ ప్రశ్నలకు సమాధానం మొదలుగా రచనలో కళా సౌందర్యం నుండి సిద్ధాంతాల వరకూ,ఎదురయ్యే సమస్యలకు సహేతుకమైన, అనుభూతి పరమైన పరిష్కార క్రమం అంతా ఈ విమర్శ స్థానం వహిస్తుంది. కొన్ని నవలలు చదువుతూ పోయిన మీదట, అభిరుచి సంస్కరింపబడి, వివేచనా గుణం ఉత్తేజిత మౌతుంది. మొట్టమొదటి స్థితికీ,ఆ తరువాత స్థితికీ భేదం నవల చదివేప్పుడు ఎవరైనా, అనుభవంలో ఇట్టే గుర్తించవచ్చు. ఒక విశిష్టమైన పరివర్తనకులోనైన మనస్సులో, పాత్రలు, సంఘటనలు, అభిప్రాయాలు అన్నీ కలసి ఒదిగిపోయిన అనుభవ ప్రపంచం స్ఫూర్తికి వస్తుంది. ఈ మనోవ్యాపారం నవల చదవడంలో — కవిత్వంకన్నా అక్లిష్టంగా, ప్రయత్నరహితంగా చాలవరకు సాగిపోతుంది. అయితే విమర్శించేప్పుడు ఎదురయ్యే ప్రశ్నలు వేరు. అధ్యాపకుడు ప్రధానంగా చేయవలసింది, విద్యార్థిలో బీజభూతంగా ఉన్న అభిరుచిని వృద్ధిచేయడం, ఒక విశిష్టమైన రీతిలో దాన్ని మలచి ఆకృతి పొందడానికి దోహదం చేయడమూ. విద్యార్థిలో అసలే అభిరుచి లేకపోతే, మనం చేసేదేమీలేదు. కాని సాధారణంగా

నవలసట్ల అలా జరగదు. తనచుట్టూ ఉన్న జీవిత ప్రపంచమే ఇందులోనూ చూడవలసి రావడంతో, అనుకోకుండా మొట్టమొదట బాంధవ్యం, ఆపైన మానసికమైన ఐక్యతాస్ఫూర్తి పొందుతాడు

ఒక్కొక్క రచయిత గురించీ లేదా రచన గురించీ ముందుగానే, ఏవో అభిప్రాయాలు ఏర్పడి ఉండవచ్చు అది సిద్ధాంత పరమై ఉండవచ్చు. లేదా దేన్నో ఆశ్రయించి ఉండవచ్చు అపుడు వస్తువుపై దృష్టితో సరియైన ఆలోచన జరగడానికి అవకాశం కల్పించవలసి ఉంటుంది. అవసరాన్నిబట్టి సిద్ధాంతపరమూ, కళాపరమూ ఐన దృక్పథాలమధ్యగల అంతరాన్నీ, సామరస్యాన్నీ గుర్తింప జేయాలి. రెండిటి విలువలూ ప్రయోజనమూ, కలసీ — వేరుగా ఏలా రచనలో, ఏ స్థాయిలో ఏ ప్రమాణాలను కల్పించేదీ పరిశీలింప జేయాలి. సైద్ధాంతికంగా అభిమానించినా, కళాత్మకంగా రచన తక్కువ స్థాయికి చెంది ఉండవచ్చు. కళాత్మకంగా పై స్థాయికి చెందినదైనా కళాత్మకంగా ఏకీభవించలేకపోవచ్చు సిద్ధాంతాలకూ కళావాదాలకూ అతీతంగా మానవత — స్వేచ్ఛ మొదలైన విశ్వజనీన మైన అంశాలకు ప్రాధాన్యం ఇచ్చి ఉండవచ్చు. మనం ఆ యా ముఖాలపై వెలుగు ప్రసరించవలసి ఉంటుంది ఈ ప్రయత్నంలో విద్యార్థిలో వివేచనా శీలంతోపాటు విశాల దృక్పథమూ కలిగేట్టు చూడాలి. దీని కతడు విశ్వసించిన సిద్ధాంతాలను వదలనవసరం లేదు విద్యార్థిలో ఆలోచనా స్వేచ్ఛను అరికట్టి బలవంతంగా అతణ్ణి ఒకవైపుకు మరలించడానికి చేసే ప్రయత్నం పనికిరాదు. ఒక్కొక్కమారు ఈ ప్రవృత్తివల్ల వాళ్ళలో తెలీకుండా వ్యతిరేక భావానికి దారితీస్తుంది లోకంలోనూ ఇలంటి సందర్భాలెన్నో తారసిల్లుతాయి. పదిమంది స్వేచ్ఛగా ఆలోచించడానికీ, ప్రకటించడానికీ అలవాటుపడితే ఆ తరువాత తప్పనిసరిగా ఒకరిద్దరి నుండైనా సాహిత్యానికి మౌలికమైన ఉపకృతి జరుగుతుంది.

రచయిత చెప్పే ప్రతి విషయానికీ ఒదిగిపోయి అంగీకరించ నక్కరలేదు. కొన్నిటిని ప్రశ్నించవచ్చు, మరి కొన్నిటిని తిరస్కరించవచ్చు. ప్రశంసగానీ అభిప్రాయభేదంగానీ విషయ ప్రధానంగా ఉండాలి ప్రతి మనస్సుకూ కొన్ని పరిమితులుంటాయి. ఒకవైఖరి ఉంటుంది. ఒక సంస్కార సంపుటి ఉంటుంది ఒక్కొక్క సందర్భంలో హేతువుకు లొంగకపోవచ్చు. వైయక్తికమైన అనుభవం ప్రధానం కావచ్చు. అనుభవశక్తిలో, ఆలోచనా రీతిలో అంతా ఒకే విధంగా ఉండకపోయినా, ఏకీభవించే అంశాలు కొన్ని ఉంటాయి. కొన్ని విభేదించక తప్పనివి ఉంటాయి. ఏమైనా చిత్త సంస్కారం, కొంతవరకు ఆశించిన వికాస ప్రయోజనానికి సమీప వర్తిగా చేస్తుంది.

## V

ప్రస్తుతం పరిశీలనలో ఉన్న నవలను గురించి ఆలోచిస్తే ఇది ఎప్పుడూ రెండు దశల్లో రచన జరుగుతూ ఉంటుంది. మొదటిది — సమస్యలనుండి దూరంగా కాలక్షేపం కోసమో, వినోదంకోసమో ఉద్దిష్టమైంది. దేన్ని గురించీ ఇందులో గాఢంగా చింతన జరుగదు అనుభవ సరంపరను పైపైన స్పృశిస్తూ, తాత్కాలికంగా తప్పుకోడానికీ, మరచిపోవడానికీ నేర్పుగా వ్రాయబడేవి సమస్య — సంఘర్షణ—పరిష్కారం లావణ్యమాత్రంగా ఉండవచ్చు. వీటి నిర్వహణలో గాఢత్వం ఉండదు. అభిప్రాయమూ ఆవిష్కృతం కాదు. రెండవది జీవితం గురించి మన అవగాహనను విస్తృతంచేసేదీ, కళాత్మకమైన విలువన్ని కాపాడేదీ, అనుభవా లోతులు స్పృశిస్తూ నిశితంగా భావింపజేసేదీ — సమస్య — సంఘర్షణ — పరిష్కారం ఒక దృక్పథంతో తీర్చబడి ఉంటాయి. ఈ రచన మొత్తంమీద ఏ అభిప్రాయం ఆవిష్కృతమైనా విశిష్ట మైన వ్యక్తిత్వం కలిగి ఉంటుంది. జీవితం — సంఘం — వ్యక్తి గురించి నిశ్చయమైన అభిప్రాయాలతో లక్ష్యం నిర్దేశింపబడి ఉంటుంది. నవలలో మొత్తంమీద ప్రవలి అంశమూ ఎంత సముచితంగా ఉందీ, ఎంతవరక ప్రమాణాలకు దోహదం చేసేదీ, మనం ఆశించేది సమకూరుస్తుందా ? లేదా ? అన్నవి చివర జరిగే సమాలోచనానికి సంబంధించినవి

ఇతివృత్తం పాత్రలు సంఘర్షణ సంఘటనలు-ప్రతీకలు—అభిప్రాయం అన్నీ విడివిడిగా కాకుండా అన్నిటినీ కలిపి ఏకముఖంగా ప్రసరింపజేసి, సంపూర్ణమైన ప్రభావ రూపాన్ని గ్రహించాలి. ఇది మరీ ముఖ్యమైంది. చదివేప్పుడు ఎక్కడికక్కడ విడివిడిగా పొందే అనుభవం వేరు. అందుకని దీనికి సమగ్రత ఉంది. పై అంశాలు నిజానికి ఒకదానితో మరొకటి తప్పనిసరిగా సంబంధం కలిగే ఉంటాయి. ఉదాహరణకు—ఇతివృత్తానికీ సంఘటనల క్రమానికీ, పాత్రల ప్రవర్తనకీ సంబంధం తప్పనిసరి. లేకపోతే ఆకృతి సిద్ధించదు నవల అనేకమైన అవయవాల సంపుటి, చివరకు అవయవిగా దర్శించడంలోనే అనుభవ సంపూర్ణత కలుగుతుంది. రచయిత అభిప్రాయమూ ఆవిష్కృతమయ్యేది ఈ పైనే. నవలలో అభిప్రాయం (idea) ముఖ్యం ఇది ప్రయోజన సంబంధి ఇది పాత్రల సంభాషణలో, రచయిత మాటల్లో మధ్య మధ్య వివృతం కావచ్చు లేదా సంపూర్ణమైన ప్రభావ పర్యవసానగా సూచితమూ కావచ్చు.

వ్యక్తీ, సమాజమూ రెండూ ఒకదాని నొకటి స్పృశిస్తూ క్రమించిపోయే రేఖలతో, ఎవరూ అనుకోని జీవితచిత్రం ఏర్పడుతుంది ఒక్కొక్కపుడు ఆశ్చర్యంతో ముంచివేస్తుంది మరొక్కపుడు సంతోషంతో తేల్చివేస్తుంది. ఇంకొక్కపుడు విషాదంలో అణచివేస్తుంది. ఒక్కొకమారు అందంగా, ఎండుగా, రక్తిగా, ఉత్సాహంగా, వేగంగా ఉంది, మరోమారు విసుగ్గా, శూన్యంగా, నిస్సారంగా, బరువుగా, మందంగా అనిపిస్తుంది. ఈ స్థితులన్నీ అనేకమైన కేంద్రస్థానాలనుండి సూక్ష్మసూక్ష్మంగా జీవితం భూమికగా స్పందింపజేసే వైచిత్రితో, చప్పన ఆకర్షించే లక్షణం నవలకు ఉంది.

ఈ సందర్భంలో కాస్త అప్రస్తుతమనిపించినా ఒక అంశం స్పృశించవలసి ఉంది. నవల రూపం గురించి కొందరి మాటల్లో ఇది వ్యాసం, జీవిత చరిత్ర, నాటకం, కవిత్వం మొదలైన అనేక ప్రక్రియాఖండాల సంకీర్ణరూపం ఇలా ప్రతిదాని విషయంలో

అంతో ఇంతో ఆధారాన్నిబట్టి చెప్పవచ్చు. స్వచ్ఛమైన కవిత్వం ఇలాంటిదని నిర్వచించడం ఎంత అసాధ్యమో, స్వచ్ఛమైన నవల విషయంలోనూ అంతే. కొన్ని ప్రక్రియలు ముందుగా, విశేషంగా అభివృద్ధి చెందినపుడు ఆ తరువాత రూపుదిద్దుకొనే మరోదానిపై ప్రభావం తప్పనిసరిగా ఉంటుంది. ఒకటి మరోదానిపై సమాంతరమైన ప్రభావమూ నెరపవచ్చు. ఇది సహజం కూడా. అంత మాత్రాన ఒకదాని వ్యక్తిత్వానికి క్షతి కారాదు. ఇలాంటి అభిప్రాయాలేవేవో ఉన్నా ఒకవిధంగా నవల ఏవో కొన్ని నియమాలతో క్రమబద్ధం చేయబడకపోవడంవల్ల ఒకవిధంగా మేలే జరిగిందని చెప్పవచ్చు. లేకపోతే ఇంత త్వరగా, స్వేచ్ఛగా అభివృద్ధి దశకు చేరుకునేది కాదేమో! ఆ నియమాల్లోనే వ్రాయవలసి రావడంవల్ల కొందరే ప్రయత్నించేవారు. వైవిధ్యమూ లోపించేది. ఒకలోపం కాలాంతరాన ఉపకృతిగానూ పర్యవసించవచ్చు.

నవల విలువలకు ప్రమాణం—ఇరువురు, ఒకరు పాఠకులు, మరొకరు విమర్శకులు. మొదట ఏ రచనకైనా పాఠకులే ఉంటారు శ్రోతలూ ఉండవచ్చు. తరువాత వచ్చేది విమర్శకులు. లోకంలో రచన ప్రచారం పొందడానికీ, ప్రతిష్ఠ కలగడానికీ వీరిరువురూ కారకులు. పాఠకుడు సాహిత్యాభిలాష అభిరుచి కలిగి వైయక్తికమైన అనుభవం ప్రభావంగా ఆనందిస్తాడు. ఇది అభిప్రాయ రూపంలో బహిర్గతమౌతుంది. విమర్శకుడు వీటితోపాటు వివేచనా లక్షణం కలిగి ఉంటాడు. వివిధాంశాల నొక పద్ధతిలో విశ్లేషించి, ఆలోచన చేస్తాడు. ఇది అవగాహనకు బాగా తోడ్పడుతుంది. పాఠకుడు, విమర్శకుడు కొంతదూరం సాగి క్రమించిపోయే రేఖలవలె కన్పిస్తారు. వీరిరువురూ కలిసేస్థానం ఉంది. అదే వివేకం. ఇది గ్రహణ పూర్వమైంది. అనుభవ పరమైంది.

ఒక నవల చదవడంవల్ల ప్రయోజనం ఏమిటి? అంటే మనం ఏ ప్రయోజనాన్ని ఆశించి చదువుతున్నామో? దాన్నిబట్టి ఉంటుంది. ఆనందంకోసమా? సంస్కరణ కోసమా? పరివర్తనం కోసమా? అది అందులో దొరికితే వచ్చినట్లు. ఒకవేళ నవల చదవడానికి మొదటి ప్రయోజనం ఆనందం అనుకున్నాం, అనుకోండి! ఉదాహరణకు **(Oscar wilde-picture of Dorian Gray)** ఆస్కార్ వైల్డ్—పిక్చర్ ఆఫ్ డోరియన్ గ్రే; రచన **(Art for Arts sake)** కళ కళకోసమే అన్న సిద్ధాంతానికి ఆదర్శమైంది. మనం అధికంగా ఆనందించగలిగిందేది? ఇక్కడ దీనికి ఆనందాన్ని ఇచ్చే శక్తి ఉందా? సరే! ఏ ప్రమాణంలో ఉంది? ఏవిధంగాఉంది? అన్న భావ పరంపర మనస్సులో సమాధాన స్పర్శతో అంతర్లీనమై ఉండాలి.

నవల చదివేప్పుడు ప్రయాణం గురించికాక, ప్రయాణించేప్పటి అనుభవాన్ని పొందాలి.

వర్తమాన జీవితంలో వచ్చే ప్రతి పరివర్తనా తరంగాన్నీ ఇట్టే సులభంగా, వేగంగా వలీవ పరచుకొని, పురాదశ నుండి ఇప్పటి స్థితివరకూ, మానవ సంస్కృతీ రూపాన్ని ప్రస్ఫుటంగా ప్రతిబింబించే ప్రక్రియ ఇది. నవలలో కళారూపం ఆనందానికీ, దృక్పథం సంస్కారానికీ,అభిప్రాయం పరివర్తనకూ హేతుమూర్తులు.

ఉత్తమమైన నవల ఆలోచనను స్పందింపజేస్తుంది. అనుభవాన్ని వెలిగిస్తుంది. కర్తవ్యాన్ని ప్రబోధిస్తుంది.

**"Novel is the brightest book of Life"**

**—D. H. Lawrance**

## ఉపయుక్త గ్రంథములు


1. The house of Fiction : Henry James
2. The Novel— : R. J. Rees
3. Understanding Fiction : Cleanth Brooks.
4. The craft of Fiction : Lubbock Percy.


# వెలుతురు వాన

### శ్రీ గుడిహాళం రఘునాథం

ఎప్పటిలో దాక్కున్నా వదలదే
ఈ వెలుతురు !
వేల రంధ్రాల్లోంచి జారుతూ
తుంపరలా
నన్ను తడుపుతూనే ఉంది:
నాలో
మగతగా నిద్రిస్తున్న విత్తుల్ని
తట్టి లేపుతూనే ఉంది.
ఈ వెలుతురిచ్చే జాగృతిలోనే
దేశానికంతా ఆశ్రయమిచ్చే
ఆలోచనావృక్షాలు లేస్తున్నాయ్,
నా కళ్ళలో నాటుకున్న
నల్లని
రెండు విత్తనాలనుండి !



ప్రొఫెసర్ పి. వి. అరుణాచలం

# గణితము - ఆధునిక సమాజము

ప్రస్తుత యుగాన్ని 'విజ్ఞాన శాస్త్రయుగమని' పేర్కొంటాము. ఇప్పుడిప్పుడు కంప్యూటర్ యుగమని, ఎలక్ట్రానిక్ యుగమని కూడా అంటూ ఉంటాము విజ్ఞానశాస్త్ర పరిధులు విస్తరిల్లడం వల్ల కంప్యూటర్ మొదలైన పరికరాలు నాగరక సమాజంలో ప్రవేశించడంవల్ల మానవ సమాజం రూపురేఖలు, జీవన విధానాలు, అభిరుచులు, ఆశయాలు ఎంతగానో మారిపోయినాయి. అందరు అనుకొంటారు ఈ మార్పునకు మూలకారణం విజ్ఞానశాస్త్రమని, పైకి కొట్టవచ్చినట్లుగా కనబడే ఇంజనీరింగ్ టెక్నాలజీ, ఎలక్ట్రానిక్స్‌లని. ఇది సత్యదూరంకాదు; కానీ ఈ శాస్త్రాలను, విశ్వ సాంకేతిక విజ్ఞానాన్ని నిరంతరం పోషిస్తూ వాటి వైశాల్యాన్ని విస్తృతంచేస్తూ, అంతర్వాహినిగా సర్వాంతర్యామియైన గణితాన్ని గురించి చాలామంది పట్టించుకోరు. గణిత శాస్త్రమంటే ఎవరో కొందరు పుట్టుకతోనే కుశాగ్ర బుద్ధులైన వారికి తప్ప మిగతా అందరికీ అది కొరకరాని కొయ్యఅని, చలనంలేని గడ్డకట్టిన సిద్ధాంతాలు, నిర్మాణాలు ఉపపత్తులు, తార్కిక వాదనలు — వీటి ప్రోవులని, బూజుపట్టిన గడ్డాల ముసలయ్యలు, అలౌకికము, అసామాన్యము, అతి విచిత్రము అయిన మేధావిభవం గల సోదరులు, పిచ్చిగీతలు గీచుకునే ఆలోచనాపరులు ప్రసాదించిన భాండాగారమని, ఆ భాండాగారం నుండి విజ్ఞాన శాస్త్రవేత్తలు, ఇంజనీర్లు కావలసిన పరికరాలను తీసుకొంటూ ఉంటారని, ఏవేవో గమ్మత్తు అభిప్రాయాలను వెలువరిస్తూ ఉంటారు. నిజానికి ప్రకృతిని అర్థం చేసుకొని, ప్రకృతి శక్తులను వశపరచుకొని దానిపై ప్రభుత్వం నిర్వహించే మానవ ప్రయత్నాలకు సహకరించి తద్విజయ సాధనలో తానూ అభివృద్ధిచెందే పరమ చైతన్యస్రవంతి గణితం. అనుక్షణం ఎదుగుతున్న మానవ మేధస్సుకు సంబంధించిన ఒకానొక విభవోన్మేలనమే గణితము. అందరికీ అర్థమయ్యేటట్లుగా అన్ని ప్రక్రియలను, అంశాలను స్పృశిస్తూ గణిత శాస్త్రాన్ని నిర్వచించడం బహుకష్టం ప్రొఫెసర్ మారిస్ క్లైన్ ఒక చోట అంటాడు: "ప్రకృతి ఎన్నడూ బహిర్గతం చేయదలచని విషయాలను గణితశాస్త్రం హేతువాదంద్వారా బహిర్గతం చేస్తుంది." అంతరిక్షంలో తిరిగే గ్రహాల గమన రీతులు, రేడియో తరంగాలు, పరిశోధనా నియంత్రణలు, క్వాసారు, పల్సారు, కృష్ణ వివరము **(Block holes)**లు, అణు, పరమాణు, కణకేంద్ర **(Nuclear)** నిర్మాణ విషయ పరిజ్ఞానము, కృత్రిమ ఉపగ్రహాలసృష్టి మొదలైనవి ప్రధానంగా గణితశాస్త్ర అన్వేషణ ఫలితాలే.

తత్త్వ శాస్త్రంలో, గణిత శాస్త్రంలో, ఆంగ్ల సారస్వతంలోనూ ప్రపంచ ఖ్యాతి పొంది, ఇరువదవ శతాబ్దపు గొప్ప మేధావులలో ఒక్కరుగా పరిగణించబడిన బెర్ట్రాండ్ రస్సెల్ అంటాడు: "సరిగ్గా విచారిస్తే, గణిత శాస్త్రంలో సత్యరూపమైనదే గాక ఉదాత్తమూ అయిన సౌందర్యం ఉంది మహోత్తమమైన కళ ఆవిష్కరించే ఉత్కృష్ట పరిణతిని ఇది ప్రదర్శిస్తుంది. అతిలోకమైన ఆనందానుభూతికి నికషోపలమైన కావ్యరసోద్దీప్తి వంటిదే గణితంలోను ఉన్నది" ఒక సౌందర్యమే గాక మానవుల జీవితాలకు సంబంధించిన అన్ని విధాల కళాత్మక ప్రక్రియలకు గణిత శాస్త్రం రాచబాటలు వేస్తుంది. తార్కిక వాదనకు, నిరూపణకు లోగిన ఫలితాలను ముందుగానే ఊహించడానికి అవసరమైన పరిణత స్ఫురణను, కల్పనా శక్తిని, ఊహా విభవాన్ని సాధకునికి గణితం ప్రసాదిస్తుంది.

అతిప్రాచీన ప్రపంచనాగరకతలలో, వేదకాలంలో, ఉపనిషత్తుల యుగంలో సాంప్రదాయిక గ్రీకు శకంలో, అలెగ్జాండర్‌కు సమకాలికమైన గ్రీకు చరిత్రలో, ప్రాచీన ఈజిప్టు, బాబిలోనియన్ల కాలంలో, అరబ్బుల నాగరకతలో, మధ్య యుగాల యూరోపు సమాజాలలో జనజీవన విధానాన్ని, సమాజపు రూపురేఖల్ని మార్చడంలో గణిత శాస్త్రం సాధించిన విజయాలు కోకొల్లలు.

ఆధునిక సమాజం మీద గణిత శాస్త్ర ప్రభావాన్ని చర్చిస్తాము. పందొమ్మిది — ఇరువై, ఈ రెండు శతాబ్దాలలో కొనసాగిన గణిత శాస్త్రాభివృద్ధి మరెప్పుడు జరుగలేదు గణితశాస్త్రం సర్వతోముఖంగా వికసించింది. గణిత శాస్త్రం పెరగడం వల్ల విజ్ఞాన శాస్త్రం పెరిగింది. విజ్ఞాన శాస్త్రం పెరగడం వల్ల ఉత్పన్నమైన క్రొత్త క్రొత్త సమస్యలను సాధించడంలో సవాళ్ళను ఎదుర్కొని, గణితం కూడా ఎంతగానో పెరిగింది. ఆధునిక యుగంలో గణితాత్మక కార్యకలాపాలను బాగా ఉత్తేజ పరచిన ముఖ్య విషయాలలో విద్యుదయస్కాంతాల అధ్యయనము, ఒకటి. మారిస్ క్లైన్ పేర్కొన్నట్లు "ఈ విజ్ఞానం శైశవావస్థలో ఉన్నప్పుడే విద్యుత్ మోటర్, విద్యుత్ జనరేటరు, టెలిగ్రాఫీలు ఉత్పన్నమైనాయి. ప్రాథమిక భౌతిక సిద్ధాంతాలు గణితాత్మకంగా చెప్పబడినాయి." గలీలియో, న్యూటనులు గతిమాత్రాలలో నూతన విజ్ఞానాన్ని ఆవిష్కరించినట్లే, ఈ భౌతిక సిద్ధాంతాలకు గణిత సిద్ధాంతాలను అన్వయించే అవకాశం ఏర్పడింది. గణిత శాస్త్రాన్ని ఆధారంగా చేసుకొనే జేమ్స్ క్లార్క్ మేక్స్‌వెల్ విద్యుదయస్కాంత తరంగాలను కనుక్కొన్నాడు ఇట్లాగా గణిత శాస్త్రాన్ని ఆశ్రయించిన నూతన సిద్ధాంత ప్రపంచ మొకటి ఉద్భవించింది. అందరికీ తెలిసిన రేడియో, టెలివిషన్లు ఇలా ఆవిర్భవించినవే. అత్యాధునిక పరికరము కంప్యూటర్ గూడా ఈ కోవకు చెందిందే.

విద్యుచ్ఛక్తి, రేడియో, టెలివిషన్, కంప్యూటర్. ఇవి లేకుంటే ఆధునిక ప్రపంచమే **లేదు**. వీటి ఆవిష్కరణకు సాయపడిన ప్రాథమిక భావన రేడియో తరంగాలు. వీటి ఉనికిని పరిశీలించాలనే ఊహ మానవ మేధస్సులో ఉద్భవించడానికి కారణ భూతము గణిత శాస్త్రమే

అబాకస్ (**Abacus**), లఘు గుణకాలు, స్లైడ్ రూలు యాంత్రికంగా నిర్మితమైన గణన సాధనాలు, ... ఈ విధంగా ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ మనం ఆధునికంగా ఎలక్ట్రానిక్ కంప్యూటర్‌ను కనుక్కొన్నాము. యుగ ఖ్యాతిని సంతరించుకొన్న కంప్యూటర్ నిర్మాణంలో గణితశాస్త్ర పాత్ర ఎంతో ఉంది.

విశ్వతాత్త్వికచింతనను, భావనావైఖరిని బాగా ప్రభావితం చేసిన ఐన్‌స్టీయన్ సాపేక్ష సిద్ధాంతానికి సత్య పీఠాన్ని, తార్కిక బలాన్ని సమకూర్చిన గణితాధ్యాయాలు (**I**) రీమాన్ జామితి, (**II**) టెన్సర్ కలనము. గురుత్వాకర్షణ దేశకాలములు — ఈ మూటిని ముడివేసి విశ్వ రహస్యాలను శోధించి, కాలము సాపేక్షమని ఒక నూత్న వైజ్ఞానిక తత్త్వాన్ని జగద్విఖ్యాతంగా ప్రకటించి, అంతరాళ వక్ర స్వభావ స్వరూపాలను సోపపత్తికంగా నిరూపించి శక్తి శివముల పరస్పర పరివర్తన రహస్యాలను ప్రవచించి మహా మనీషిగా అజరామర ఖ్యాతిని సంపాదించిన ఐన్‌స్టీయన్ తన సిద్ధాంతాలన్నీ గణితీయంగా చర్చించినాడు. అనంత విశ్వ పర్యవసానమును ఊహించడానికి ఉపయోగపడే టాపాలజీ (**Topology**)కూడా గణిత విభాగమే $E=mc^2$ అనే శక్తి, ద్రవ్యరాశులను కలిపే మహా సమీకరణం నింగిలో నీలపు రంగు నిలిచియుండేదాక ఐన్‌స్టీయన్ విజ్ఞాన విజయ పతాకాన్ని ఎగురవేస్తుంది. ఐన్‌స్టీయన్ అన్నట్లు ''రాజకీయాలు, దానివల్ల ఏర్పడే పరిణామాలు తాత్కాలికాలు, గణిత సమీకరణాలు శాశ్వతాలు'' — విశ్వరూప దర్శనంలో మైక్రో (**Micro**), మెక్రో (**Mecro**) మేక్రో (**Macro**) దృక్పథాలను ఏర్పరచి, సూక్ష్మ, దృగ్గోచర, అనుభవైకవేద్య, అనంత విశ్వ సందర్శనానికి నిరంతరం సాయపడి మన మనస్సులలో తాత్త్విక జిజ్ఞాసను పెంపొందించి, సంస్కారాన్ని కలిగించే జ్ఞాన జ్యోతి గణిత భారతి.

చిత్ర విచిత్ర కమనీయమైన ఈ విశాల విశ్వ ప్రకృతిలో అనేక సన్నివేశాలలో గణిత విన్యాసాలుంటున్నాయని సుప్రసిద్ధ తత్త్వవేత్తలు, జ్ఞానులు, విజ్ఞానులు అనాదిగా పేర్కొంటున్నారు. టాలమీ సిద్ధాంతాలు గలీలియో కెప్లరు వాదములు, ఆర్యభట, బ్రహ్మగుప్త, వరాహమిహిరాచార్యుడు, మొదలగువారి సిద్ధాంతాలు, కాంతి గమన చర్చలు, గతిశాస్త్ర వికాసము, సంగీత ధ్వని విశ్లేషణ, సంభావ్య సిద్ధాంతము ఖగోళ, భూగోళ, భౌతిక రహస్య శోధనలు, అంతరిక్ష పరిశోధన మొదలైన సందర్భాలలో గణిత **ఖేల**నము మానవకల్యాణానికి దోహదకారిగా పరిణమించింది. భౌతిక సమస్యలకంటే క్లిష్టములు జీవశాస్త్ర సమస్యలు, సామాజిక విజ్ఞాన సమస్యలు. ఒక జీవిలో కోట్ల సంఖ్యలో జీవకణాలుంటాయి, ఒక సమాజంలో కోట్లాది జనుల నడవడులు, నమ్మకాలు ఉంటాయి. జీవి జీవనాన్ని, ఒక సమాజ్యగమనాన్ని నిరంతరం ఆదేశిస్తూ ఉంటాయి, కోట్లకొలది కణాలు, గుణాలు. వీటిని పరిశోధించడానికి ప్రామాణిక సూత్రాలు లేవు. అనుక్షణం పరివర్తన చెందుతూ, **Determinism** పరిధికి లోబడని విషయాలను అధ్యయనంచేయడానికి బాగా ఉపకరించే గణిత పరికరాలు ఎన్నో ఉన్నాయి. గడచిన పాతిక సంవత్సరాలుగా సాంఘిక, పారిశ్రామిక, రక్షణ, వైజ్ఞానిక, సాంస్కృతిక, ఆరోగ్యరంగాలలో గణితశాస్త్రప్రయోజనం ఊహించడానికి వీలులేనంతగా కొనసాగుతూఉంది **Game theory, Information theory, Operations Research, Queuing theory Inventory control, graph theory, Systems analysis, linear programming, Cybernatics** మొదలైన వినియుక్త గణిత శాఖలు ప్రవర్ధమానమవుతూ ఉన్నాయి

గణిత శాస్త్రంలో వివిధ శాఖలు ఎట్లాగా మానవ నాగరకతను, ఆధునిక జీవన విధానాన్ని ప్రభావితంచేస్తూ ఉన్నవో తెలుసుకోవడానికి ఒక విహంగ వీక్షణను ప్రసరిస్తాము. కలన గణిత పద్ధతుల వల్లనే యంత్రయుగం అభివృద్ధి చెందినది. వంతెనలు కట్టడం, ఎలక్ట్రిక్ మోటార్లు నడపడం, థర్మోడైనమిక్ సిద్ధాంతాలు నిర్మించడం, విద్యుత్ క్షేత్ర ధర్మాలు తెలుసుకోవడం, రసాయనిక ప్రతిక్రియలను చర్చించడం అంతరిక్షయానం మొదలైనవి సులభ సాధ్యములైనవి. రాకెట్లను ప్రేల్చడంలో, కృత్రిమ ఉపగ్రహాలను ఏర్పరచడంలో న్యూటన్ ప్రవచించిన సాంప్రదాయిక గతిశాస్త్ర సూత్రాలే ప్రాతిపదికలు.

రెండు ప్రపంచ సంగ్రామాల ఫలితంగా కోట్ల కొలది జనం మరణించారు. అణుబాంబులు, ఉదజనిబాంబులు మొదలైన మారణాయుధాలు మానవుని అమ్ముల పొదిని ఆక్రమించినాయి. ఈ మారణాయుధాల తయారీలో కూడా గణితశాస్త్ర సిద్ధాంతాలు ప్రయోగింపబడినవి.

జీవకణాన్ని సద్యశీకరించడంలో గణిత ప్రయోజనం నానాటికీ పెరుగుతూ ఉన్నది గణితీయ జీవశాస్త్రము (**Mathematical Biology**) మీద గ్రంథాలు, పరిశోధన వ్యాసాలు, మాసపత్రికలు వెలువడుతూ ఉన్నాయి. నాడీమండల ధర్మాలను క్షుణ్ణంగా అవగాహన చేసుకోవడానికి మేధస్స కార్యకలాపాలను విశ్లేషించేందుకు భవిష్యత్తులో ఎంతగా గణితం ఉపకరిస్తుందో నేటి మన ఊహలకు అందదు.

జీవశాస్త్రంలో జీవపదార్థ నిర్మాణాలను పరిశీలించడంలో జీవ రసాయన శాస్త్రజ్ఞులు ఎన్నో చిక్కులను ఎదుర్కొంటారు గణితశాస్త్ర శాఖ టాపాలజీకి సంబంధించిన గ్రాఫ్‌వాదముద్వారా ఎంత క్లిష్టమైన నిర్మాణాలనైనా గణితీయ భాషలోనికి అనువదించి, అవగాహన చేసుకోవచ్చు. తరువాత కంప్యూటర్‌ద్వారా వాటిని అనేక దృక్పథాలనుంచి విశ్లేషించి పరిశీలించవచ్చు. ఈ విధంగా కర్బన రసాయన శాస్త్రాధ్యయనాన్ని సులభీకరించవచ్చు. ఇట్లాగే రసాయన జన్యశాస్త్రం (**Chemical genetics**)లో **కూడ** గణితీయ పద్ధతులను ప్రవేశపెట్టి పార్యాంశాలను సులభతరం చేయవచ్చు.

ప్రపంచంలోని భాషలు సులభంగా ఇన్ని అని లెక్కించలేము. అవి అసంఖ్యాకములు. ఒక ప్రాంతంలో ఒక భాషలో సులభంగా భావ ప్రకటనలు, వ్యవహార నిర్వహణలు చేసుకోవచ్చు. ఒక ప్రాంతీయులు మరో దూర ప్రాంతీయుల భాషలో భావ ప్రకటనలు మొదలగునవి చేసుకోడానికి వీలుపడటంలేదు. భాష భాషకు ఎంతో వైరుధ్యము, వైవిధ్యము, ప్రత్యేకతలు ఉన్నాయి. అయినప్పటికీ సామాన్య ధర్మాలదృష్ట్యా కొన్ని సారూప్యము లుంటాయి. ఈ సామాన్య ధర్మాలను, సారూప్యాలను చర్చించేందుకు గణితాన్ని బాగా ఉపయోగించి, గణితీయ భాషాశాస్త్రాన్ని ప్రారంభించి గొప్ప పరిశోధనలు సాగిస్తూ ఉన్నారు.

సేంద్రియ పదార్థాలు, పరిసరాల కలయికలు, పరస్పర చర్యలను చర్చించే శాస్త్రము ఈకాలజీ (Ecology). ఈకాలజీ అధ్యయనంలో వాతావరణకాలుష్యాన్ని (atmospheric pollution) పరిశీలించడంలో అనేక గణిత నమూనాలను ప్రవేశపెట్టి పరిశోధనలు సాగిస్తున్నారు ప్రపంచ మందన్ని దేశాలలోని శాస్త్రజ్ఞులు.

రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలో యుద్ధవ్యూహాలను, పద్ధతులను అభివృద్ధి పరచడానికి విజ్ఞానశాస్త్రం బాగా కృషి చేసింది. ఈ కృషి ఫలితంగా కొత్త వినియుక్త గణితశాఖ పుట్టింది. ఆపరేషన్స్ రిసర్చ్ (Operationsresearch) అనే వ్యవహార నామంతో వర్ధిల్లుతూ ఉంది. పాత రోజుల్లో యుద్ధానికి సంబంధించిన ఆయుధాలను ఉత్పత్తి చేయడానికి ఉపయోగపడేది విజ్ఞానశాస్త్రం కానీ ఆపరేషన్స్ రిసర్చ్ అవతరించిన తరువాత యుద్ధాలలో ఆయుధాలను ఏలా ఉపయోగించవలసనేది ముఖ్యవిషయమైనది. యుద్ధ విషయాలలో పెనవేసుకుని ప్రారంభమైన ఆపరేషన్సు రిసర్చి సామాజిక సంబంధమైన అనేక రంగాలలో ప్రయోజనకరమైనది. ప్రభుత్వ కార్యకలాపాలు, వ్యాపార విషయములు, పారిశ్రామిక సమస్యలు వీటన్నింటిలో ఆపరేషన్సు రిసర్చి ప్రమేయం ఎంతైనా ఉన్నది.

కంప్యూటర్‌లో గణితం ప్రాథమిక స్థాయినుండి ఉపయోగపడుతుందని ఇదివరకే పేర్కొన్నాము. ద్వంద్వాంశ సంఖ్యామానము (Binary Code) కంప్యూటర్ కార్యకలాపాలకు మూలాధార గణితాంశము. గణిత శాస్త్రజ్ఞులను, నాడీమండల నిపుణులను, భౌతిక శాస్త్రజ్ఞులను, ఇంజనీర్లను తికమకపెడుతూ, అత్యాశ్చర్యకరంగా అభివృద్ధిపొందుతూ ఆధునిక నాగరికతలో అతి ముఖ్యపాత్రను వహించే విజ్ఞానశాఖ సైబర్ నాటిక్స్. ఈ విజ్ఞాన శిశువును కని, పెంచినవాడు నార్బట్ వీనర్ సైబర్ నాటిక్స్ వృద్ధికి దోహదమిస్తూ కొత్త వినియుక్త గణిత శాఖలు పుష్కలంగా ఎదిగినాయి. అవి ఇన్‌ఫర్‌మేషన్ థియరీ (Information theory), గేమ్స్ థియరీ (Games theory), భాషాశాస్త్రము మొదలైనవి. స్వయం చోదిత యంత్రాలకు, మనుజుని నాడీమండల కార్యకలాపాలకు కల సారూప్య సంబంధాలను గణితీయంగా చర్చించడంలో సైబర్ నాటిక్స్ అద్భుత విజయాలను సాధిస్తూ ఉన్నది.

అనేక స్థలాలలో కర్మాగారాలను నెలకొల్పి పెద్ద పారిశ్రామికుడు ఒకవస్తువును ఉత్పత్తిచేస్తున్నాడు ఈ వస్తువు సరఫరా చేయడం ఎట్లా? కనీసపు ఖర్చులతో కాలవ్యయం ఎక్కువ గాకుండ, రవాణా ప్రమాదాలకు గురికాకుండా వినియోగ వస్తువును సరఫరా చేయడానికి పారిశ్రామికునకు సలహాలిచ్చి సాయపడే విజ్ఞానము లీనియర్ ప్రోగ్రామింగ్ (Linear Programming). ఈ శాఖను ప్రారంభించిన మనీషి జాన్‌ఫాన్ నాయమాన్ (John Von Neumaun). స్థూలంగా చెప్పాలంటే కొన్ని నిబంధనలకు (Constaint) లోనై ప్రవర్తిల్లే అనేక చలరాశులకు సంబంధించిన సమస్యలకు అనుకూలమైన సమాధానాలు వెదకడమే లీనియర్ ప్రోగ్రామింగ్‌లో ఇమిడియున్న గణిత విషయం.

అసంఖ్యాకంగా వస్తువులను ఉత్పత్తిచేసే పారిశ్రామికుడు ఉత్పత్తి అయిన వస్తువులు ఒక నమూనాకు లోనై, కొన్ని పరిమితులలో ఏక రూపత్వాన్ని (Uniformity) పొంది ఉండాలని ఆశిస్తాడు. అటువంటి తయారీలో విజయం సాధిస్తేనే పరిశ్రమలు సమకాలీన సమాజంలో ఉత్పత్తిదారుణ్ణి, వినియోగదారుణ్ణి ఉత్సాహపరుస్తాయి. ఈ రంగంలో గణితశాస్త్రం సంభావ్య సిద్ధాంతరూపంగా, సాంఖ్యక పద్ధతులను అవలంబించి సాంఖ్యక గుణ నియంత్రణం (Stastical Quality control)గా వ్యక్తుల దైనందిన జీవితాలమీద తన ప్రభావాన్ని ప్రసరిస్తుంది.

పొగపీల్చితే శ్వాసకోశానికి కేన్సర్‌వ్యాధిసోకే ప్రమాదమున్నదా? ఒక జబ్బును నయం చేయడంలో అనేక ఔషధాలు ఉపయోగపడే సందర్భం ఉందనుకొందాము. ఏ ఔషధంవల్ల ఎక్కువ ప్రయోజనం కలుగుతుంది? ఇట్లాంటి ప్రశ్నలకు సమాధానాలను యివ్వటంలో గణితీయ పద్ధతులను అవలంబించిన సాంఖ్యకశాస్త్రం సాయపడుతుంది.

ఎంతో ధనం, శ్రమ, కాలములను వెచ్చించి కట్టిన వంతెనలు, భవంతులు నిరంతర ప్రకంపనాలకు గురి అయ్యే పక్షంలో వాటి వయఃపరిమితికి భంగం కలుగుతుంది. ఈ ప్రమాదాలను పసికట్టడంలో, తగ్గించడంలో ఇంజనీరింగ్ శాస్త్రాలకు సాయపడి, అఖండ విజయాలను సాధించే సదిశాంతరాళముల శాఖ (Vector spaces) ప్రధానమైన ఆధునిక గణితశాఖ.

ఆర్థికశాస్త్ర నమూనాలు (Economic models) తయారుచేసి ఒక దేశ జనజీవన విధానాన్ని ప్రణాళికలద్వారా అంచెలంచెలుగా అభివృద్ధి పథంలో ఉంచడానికి గణితశాస్త్రం నిరంతరం సహకరిస్తుంది. జనాభా సమస్యలు ప్రపంచాన్ని వేధించే ఈ రోజుల్లో వీటికి సరియైన సమాధానాలు కనుక్కోడానికి గణిత శాస్త్రం ఎంతగానో ఉపకరిస్తుంది అందుకనే నెపోలియన్ ఏనాడో అన్నాడు: ''గణిత శాస్త్ర వికాసము, పరిపక్వత – దేశ కల్యాణము పురోభివృద్ధులు ఒక దానితో ఒకటి అతి సన్నిహితంగా పెనవేసుకుని ఉంటాయి'' అని.

ఇటీవల ఆరేళ్ళ క్రితం ఇజ్రాయిలులో చరిత్రాత్మకమైన ఒక అంతర్జాతీయ సమావేశం జరిగినది. ప్రపంచ విజ్ఞానం ఏ రేటులో అనుక్షణం అభివృద్ధి చెందుతూ ఉన్నదో వారు చర్చించి, ఒక నిమిషానికి 200 పుటలు పరిశోధన స్థాయిలో విలువ కట్టతగిన కొత్త విజ్ఞాన సామగ్రి తయారవుతోన్నదని, అందులో గణితంపాలు అరవైయింట ఒక్కటనీ, అంటే ఒక గంటకు రెండు వందల పుటల కొత్త గణిత పరిశోధనా ఫలితాలు మన విజ్ఞాన భాండాగారానికి చేరుతూ ఉన్నదని అంచనాలు వేసినారు. ఆ నాడు తేలిన లెక్కలను బట్టి 2400 శాఖలతో గణిత మహావృక్షం, విశ్వ విజ్ఞాన గగన వీధులకు ఎగబ్రాకుతూ ఉన్నదని ప్రకటించినారు. ప్రతి పది సంవత్సరాలకు గణిత విజ్ఞానం రెట్టింపవుతూ ఉన్నదని కూడ వారు చెప్పినారు. ఇంత వేగంతో ఉత్పత్తి అయ్యే ప్రతి గణితాంశము తక్షణమే ఆధునిక మానవ జీవితాన్ని ప్రభావితం చేస్తుందనలేము. గణిత చరిత్ర చదివిన వారికి బాగా తెలుసు శాంకవాలు క్షేత్రగణిత భావాలుగా బయల్వెడలిన రెండువేల సంవత్సరాలకు తరువాత ఖగోళ గతి శాస్త్రంలో, పరమాణు గర్భాంతర గమనంలో వాటి వినియోగాన్ని మనుజుడు గ్రహించినాడు. సుమారు మూడు వందల సంవత్సరాల క్రితము ఒక ఆసక్తికరమైన మేధా విన్యాసంగా అంక గణితములో ప్రవేశించిన ద్వంద్వాంశ సంఖ్యలు నేటి కంప్యూటర్‌లో అనువృతమైనాయి. తనకంటే ఎన్నో ఏళ్ళ క్రితం గణితాచార్యులు చర్చించిన జ్యామితి, టెన్సర్ కలనాదులను బాగా ఉపయోగించుకొన్నాడు ఐన్‌స్టీయన్. గనుక పరిశోధనలో ఉత్పన్నమయ్యే గణితంలో ఏది ఉపయోగకరమైనది. ఏది కాదు అన్న ప్రసక్తే ఉండ కూడదు. ఈనాడు నిరుపయోగంగా కనపడే గణితాంశము రేపు ఔపయోగిక దృష్ట్యా మహోత్కృష్టంగా రూపొందవచ్చు.

సుప్రసిద్ధ గణిత స్రష్ట లెబొవ విస్కి "ఎంత అరూపతను సంతరించుకొన్న గణితమైనా అది ఎప్పుడో ఒకనాడు యదార్థ ప్రపంచానికి ఉపయోగపడకుండా ఉండటానికి వీల్లేదు," అన్నాడు. "మనం సైద్ధాంతిక భావనా ప్రపంచంలో ఎక్కడో విహరిస్తూ ఉన్నప్పుడు బహుశః పరమ లౌకిక వినియుక్త సన్నివేశాలకు చాల చేరువగా ఉంటూ మనడంలో విరోధాభాసం లేదు" అని చెప్పినాడు విఖ్యాత గణితజ్ఞుడు, తాత్త్వికుడు అయిన ప్రొఫసర్ ఎ. ఎన్. వైటిహెడ్

[ఆకాశవాణి – కడప. సౌజన్యంతో.]

# ఎద్దు ముఖం

## శ్రీ మానేపల్లి సత్యనారాయణ

మాయింటి యెదుట మఱ్ఱిచెట్టు చల్లని నీడలో
ఒక ముసలిఎద్దు పడుకుని
కాయకష్టపు జీవితానుభవం కళ్లల్లో నీళ్లాడుతుండగా
ఎండ రంగులోవున్న ఎండుగడ్డి నములుతున్నది

నా మనసు గాలిలా వ్యాపిస్తోంది
మన అందరి ముఖాల్లోనూ ఏదో ఒక జంతువు
తొంగి చూస్తుందన్న ఒకానొక మహానుభావుడి మాట
మనసులో వేళ్లు వెదుక్కుంటోంది

మెదడుతో మనుషుల్ని వాసన చూస్తున్నాను ...
మాయింట్లో పాతకాలపు ఫొటో అద్దం కళ్లలో
ముసలి ఎద్దు కనపడుతున్నది

ఆ ముసలి ఎద్దు ముఖంలో ఎన్నెన్నో
పరిచిత ముఖాలు నీళ్లల్లో బింబాల్లా తేల్తున్నాయి
నా ముఖం నేనే అద్దంలో చూసుకున్నట్టు
ఒక్కక్షణం ఒప్పుకున్నది మనసు

నా మనసు ఒక్కక్షణం ఆకాశంలా
చరాచర సమస్త సృష్టినీ కావలించుకుంది!
మానవులూ జంతువులూ వేరు వేరు కాదు
అందరికీ అంతా కావలసిన వాళ్లేనని
ఎండరంగులోవున్న ఎండుగడ్డి నెమరువేస్తున్న
ముసలిఎద్దు బోధిస్తున్నట్టు తోచింది



హిందీ మూలం : డా॥ అరిగిపూడి రమేశ్ చౌదరి

# నవ్వు

నేను శర్మను చాలా రోజుల తరువాత కలుసుకొన్నాను. అతను ఇంత అకస్మాత్తుగా బెంగుళూరులో కనిపిస్తాడని ముందుగా వూహించలేదు. క్రొత్త ప్రదేశంలో ఒక పరిచితుడు కనిపించగానే చాలా సంతోషం కలిగింది. ఏవో విషయాలు చర్చిస్తూ హోటల్‌కు వెళ్ళాము. మా ఇద్దరిమధ్యా చాలా కాలంగా ఉత్తర ప్రత్యుత్తరాలు లేకపోవడంవల్ల అతని ప్రస్తుత స్థితిగతులను గురించి తెలుసుకొనే అవకాశం లేకపోయింది.

శర్మ మంచి కలుపుగోలు మనిషి. కొంత వాగుడుకాయ కూడా. జీవితంలో ఎన్నో అనుభవాలు గడించిన వ్యక్తి అలాంటి వాడు మౌనంగా ఎలా వుండగలడు ?

సుమారు పదిహేను సంవత్సరాల క్రిందట కనిపించినప్పుడు అతను ఏదో చిన్న వార్తాపత్రికకు ఉపసంపాదకునిగా పనిచేసేవాడు. అప్పటికి అతని వయస్సు ముప్ఫైకి పైగా వుంటుంది. ఇప్పుడు వయస్సుతోపాటు అతనిలో అనేక మార్పులు వచ్చాయి. నేను బెంగుళూరు వస్తున్నట్టు ఎలా తెలిసిందో స్టేషన్‌కు వచ్చాడు.

''మీరు ముందుగా నాకు ఉత్తరం వ్రాస్తే బావుండేది'' అన్నాడు దిక్కులు చూస్తూ.

''మీ అడ్రసు తెలిస్తేగద, జాబు వ్రాయడానికి'' అన్నాను నేను.

''అవును. తప్పునాదే. నాకు కేశవన్ కనిపించాడు లేకపోతే మిమ్మల్ని కలుసుకోలేకపోయేవాడినే. మీరు వస్తున్నట్టు అతనికి తెలియపరచారట కదా !''

నేను మీకు ఉత్తరాలు వ్రాయడానికి చాలాసార్లు ప్రయత్నించాను. కాని ఏమని వ్రాసేది ?''

''ఏమయ్యింది ?''

''అప్పుడప్పుడూ కథలు వ్రాసేవాడిని. కాని ఇప్పుడు నా బ్రతుకే ఒక కథగా మారింది.''

''ఊఁ.''

''ఏడ్చే శక్తిలేక నవ్వడానికి అలవాటు పడ్డాను. నా జీవితం ఎలావున్నా కనీసం పిల్లవాడి బ్రతుకైనా బాగుపడుతుందని ఆశించాను. కాని ఫలించే సమయానికి చెట్టుమీద పిడుగు పడుతుందని అనుకోలేదు.''

''ఇప్పుడు బావున్నాడా ?''

''బాగానే వున్నాడు; పై లోకంలో. ఏమిటో వచ్చిన వాళ్ళంతా అక్కడ ఏదో సుఖపడతారని అందరూ అనుకోవడమేగాని ఇంతవరకు అక్కడనుంచి తిరిగివచ్చి, తను ఎంత సుఖపడ్డదీ తెలియజెప్పిన వాడెవ్వడూ లేడు, ఇంతవరకూ'' అంటూ శర్మ పిచ్చివాడిలా నవ్వసాగాడు. నవ్వుతూ తన దుఃఖాన్ని దాచాలని ప్రయత్నిస్తున్నాడు.

నేను మాత్రం నవ్వలేకపోయాను.

''వాడు ఇప్పుడు మన లోకంలో లేడు'' అని నవ్వుతున్న వాడల్లా ఒక్కసారి గంభీరంగా మారిపోయాడు.

''వాడిని చదివించడానికి ఎన్నో కష్టాలు పడ్డాను ''

''అవును. నాకు తెలుసు ''

''బి. కాం పూర్తి చేశాడు. ఏవిధమైన సిఫారసూ లేకుండా బ్యాంకులో ఉద్యోగం దొరికింది'' అంటూ నిట్టూర్చాడు.

''నేను వాడి ఉద్యోగం కోసం ఎవరి కాళ్ళూ పట్టుకోలేదు

వాడే పరీక్షలో ప్యాసయ్యాడు. బెంగుళూరులోనే ఉద్యోగం దొరికింది. మొదటి జీతం తీసుకోకుండానే జ్వరం వచ్చింది. శాశ్వతం వాడిని మాకు దూరం చేసింది. ఒక అభాగ్యురాలిని విధవను చేసింది. మామీద పిడుగు పడింది' అంటూ మళ్ళా నవ్వడానికి ప్రయత్నించాడు. కాని నవ్వలేక వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించాడు.

నాకు మాత్రం శర్మ ఇవన్నీ నా దగ్గిర నుంచి డబ్బు గుంజడానికి చెబుతున్నట్టు అనిపించింది.

''రండి. మా ఇంటికి వెళదాం'' అంటూ ఆహ్వానించాడు.

''వస్తాను. ఈసారితప్పకుండా వదినగారిని కలుసుకోవాలి.''

''ఆవిడ ఇక్కడ లేదు. పుట్టింటికి వెళ్ళింది.''

''అలాగా.''

''ప్రస్తుతం నేను, మా రెండోవాడూ వుంటున్నాం వాడే నాకు కావలసినవన్నీ చూస్తున్నాడు. నాకు వండిపెట్టి, కాలేజికి వెళుతున్నాడు ఏమిటో, ఉద్యోగం రావాలంటే మెరిట్ అయినా వుండాలి, లేదా సిఫారసు కావాలి. వాడికి ఇంటి పనితోనే సరిపో

తుంది. మెరిట్ ఎలా వస్తుంది? ఇక సిఫారసు సంగతి సరేసరి. మనకు సిఫారసు చేసేవాడెవరు?''

''అన్నట్టు, మీకొక అమ్మాయి వుండాలి కదా.''

''హుబ్లీలోని ఏదో కంపెనీలో సేల్స్‌గర్ల్‌గా పనిచేస్తూంది రోజుకు పన్నెండు రూపాయలు ఇస్తున్నారు ''

''బహుశా మీ అమ్మాయికి పెళ్లి వయస్సు వచ్చిందను కొంటాను.''

''వయస్సు వచ్చినంత మాత్రాన ప్రయోజనమేముంది. మేమంతా దాని మీద ఆధారపడి బ్రతుకుతున్నాం.

అదీకాక ఈ రోజుల్లో కట్నంలేకుండా పెళ్లి జరగడం కష్టం కదా!... -

అతను ఏదైనా సహాయం అపేక్షించి ఇవన్నీ చెబుతున్నట్టు అనిపించింది. అందుచేత ఏదోవిధంగా ఈ బెడదనుండి బయట పడాలన్న నిర్ణయానికి వచ్చాను.

నేను ఒకాయనను కలుసుకోవాలని వచ్చాను. ప్రస్తుతం మీరేం చేస్తున్నట్టు లని అడిగాను.

''ఇంతవరకూ చాలా పనులు చేసాను. చేసి చేసి చివరకు ఎందుకూ కొరగానివాడిలా తయారయ్యాను.''

''ఆ వార్తాపత్రికలోనే పని చేస్తున్నారా ?''

''లేదు. ప్రస్తుతం వార్తాపత్రికలు చదవడం కూడా మానేసాను.''

''అలాగా.''

''ఆ పత్రిక వదలి మరో ప్రచురణ సంస్థలో చేరాను.''

ఈసారి అతను అడిగినా డబ్బు ఇవ్వకూడదని నిశ్చయించు కొన్నాను. కొద్దో గొప్పో సంపాదించగల శక్తివున్న వాళ్ళకు సహాయం చెయ్యడం మంచి పనికాదని నా ఉద్దేశ్యం.

''ఇంకా అక్కడే పనిచేస్తున్నారా?'' అని అడిగాను. నన్ను నేను సమర్థించుకోవడానికి ప్రయత్నిస్తూ.

''లేదు. పనినుంచి తొలగించారు'' అన్నాడు పిచ్చివాడిలా నవ్వుతూ.

శర్మ మంచి నమ్మకస్తుడు. కష్టపడి పనిచేసే వ్యక్తి. అందుచేత ''తీసేసారా!'' అని అడిగాను ఆశ్చర్యంగా.

''నామీద దొంగతనం ఆరోపించబడింది. అది కేవలం నిరాధారమైన ఆరోపణమాత్రం కాదు. నేను ఆ సంస్థకు చెందిన డబ్బు వాడాను. దానికి తగిన శిక్షపడింది'' అని మళ్లా నవ్వసాగాడు.

ఈసారి అతని కళ్లలో నీళ్లు నిండాయి.

''ప్రావిడెంట్‌ఫండు వగైరా ఏమైనా ఇచ్చారా?''

''అవన్నీ తీసుకోవడం అయ్యింది. ఆ తరువాత చాలా ప్రయత్నాలు చేసాను. ఎవ్వరూ ఉద్యోగం ఇవ్వలేదు.''

''ఊఁ''

''ఇప్పుడు అవన్నీ ఎందుకులెండి...'' అంటూ ఏవో చెప్ప బోయాడు. నా అనుమానం నిజం కాబోతుందని అనుకున్నాను. బేరర్‌ను పిలచి ఇద్దరం కాఫీ త్రాగాము.

''మీరు పూర్వ పరిచితులు. శ్రేయోభిలాషులు. చాలాకాలం తరువాత కనిపించారు.''

''అవును. నాకు కూడా చాలా సంతోషంగా వుంది.

''ఈరోజు సాయంకాలం మీరు మా ఇంటిదగ్గర భోజనం చెయ్యాలి. మా ఇల్లు స్టేషన్‌కు దగ్గరలోనే వుంది. మా ఇంటి దగ్గరనుంచి మళ్లా మిమ్మల్ని స్టేషన్‌కు తీసుకువెళతాను'' అని చెప్పి శర్మ వెళ్లిపోయాడు.

నేను పీడ విరగడయ్యిందని సంతోషించాను. నా పని పూర్తి చేసుకొని సాయంకాలం నేను వుంటున్న హోటల్‌కు తిరిగి వచ్చాను. అప్పటికే శర్మ నా కోసం ఎదురుచూస్తున్నాడు

ఇద్దరం కాఫీ త్రాగాము. బిల్లు శర్మ చెల్లించాడు. సంపాదన లేని శర్మ బిల్లు ఇవ్వడం నా సభ్యతకు భంగమని అనిపించింది. కాని ఎవ్వరూ వృథాగా డబ్బు ఖర్చు చెయ్యరని నా అభిప్రాయం. ఇంతకీ అతని ఉద్దేశ్యం ఏమిటో నాకు అర్థం కాలేదు.

నేను స్నానానికి వెళ్లి వచ్చాను. శర్మ నేను వచ్చేంతవరకూ కూర్చొన్నాడు. హోటల్ బిల్లుకూడా అతనే ఇచ్చాడు. అతనే గాడీ పిలిచి ఇంటికి తీసుకొని వెళ్లాడు.

ఇల్లు చాలా చిన్నది. ఇంట్లో ఎటుచూసినా పుస్తకాలే. నేల మీద తివాచీ పరచి వున్నది. గదిలో లాంతరు వెలుగుతున్నది.

''పొట్టకోసం వున్నవన్నీ అమ్మకొన్నాను. ఇల్లంతా బోసిగ తయారయ్యింది. పుస్తకాలుమాత్రం అమ్మలేకపోయాను. అయినా ఈ పుస్తకాలు కొనేదెవరు? కొంటే నాకు మరో శాపం తగిలేదే.''

నేను ఇటూ అటూ చూడసాగాను. శర్మ కొడుకు ఎక్కడా కనిపించలేదు. తండ్రి నన్ను భోజనానికి పిలిచాడు కనుక ఏదైనా హోటల్‌కు వెళ్లాడేమోనని అనుకొన్నాను.

''లోకంలో అనేకమంది గొప్పవాళ్ళు వున్నారు.

నాకు మట్టుకు పాలవాడూ, కిరాణా సరకులవాడూ అందరి కన్నా గొప్పవాళ్లుగా కనిపిస్తారు. వాళ్లిద్దరూ ఏ సంకోచమూ లేకుండా అరువులిస్తారు కనుక '' ఆ క్షణంలో అతను సంస్కార హీనుడిలా కనిపించాడు. అతిథి దగ్గర అప్పుతీసుకోవడానికే ఈ

పధకం వేస్తున్నాడని అనుకొన్నాను. మళ్ళా ఇటూ అటూ చూడ సాగాను. భోజనం ఏర్పాట్లు కనిపించలేదు.

''మీకు భోజనానికి టైమౌతూంది. నేను కుర్రవాడితో చెప్పాను. బహుశా క్రికెట్ మేచ్ చూడడానికి వెళ్లాడేమో. ఈ పాటికి తిరిగి వస్తుంటాడు.''

నేను మాత్రం ఏమని చెప్పగలను. ''నేను రాత్రిపూట భోజనం చెయ్యను. ఏదో మీరు పిలిచారని వచ్చాను'' అన్నాను లోపల ఆకలిగా వున్నా, అతనిని సముదాయించడానికి ప్రయత్నిస్తూ.

అతను ఏదో చెబుతూనే వున్నాడు. పది సంవత్సరాల క్రిందట వ్రాసిన వ్యాసాలు చూపించాడు. వాటిని ప్రచురించడానికి ఎవ్వరూ ముందుకు రాకపోవడం వల్ల అవి మూల పడ్డాయి.

శర్మ నిశ్చింతగా కూర్చొని తన కథ వినిపిస్తూనేవున్నాడు: బ్రతుకు భారమైనప్పుడు అనుభవాలు చేదుగానే వుంటాయి. కాని ఆకలితో మాడుతున్న వాడికి అలాంటి మాటలు రుచించవు కదా!

శర్మ లేచి ప్రక్క గదిలోనికి వెళ్లాడు. ఏదో పాత్రల చప్పుడు వినిపించింది. కాని వంట తాలూకూ వాసన మాత్రం రాలేదు.

''వాడింకా రాలేదు. ఏం జరిగిందో ఏమో ? వంటచెయ్యకుండా వెళ్లాడు.''

''ఫరవాలేదులెండి. నేను వెళ్లిపోతాను. అనవసరంగా మిమ్మల్ని కష్టపెట్టాను'' అని హాండ్ బ్యాగ్ పట్టుకొన్నాను.

''లేదు, నేనే మీకు శ్రమ కలిగించాను. ఈ రోజుల్లో పిల్లలంతా ఇంతే. తల్లి తండ్రీ ఇంట్లో లేకపోయేసరికి పట్టపగ్గాలు వుండడంలేదు. మీకు కష్టం కలిగించినందుకు నాకు సిగ్గుగావుంది.''

''బాధపడకండి. నాకు బండికి టైము కావస్తుంది. దగ్గరలో టాక్సీ ఏమైనా దొరుకుతుందా ?''

''ఎందుకండీ స్టేషను ఇక్కడేకద్దా! టాక్సీ కావాలన్నా స్టేషనువరకూ వెళ్లవలసిందే'' అంటూ శర్మ నా సామాన్లు పట్టుకొన్నాడు. సన్నగా, పొట్టిగావున్న అతను తిండి లేకపోవటం వల్ల మరింత బలహీనంగా కనిపించాడు. కొంత దూరం నడిచిన తరువాత సామాన్లు క్రిందకు దింపి, సర్దుకొని ముందుకు సాగాడు. మొత్తానికి నన్ను టైముకు స్టేషన్‌కు చేర్చాడు.

కేశవన్‌కూడా స్టేషన్‌కు వచ్చాడు. అతను అంతకుముందు నన్ను భోజనానికి ఆహ్వానించాడు. అతనితో శర్మ ఇంటి దగ్గర చేస్తానని చెప్పాను.

అతను రాగానే ''భోజనం చేసారా'' అని అడిగాడు.

''రాత్రిపూట భోజనం చెయ్యరట'' అని శర్మ సమాధానం చెప్పాడు.

ఈలోగా ట్రైన్ వచ్చింది. నేను వాళ్లదగ్గర శెలవు తీసుకొన్నాను. తరువాత స్టేషన్‌లో భోజనం చేసాను.

కొద్ది రోజుల తరువాత శర్మ కొడుకు నాకు ఉత్తరం వ్రాసాడు.

''నాతో మీకు పరిచయం లేకపోయినా మీరు నాకు తెలుసు. నాన్నగారు మీ గురించి చాలా సార్లు చెప్పారు. మీరు సహృదయులు. మా పరిస్థితి అర్థం చేసుకొని క్షమించగలరని ఆశిస్తాను. నాన్నగారికి స్నేహితులంటే అమితమైన గౌరవం. వాళ్లను సత్కరించాలని ఆయనకు చాలా ఉబలాటం. కాని అవకాశం లేనప్పుడు చెయ్యగలిగేదేముంటుంది ?

ఎనిమిది సంవత్సరాలుగా ఆయనకు సంపాదన అంటూ ఏమీ లేదు. జీవితంలో ఎన్నో ఎదురు దెబ్బలుతిని చివరకు వాస్తవాన్ని గుర్తించే శక్తిని కోల్పోయారు. మీరు నెల చివరి రోజులలో వచ్చారు. ఇంట్లో వంట సామానులు నిండుకున్నాయి. అటువంటి పరిస్థితిలో నాన్నగారు మిమ్మల్ని వెంట తీసుకొని వచ్చారు. నేనుమాత్రం ఎక్కడినుంచి తేగలను? మా ఇద్దరి భుక్తికే అక్క కొంత మొత్తం పంపుతున్నది. అవి చాలక అప్పులు చేస్తున్నాము. ఇంటి ఖర్చులనిమిత్తం అక్క పంపిన డబ్బు మిత్రులందరికీ ఖర్చు చెయ్యడానికి ఆయనకు అధికారం ఎవరిచ్చారు?''

మావల్ల మీకు చాలా కష్టం కలిగింది. మీరు తీరని అవమానం ఎదుర్కోవలసి వచ్చింది. మీరు సంపన్నులు. అందుచేత తరువాత స్టేషనులోనైనా మీ ఆకలి తీరి వుంటుందని అనుకొంటాను. ఈ ఉత్తరం చదివిన తరువాత మామీద మీకుగల కోపం తప్పక మాయమౌతుందని ఆశిస్తాను.

ఉత్తరం చదివి నేను స్తంభించిపోయాను. శర్మ నా ఎదురుగా నవ్వుతున్నట్లూ, అతని కళ్లనుండి అశ్రువులురాలుతున్నట్లూ అనిపించింది.

**అనువాదం : శ్రీ బి. ఏ. రమణి**



# విపంచి మూగవోయింది

"చైతన్య"

ఎందుకొచ్చావీ
    జీవితంలోకి చొచ్చుకొని ?
సరసీ జలాన
ప్రభాత కిరణంలా !
సంపెంగ పరిమళం తీసుకొచ్చిన
మంద సమీరంలా
ఎందుకొచ్చావు ?
నీ ఆగమనం
ఏడురంగుల 'ఇంద్రచాపం'
ఎదకడలేని 'కార్చిచ్చు' అయింది
జీవితం —
కొమ్మలు రాజుకున్న
కారడివియై 'కీలలు' పూచింది.
నువ్వయితే వచ్చి వెళ్లావుకాని ...
నీ నడకలింకా
కళ్ళలో నడయాడుతూనే ఉన్నాయి
నీ నవ్వులు
సెలయేటి శబ్దతరంగాల్లో
పద భంగిమలై
ప్రతిధ్వనిస్తున్నాయి.
నాటిక ముగిసి
యవనిక జారినా
లీనమైన నటునిలోమాత్రం
పాత్ర తైలమై తనువులోకలసి
అనుభూతి అణువణువునా
ఒక ప్రమిదవుతుందని
నీకు తెలియదా ?
తెలిస్తే; మరి ఆ ప్రమిదతోనే
ఈ ఎదకుటీరాన్ని
ఎందు కంటించావు ?
నీ మృదు కరాంగుళులతో
మధు వీణాగాన స్రోతస్వినిని ప్రవహించి
ఈ శ్రోత నలరించి
ఇంతలోనే
ఈ సంగీత సదనంనుంచి
ఎలా నిష్క్రమించావు ?
నువ్వులేని నేడుచూడు !
ప్రకృతి యావత్తూ
పూచిన మోడు !
ఉద్యానవనం
ఊరి వెలుపలి
ఖరీదైన వల్లకాడు !
ఇవాళ ఇక
'హిమజ్వాల' లా
శ్రోత మిగిలిఉన్నాడేగాని
పాట లేదు
పల్లవిలేదు
రవళించే నీ భౌతికం లేక
రాగం పక్షవాతం పాలైంది
'విపంచి' మూగవోయింది.

శ్రీ ఎస్. ఎస్. సుందరేశ్వరరావు

# సంస్కృత బసవపురాణము-విశేషములు

పాల్కురికి సోమనాథుని తెలుగు బసవ పురాణమునకు క్రీ. శ. 1369 లో కన్నడానువాదము వెలసిన తరువాత 50 సంవత్సరములకు సంస్కృతానువాదము బయల్వెడలినది.

కర్త — శంకరారాధ్యుడు

గద్యపద్యాత్మక మహాకవితా తత్త్వకోవిదుడును, ఏకాంబ్రనాథుని పరమ భక్తుడును, కాంచీపురనివాసియు, వీర మాహేశ్వరాచార పరాయణుడును, షట్స్థలజ్ఞానియునైన శంకరారాధ్యకవి ఈ అనువాదమునకు కర్త. ఇతడు కేశవామాత్యుడను మంత్రి శిఖామణి కోరిక తీర్చుటకు దేశభాషలోని బసవపురాణమును గీర్వాణ భాషలోనికి పరివర్తనము కావించినాడు

## కేశవామాత్యుడు

శ్రీ మల్లికార్జున ధ్యాన నిష్ఠాధిష్ఠిత మానసుడైన మల్లయాఖ్యుడు యాజ్ఞవల్క్యస్మృతి. వ్యాఖ్యానకార. విజ్ఞానేశ్వర ప్రవర్తిత శాఖలో జన్మించెను. ఇతనిది శాండిల్య గోత్రము. మల్లయామాత్యుని కుమారుడు శ్రీ రామామాత్యుడు. ఇతనికి అయ్యలామాత్యుడు కుమారుడు. ఈ అయ్యలుని భార్య అమలక్క. ఈ పుణ్యదంపతులకు పుట్టినవాడే కేశవామాత్యుడు ఇతని నివాసము శ్రీశైలగిరి సమీపములోని స్కందపురి. అది స్కంద, సోమేశదేవర, భైరవానంద దేవతలకు స్థానము ఆ స్కందపురిని రెడ్డి జేంద్రుడు రాజధానిగా జేసుకొని, కొంతకాలము పాలించిరి.

## కందుకూరి రెడ్లు

వీరిని 'కందుకూరి రెడ్లు' యని రెడ్డి రాజ్య చరిత్ర కోవిదులు పిలుతురు. ఈ కందుకూరి రెడ్డి వంశ భూషణులలో శివలింగ భూపతి దొడ్డ ప్రభువు ప్రోలయ వేమారెడ్డి అనుగు దమ్ముడు మల్లారెడ్డి కోవలోని వాడగు నీ శివలింగ భూపతి హరదత్తాచార్యుని చతుర్వేద తాత్పర్య సంగ్రహమునకు 'తత్త్వప్రకాశిక'యను వ్యాఖ్య రచించిన పండిత ప్రభువు. ఇతని సోదరుడు మాచ ప్రభువు.[1] కేశవామాత్యుడీ మాచ ప్రభువునకు మంత్రి మాణిక్యము. శివలింగ, మాచ భూపతుల తండ్రి పినకోమటి క్రీ. శ. 1404 లో పెదపూడి శాసనము వేయించెను. కావున ఈ సోదరులిరువురు 1430–50 ప్రాంతముల నుండి రనుట స్పష్టము. శంకరా రాధ్యుని గద్య ఇట్లున్నది.

''ఇతిఖ్యాత మాహేశ్వర దివ్యపద పద్మ సౌరభ భ్రమరాయమాణస్య నిర్మల శంభు ప్రసాదోపభోగ సంగత సుఖసుధా జలనిధి నిమగ్నస్య ప్రమథకవేః శంకరారాధ్యస్యకృతౌ బసవపురాణే.''

పై గద్యను బట్టి చూడగా నిది సోమన బసవపురాణ గద్యను పోలినదని నీక్రింది యుదాహృత ద్విపద సంక్తులను బట్టి గ్రహింపవచ్చును.

''ఇది అసంఖ్యాత మాహేశ్వర దివ్య
పద పద్మ సౌరభ భ్రమరాయమాణ
జంగమ లింగ ప్రసాదోప భోగ
సంగత సుధ సుఖా శరధి నిమగ్న.''

(సోమన బసవపురాణ సప్తమాశ్వాస గద్య)

పై శంకరాధ్యుడు ప్రమథ కవియని చెప్పుకొన్నాడు. ప్రమథ కవి యనగా శివకవియని చెప్పనొప్పను. ప్రమథ కవి శ్రీగిరియను నాతడు పశ్చిమ గోదావరి భీమవరము తాలూకాలోని మోగల్లు గ్రామములోని భీమేశ్వరాలయమున నున్న శాసనములలో ప్రమథకవి శ్రీగిరి అయ్యంగారు, శ్రీగిరి దేవయ్యంగారుగా పేర్కొనబడిరి (వేంకటరమణయ్య నేలటూరి–27) నిమిషకవి, వార్తాకవి, త్వరకవి, బంధకవి ఇంటిపేర్లవలె ప్రమథకవి గృహోపనామకము స్థిరపడియుండును. లేదా శివధర్మశాస్త్ర విశేష రహస్య వివిధ దివ్యాగరు విరచితత్వమును శివానుగ్రహమున వీరు సంపాదించి ప్రమథేశ్వరత్వమును బడసి యుండుదురు.

శంకరారాధ్యుని గూర్చి విశేషముగా తెలియవచ్చుటలేదు ఇతడు కంచినివాసియని సంస్కృత బసవ పురాణమునుబట్టి తెలియుచున్నది. కంచినుండి దేశసంచారము గావించుచు, నెల్లూరు జిల్లాలోని కందుకూరునకు శంకరారాధ్యుడెట్లు చేరెనో తెలియదు గాని స్కందపురి సోమేశుని వసంతోత్సవ మహోత్సవమును చూడ వచ్చిన శివభక్తులు బసవ పురాణ చర్వణము చేయుచుండగా కేశవామాత్యు డచ్చటికి వచ్చి, వారి పలుకు లాలకించి, బసవేశ్వరుని పురాణమును సంస్కృతీకరింపగల సామర్థ్య మెవ్వరికి గలదని, విచారింపగా అచ్చటి శివభక్తులు కంచి నివాసి శంకరారాధ్యులు గలరని చెప్పగా కేశవామాత్యుడు శంకరారాధ్యుని రప్పించి, తెలుగు బసవపురాణ గీర్వాణ భాషాంతరీకరణ మాతనిచే చేయించి యాతనిని సత్కరించెను. శంకరారాధ్యుల శక్తిసామర్థ్యమును కేశవామాత్యుడు గుర్తించి స్కందపురియందే యాతనికి స్థిరవాసము కల్పించెను. శంకరారాధ్యులు కంచినుండి బంధుమిత్రాదులతో తరలి కందుకూరు చేరుకొని అచ్చటనే స్థిరపడిరి.

ఇది బసవపురాణ గీర్వాణానువాదకర్త విషయమై ఇక మిగిల నది ఈ శంకరారాధ్యులెవ్వరా యను విచికిత్స. కథాశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రులవారును,[2] వేటూరి శివరామశాస్త్రులవారును[3] ఈ విచికిత్సకు విత్తును జల్లిరి. వారికీ సంస్కృతానువాదము కంట బడినచో ఈ శంకరు డెన్నడో వారికి వశంకరుడయి యుండును.

శంకరారాధ్యులు క్రీ. శ 1380–1450 మధ్య ప్రాంత మున కంచి, నెల్లూరు ప్రాంతములనుండిన వారని పైని పేర్కొ నిన కథనమువలన స్పష్టముగా తేలుచున్నది. కందుకూరి రెడ్లు తొలుత పెదకోమటి వేమారెడ్డి పక్షము వహించినను తుదకు విజయనగర సంగమ వంశీయుల సార్వభౌమత్వము నంగీకరించిరి.

అయినను కందుకూరునకు సమీపముననున్న నెల్లూరు, అద్దంకి ప్రదేశములందు రెడ్డి వైభవ ప్రాభవములానాడు మెరసి పోవుచున్నని క్రీ. శ 1325–26 సంవత్సరమున ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణాంధ్రీకరణ కృతిస్వీకార మహోత్సవముతో రామలక్ష్మ ణుల వంటి ప్రోలయవేమారెడ్డి, మల్లారెడ్లు అద్దంకినగరము రాజ ధాని చేసికొని, రెడ్డి సామ్రాజ్యమును స్థాపించియుండురు. ప్రోలయ వేమారెడ్డి క్రీ శ. 1353లో గతిపోయెను

తరువాత అద్దంకి యందే వేముని కొడుకు అన పోతారెడ్డి సింహాసనాధిష్ఠుడయ్యెను. ఆతడు క్రీ. శ. 1364 వరకు పాలిం చెను. క్రీ. శ. 1340 నాటికి రెడ్డి రాజధాని అద్దంకి నుండి కొండవీటికి మార్చబడినట్లున్నది (ముంచాళ్ళ శాసనము—శ్లో.11 రె. సంచిక అనుబంధము). అన పోతారెడ్డి తరువాత ఆతని తమ్ముడు అన వేమారెడ్డి కొండవీటి గద్దె నెక్కెను. ఇతని కాలము 1364–86 ఇతని యొద్దనే శృంగార నైషధ కృతి పతియైన మామిడి సింగనామాత్యుని తండ్రి పెద్దన 'రాజ్య భార భరణ వ్యాపార దక్షుడు' (1–27). పినతండ్రి కూడ నీ 'వేమక్ష్మాపతి రాజ్యభార' ధీరేయుడే (1–30). ఈ సింగన మంత్రి ముత్తాత చిటి పెద్దనామాత్యుడు "విక్రమపురీ సింహాసన ధ్యాసియై" (1–22) వెలుగొందెను. చిటి పెద్దనామాత్యుని తండ్రిని గూడ 'నెల్లూరి తూర్కరాజ' (8–202) యని శ్రీనాథుడు పేర్కొ నెను. దీనినిబట్టి చూడగా మామిడి సింగనామాత్యుని పూర్వికులు నెల్లూరు వారని స్పష్టముగా తేలిపోవుచున్నది

అన వేమారెడ్డి గతిపోవగనే అన్న అనపోతారెడ్డి కుమారుడు కుమార గిరిరెడ్డి రాజ్యమునకు వచ్చి క్రీ. శ. 1402 వరకు కొండ వీడును పరిపాలించెను. ఇతని సింహాసనమును పెదకోమటి వేమా రెడ్డి ఆక్రమించుకొని 1424వరకు పరిపాలించెను. ఇతనియొద్దనే నైషధ కృతిపతియగు సింగన సచివత్వము నెరపినాడు రాజుగారితో తానును శ్రీ శంకర గురువువద్ద దీక్షను పొందియుండును. లేక పోయినచో నీతనిని 'నవరత్నోపల దివ్యలింగ వర దాన ప్రీత దాక్షా యణీధవ' (2–144) అని శ్రీనాథుడు సంబోధించి యుండెడి వాడు కాడు కోమటి వేముడు నెల్లూరికి సమీపములోని కందు కూరును మాచారెడ్డి కొడుకైన రెండవ కోమటిరెడ్డి నుండి జయించి తన ఆధిపత్యమును స్థాపించెను. అప్పుడే నెల్లూరి నివాసియైన సింగనామాత్యుని గూడ తనకు మంత్రిగా నియమించి యుండును.

దీనికింత చరిత వ్రాయవలసి వచ్చుటకు కారణముగలదు. అదే కాలమున కందుకూరి సోమేశ్వర స్థానమునందు మన శంకరా రాధ్యుడున్నాడు. ఈ శంకరారాధ్యుడే పెదకోమటి వేమ, సింగనా మాత్యులకు గురువేల కాకూడదు? అద్దంకి, నెల్లూరు ప్రాంత ములో రాజ్యాభిలాషగల పెదకోమటి వేమారెడ్డికి కొండవీటి దుర్గ ముపై ఆశ జనింపగా అద్దానిని పరిపాలించుచున్న కుమారగిరిరెడ్డిని రాజ్య పీఠమునుండి మామిడి సింగన తన 'యరనాధీశ సభా నిరం కుశ వచో వ్యాపార పారాయణ'త్వ (2–144)ముచే తప్పించి పెద కోమటి వేముని ప్రతిష్ఠించియుండును. (రె.రా.చ. పుట 162). కావుననే శ్రీనాథుడు తన కృతిభర్తయైన సింగనామాత్యుని 'వేమ సామ్రాజ్య రక్షామణి' యని సంబోధింపగల్గెను.

శ్రీనాథ మామిడిసింగనామాత్యులు పాకనాటివారు (నెల్లూరి వారు) సింగనామాత్యునికి కంటెముందుగనే సింగన యన్నయగు ప్రెగడన్నకు శ్రీనాథుడు నిగమార్థ సార సంగ్రహమగు నారాధ్య చరిత్రను కృతిగా నిచ్చినాడు.[4]

'ఆదిగాం బిక్కుల్' అని సింగన శ్రీనాథునితో పల్కుటచే 'శాలివాహన సప్తశతి'ని గూడ నీతనికే ఇచ్చెనేమో !

పిండితార్థ మేమనగా సంస్కృత బసవ పురాణ కర్తయగు శంకర దేశికులు — సింగన, పెదకోమటి వేమారెడ్లకు గురువనియు వేమారెడ్డికి రాజ్యప్రాప్తి కలుగగనే తమ గురువులకు పినపాడు గ్రామ దాన మొసంగ్చరనియు చెప్పుట కవకాశము చాలినంతయున్నది. అయినను విజ్ఞులు దీనిని చర్చింతురుగాక. శంకర గురున కిచ్చిన దాన విశేషమును నీ క్రింద నిచ్చుచున్నాను :

> దాతా కోమటి వేమన సుసృపతిః పాత్రం గురుశ్శంకరః
> స్థానం చే త్పినపాడు రత్రతుకవి శ్రీనాథ భట్టారకః
> కాలాశ్చే చ్ఛివరాత్రి పుణ్యసమయస్సాక్షీ మహానే శ్రీగిరి
> శ్శ్రేయః కిం నతువర్ణ్యతే సుకవిభి శ్శృణ్వంతు తచ్ఛాసనమ్
> (పినపాడు తామ్రశాసనము, శృం. శ్రీ. పుట119)

పై శాసనమునందు దానకాలము సూచితము కాలేదు కాని పినపాటిలో మృత్యుంజయారాధ్యులయింట నొక ప్రాచీన తాళపత్ర గ్రంథమున నీ దాన ప్రస్తావము వ్రాయబడియున్నది. అందీ శ్లోకము కలదు :

> "శాకాబ్దే గిరినేత్రమూర్తి విధుకే సంవత్సరే పార్థివే
> మాఘేఽస్మిన్ శివరాత్రి పుణ్యదివసే శ్రీ వీరనారాయణః
> తస్మై శంకర దేశికాయ విధుషే భద్రానదీ ప్రాక్తటే
> గ్రామం శ్రీ పినపాడు నుత్తమ మదాదాచంద్ర
> మాతారంమే."
> (శృం. శ్రీ. పు. 119)

శా. శ. 1327 అగు పార్థివ సంవత్సర మహాశివరాత్రి పుణ్యకాలమునం బెదకోమటి వేమభూపాలుఁడు పినపాడు గ్రామమును శంకర దేశికునకు దానము చేసెనని మీది శ్లోకమున కర్థము. (శృం. శ్రీ. పు 119)

పై శాసనమునుబట్టి పెదకోమటి వేమారెడ్డి (1402–20) గురుశంకరునకు పినపాడును తన విద్యాధికారి శ్రీనాధుని సమక్షమున క్రీ. శ. 1405లో దానము చేసినట్లు స్పష్టము.

పెదకోమటి వేమారెడ్డి, శ్రీనాధుడును, శంకర దేశికులును నొకే శాసనమున సమకూరినపుడు పెదకోమటి వేముని మంత్రియగు మామిడి సింగనమాత్యునకు వేరొక గురువు సనామధేయు డొకడుండునా యను సంశయ ముత్పన్నమగును. అది సహజమే. కాని సింగనామాత్యుడు కృతిగొన్న శృంగార నైషధమునందు–

"శ్రీ గురుశంకర మౌనిద
యా గౌరవ నిత్యవర్ధితాన్వయ!" (శృం. నై 6-1)

అని చెప్పబడి యుండుటచేతను, గురు శంకర మౌని దయా గౌరవములకు మామిడి సింగనామాత్యుడును పాత్రుడగుటచేతను పెదకోమటి వేమభూపాల, మామిడి సింగనామాత్యులకు నొకే గురువు శంకరమౌని యని స్పష్టమగుచున్నది. కాని ఈ పినపాడు గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలోనిదట.[5]

# సంస్కృత బసవపురాణము - కన్నడ భాషాటీక

పైన చెప్పిన శంకరారాధ్య కృత గీర్వాణానువాద బసవ పురాణమునకు గురుపాదాఖ్య దేవుడను నాతడు క్రీ. శ. 1592లో కర్ణాట భాషలో టీకను వ్రాసెను. దానికి 'సర్వార్థదాయిని' అని పేరు. ఈ గురుదేవుడు ద్రాక్షారామములోని కోటిపల్యారాధ్య దేవుని వంశములోనివాడనని టీకా ప్రారంభమున చెప్పుకొన్నాడు.

# గురుదేవ కవి వంశము

## ౧. సంస్కృత బసవ పురాణము

ద్రాక్షారామ కోటిఫలి ఆరాధ్యులు
|
భీమ పండిత (గౌరమాంబ-పత్ని)
|
మల్లికార్జున పండిత (వెలనాటి చోళుని ఆస్థాన పండితులతో వాదము జరిపెను)
|
(వంశములలో)
పండితారాధ్య దేశిక
|




(క్రీ. శ 1592) గురుదేవ-పండితార్య-బసవారాధ్య-జక్కారాధ్య
(కన్నడ టీకా కర్త).
సర్వార్థదాయిని

# కోటిఫలి ఆరాధ్యులు-విశేషాంశములు

పంచ బ్రహ్మోదయ భాష్యమను సంస్కృత గ్రంథమున కోటిఫలి ఆరాధ్యులను గూర్చి కొన్ని శ్లోకములు వ్రాయబడినవి

"తద్ధి భూలోక మధ్యేషు రేణుకాచార్య కోవిదః,
ద్వాదశాబ్దం జరత్యించ పండిత ప్రవరాత్మ జా॥

పురా కైలాస వ్యాసోక్త ప్రసాద క్రమవర్తనే,
రేవణారాధ్యః శ్రీ వీర శైవరత్న ప్రకాశకః॥

త్రిలింగదే కామ్యార్థ పురీశే రాజమందిరే,
సోమలాదేవి వైవాహం కృతం శాస్త్రోక్త సమ్మతం॥

దంపత్యాశ్రమ సంయుక్తో వత్సర త్రీనో సమాచరతే
సోమలాగర్భ కంజే తు కోటిపల్లార్య యుద్భవః॥"

త్రిలింగ దేశములోని రాజమహేంద్రవరమున సోమలాదేవి యను నామెను రేవణారాధ్యుడు శాస్త్రోక్త సమ్మతముగా వివాహమాడి, మూడు సంవత్సరములు దాంపత్య జీవితమును గడపగా వారిరువురకు కోటిపల్యారాధ్యులు పుట్టిరని పై శ్లోకముల వలన తెలియుచున్నది.

మల్లికార్జున పండితారాధ్యులకు దీక్ష నిచ్చిన దీక్షా గురువులును కోటి పల్యారాధ్యులేయని పై గురుదేవ కవియేగాక పాల్కురికి సోమనాధుడును తెల్పియున్నాడు.

... ... ... ... దుర్వార సంసార
దూరనీర వ్రతోద్ధుర వర్తనుండు
శైవ ధర్మోత్త మాచార్యుండ నంగ
దైవుండు నద్వైత తత్త్వ తత్పరుఁడు,
న్యాయ వైశేషికోదాత్త శాస్త్రాన
పాయ దర్శన పరిపాలన క్షముఁడు,

స్వకృపావలోక రోత్సారిత శిష్య
నికర మలత్రయ నిష్ఠితేంద్రియుఁడు,
దంత్రాధిగత వీరతంత్ర స్వతంత్ర
మంత్రాధిగతరాజ మంత్ర సిద్ధుండు,
వేద వేదాంత వివిధ పురాణోప
పాదిత కేవల భక్తి వర్ధనుఁడు,
పండిత నత పాద పద్ముండు, సుకవి
మండలి విబుధ సమాజ పూజితుఁడు,
ఆరూఢ కీర్తిశుఁడగు కోటిపల్లి
యారాధ్యులనఁగ లోకారాధ్యమూర్తి[6]

(పండితారాధ్య చరిత్ర దీక్షా. 23–24
ఆంధ్ర గ్రంథమాల 1939.)

మల్లికార్జున పండితారాధ్యులు క్రీ శ. 1130లో జన్మించి, 55 యేండ్లు జీవించి 1185 నాటికి మరణించి యుండవచ్చునని డా. నేలటూరివారు రాద్ధాంత సిద్ధాంతములుచేసి నిర్ణయ మొనర్చినారు (సోమనాథుఁ డెప్పటివాఁడు, పుట 30. వావిళ్ల 1955)

కనుక కోటిపలి ఆరాధ్యులు క్రీ శ. 1080–1150 మధ్యకాలము దాక్షారామమునకు సమీపములోని కోటిపలి యందుండి యుండును. ఆ కాలమున రాజరాజు మనమడును కుళోత్తుంగ చక్రవర్తి మూడవ కుమారుడు వీరచోడుడు (1078–1084), విక్రమచోడుడును (1118–35) తండ్రి పనుపున వేంగీరాజ్యము నేలుచుండిరి

పంచ బ్రహ్మోదయ భాష్యము ప్రకారము కోటిపలి ఆరాధ్యులు సోమలదేవి రేవణారాధ్యుల తనయుడని తెలియుచున్నది కదా! ఈ సోమలదేవి తూర్పు చాళుక్యరాజు కుమార్తె కాదు గదా!

క్రీ శ 1065 లో రాజరాజ నరేంద్రుని సవతి సోదరుడగు వీరవిజయాదిత్యుని భార్య మేవలదేవి కూతురు సోమలదేవి దాక్షారామ భీమేశ్వరునకు మణిబంధము, బంగారముతో జేయబడిన కల్పవృక్ష పుష్పము, వెండి కుండతో అఖండద్యుతి దీపము దానము చేసెను. (182/1893. ద హిం శా. 4 వ సం. నెం. 1007) ఈమె జగదేక సుందరి; గుణారామ, మత్తేభ మంద గమన యని పేర్కొనబడినది. ఈమెయే కోటిపలియారాధ్యుని తల్లి యెందుకు కాగూడదు? 'అన్వయాభివృద్ధికి భూసురోత్తములు క్షత్రియ రాజ పుత్రికల యందు ధర్మవిధి సంతతి నిలుపు చుండిరి చాలుక్య వంశ సంజాతలను కుల బ్రాహ్మణుల కిచ్చి వారి వలన కలిగిన సంతతితో, చాలుక్య వంశము నిలువను, సంబంధ బాంధవ్యములను గలుపుకొనుచుండిరి'' (భీమరాజు వెంకట కృష్ణారావు రాజరాజ నరేంద్రుడు. పు 144. 1950).

అట్టియాచారము కాకతీయుల కాలము వరకు చెల్లుబడి యగుచుండెను. తిక్కన వంశములో మనుమసిద్ధి నామధారులు, కొలని వంశములో గణపతి, రుద్రనామధేయు లెందరు లేరు కావు ఆనాడు సోమలదేవి రేవణారాధ్యుల వివాహము సంఘ సమ్మతమే. భాష్య పంక్తులలో ''సోమలాదేవి వైవాహం కృతం శాస్త్ర సమ్మతం'' అని యుండనే యున్నది గదా!

ఇక ఈ రేవణారాధ్యు లెవరు?
వీరశైవ సిద్ధాంతమును దెల్పు వీరాగమములో

శ్లో. రేవణో మరుసిద్దేశో రామదేవో మునీశ్వరః।
పండితారాధ్య ఇత్యేతే చతుర్మఠ మునీశ్వరాః॥

(ప్రభాకరశాస్త్రి బ పు. పీ. పు. 79.)

అని చతుర్మఠాధి పతులలో నాది మఠాధిపతిగా రేవణసిద్ధుడు స్తుతింపబడినాడు రేణుక, రేవణ శబ్దములు పర్యాయపదములని శైవమతాభిలాషులకెల్ల తెలిసిన విషయమే. పాల్కురికి సోమనాథుడు గణ సహస్ర నామస్తవములో కోటిపలి ఆరాధ్యునితో బాటు రేవణ దేవుని గూడా పేర్కొనినాడు (పం. చ. మహిమ 88, 92,). రేవణ, మరుళ, ఏకోరాములకు సిద్ధత్రయమని ప్రచారము కలదు.

కన్నడమున ఈ రేవణ (రేణుక) సిద్ధుని గూర్చి 'కర్ణాటక సంస్కృతియ సంశోధన' యందు శ్రీ కపర్తాల కృష్ణారావు గారు విపులముగా చర్చించి పశ్చిమ చాళుక్య, చోళ మండల రాజాధీశులకు నీతడు చూపిన మహిమలను వర్ణించి, కొల్లిపాక నుండి చోళమండలము, కొల్లాపురము నుండి వారణాసి, అక్కడి నుండి రేవణుడు శ్రీలంకకు ఆకాశగమన మొనర్చిననియు, నీతడు సిద్ధ సంప్రదాయమునకు చెందిన వాడనియు, కాలము క్రీ శ. 1050.70 అనియు నిష్కర్ష చేసిరి (పుట 13 రేవణ సిద్దన ఉత్పత్తియ కల్పనయ వికాశ మత్తు అవనకాల) కృష్ణరావుగారి వ్యాసములో నీ పంచ బ్రహ్మోదయ విషయము నందలి సోమలాదేవి వృత్తాంతము లేదు. మరియు

''శ్రీమద్రేవణ సిద్ధస్య కుల్యాపాక పురోత్తమే
సోమేశ లింగాజ్జ న నమూవాః : కదలీపురే (స్వాయం భువాగ్రమే)
అథ త్రిలింగ విషయే కుల్యపాకాభిధే పురే
సోమేశ్వర మహాలింగాత్ ప్రాదురాసీత్ సరేణుకః॥

(సిద్ధాంత శిఖామణి–౮–౨)

అను శ్లోకములను బట్టి చూడగా రేవణుడు త్రిలింగ దేశములోని కొల్లిపాకయందు సోమేశ్వరలింగము నుండి ఉద్భవించినట్లు స్పష్టపడుచున్నది.

నేటి నల్గొండ జిల్లా భువనగిరి తాలూకా కొల్లిపాక క్రీ.శ. 1050 నాటికి గొప్ప శైవక్షేత్రము. అక్కడ మఠమొకటి యుండెడిది. పశ్చిమ చాళుక్య ఆహవమల్ల మొదటి సోమేశ్వరుడు అందలి స్థానాపతియైన విప్రసోమ భట్టారకుడు వండిమయ్య యను నాతనికి కొంత భూమిని దానము చేసెను. ఇతడు సోమ సిద్ధాంతాభిప్రాయమును బాగుగా నెరిగినవాడు. మహావ్రతి — (పరబ్రహ్మ శాస్త్రి. ఎన్. ఇ. ఏ. పి. నెం. 4) క్రీ. శ. 1106

నాటి శాసనమున ''దివ్య తీర్థస్య సోమేశ్వరోత్తర తీరే...సోమేశ్వర మఠాపా......'' అని సోమేశ్వరాలయము, మఠము పేర్కొన బడినది. (అదే. నెం. 8). ఈ కొల్లిపాక పశ్చిమ చాళుక్యుల కాలమున గొప్ప రాజకీయ కేంద్రము కూడ.

తూర్పు చాళుక్య ప్రభువగు రాజరాజ నరేంద్రుడు రాజ మహేంద్రవరము రాజధానిగా పరిపాలించుచున్న రోజులలో కొల్లి పాక గొప్ప శైవక్షేత్రముగా నుండెడిది. రాజరాజ నరేంద్రుని సవతి సోదరుడైన విజయాదిత్యుని కూతురు సోమలదేవిని రేవణ సిద్ధుడు వివాహమాడెనని పంచ బ్రహ్మోదయ పీఠికా శ్లోకములు పరం పరాయతముగా వచ్చిన కథలను పేర్కొని యుండెను. రాజ నరేంద్రుని కాలమున రేవణ సంప్రదాయమునకు చెందిన కాశీ నాథయ్య యను వారు రాజరాజ నరేంద్రులకు గురువులుగా వ్యవహ రించిరని పులివర్రు కైఫీయతు (ఎల్. ఆర్. నం. 14. పుటలు 1–22) చాటుచున్నది.

తగినంత శాసన ప్రామాణ్యము లభింపకున్నను కాశీనాథయ్యా వారు (నేటి కాశీనాధుని ఇంటిపేరు గల వారికి మూలపురుషులు) రాజరాజ నరేంద్రునికి, రేవణారాధ్యులు విజయాదిత్యునికి దీక్షా గురువులుగ వ్యవహరించి యుందురు

పాల్కురికి సోమనాథుడు కోటిపల్లి ఆరాధ్యుని గురువు అవాంతరయ్య యని 'పండితారాధ్య చరిత్ర'లో వ్రాసినాడు ఈ అవాంతరయ్యను గూర్చి ముందు ముందు వ్రాయగలను.

(సంస్కృత బసవపురాణ తాళపత్ర ప్రతి హాసన్ జిల్లా అరసికెరె తాలూకా కోడి మఠమున దొరికినది. కోర కాగిత ప్రతి బీజాపూర్ జిల్లా బీగల్ కోటె తాలూకా బీళగియ శ్రీ సోమప్పయ్యన వరు విరక్త మఠములోనిది. ఈ రెండు ప్రతులు గురుదేవకృత కన్నడ భాషటీక 'సర్వార్థదాయిని'తో కూడు కొన్నవి. ఈ రెండు ప్రతులను పరిశీలించి డా. శి. జి నందిమఠ్ గారు 'వీరశైవ' యను పత్రిక డిశంబరు 1960 (సం 1. సంచిక 3. పుటలు 1–21) ప్రతిలో 'సంస్కృత బసవపురాణగళు' అను శీర్షికతో చక్కని వ్యాసమును వ్రాసిరి. ఈ సంచికను శైలాసవాసి వి. నరసింహారెడ్డి, నేనును చదివి ఇందలి విశేషములను వ్రాసు కొంటిమి.)

# అనుబంధము

## కంచి శంకరారాధ్య వృషభేశ్వర పురాణము

జయతి శ్రీగిరిర్నామ గిరిర్గరిమభూషితః
యత్రాస్తి భ్రమరాదేవ్యా దేవః శ్రీ మల్లికార్జునః
తస్యాగ్నేయ దిశాభాగే భాగధేయ మివావనః
పరిష్కృతస్తీర్థసార్థైః పూజ్యతే పుణ్యపురుషైః
తత్ర స్కందపురం నామ పురం బహులోక భూషణం
విద్యతే స్కంద సోమేశస్వామీ యత్ర జగత్పతిః

★ ★ ★

## (వేమ భూపతి)

యతో పితృవ్యేన హేమాద్రి దానినా శ్రీగిరౌ కృతా
సోపాన పద్ధతిః స్వర్గనిశ్రేణిరివ రాజతే
కావ్యం రామకథాభవ్యం తతోపితృవ్యాభిధాంకితం
వర్తతే సర్వవిదుషామాహ్లాద ముపపాదయత్.

★ ★ ★

శ్రీమాన్ సోమమహీపాలః శివలింగ క్ష్మాపతిః
కుమార మాచ భూపాలః కుమారః శ్రీగిరీశ్వరః

★ ★ ★

కుమారమాచ భూపస్య తస్య భూపశిఖామణేః
అమాత్యః సత్యసంపన్నో విద్యతే౽స్యాః కృతేపతిః
శ్రీ మల్లికార్జున ధ్యాన నిష్ఠాదీక్షిత మానసః
తస్యాయాన్వయాఖ్య వైదగ్ధ్యం కీర్తింప విప్రాణోమ్యహం
నానావిధానాం వాదనాం జేతా విజయ ముస్మధః
యాజ్ఞవల్క్యాభిధానో భూత్తాపసః తపసాం నిధిః
యత్కారాంభః శకరేణ ప్రోక్షితో౽భవదంచితః
విశ్వంభరద్వారశాఖా స్తంభః స్ఫటిక పల్లవైః

★ ★ ★

యతోక్తృత స్మృతి వాక్యానాం వ్యాఖ్యానాద్విశదా కృతాః
విజ్ఞానేశ్వర నామాసీద్ విఖ్యాతో విభుధాగ్రణీః!
తతో ప్రవర్తిత శాఖాసు పురం ప్రావీణ్యమాప్తవాన్
బభూవ మల్లయాభిఖ్యః పురాభూసుర శేఖరః
శ్రుతిస్మృత్యయ నాధ్వన్యః శాండిల్య తాపసోత్తమః
గోత్ర ప్రవృత్తికో యస్యపాత్రం శాస్త్రార్థ సంపదాం
మననీయస్య మహతాం తస్యమల్లయ మంత్రిణః
పుత్రః శ్రీరామనామాభూత్ పవిత్ర నిజవర్తనః
శ్రీరామ మంత్రిణస్తస్య తనయో వినయాన్వితః
అయ్యలామాత్య నామాసీదనర్ఘ్య మణిభూషణః
అధీతవిద్యం స్నానార్హం వీక్ష్యైతతః పితా
వధ్వాసమేత మతనోదమలకాభిధానయా

★ ★ ★

దినే ద్వాదశమే పుణ్యవేలాయాం బంధుభిః సహ
పితా కేశవనామాన మతనోదాత్మ సంభవం
శాస్త్ర సాహిత్య సంగీత గోష్ఠీ విస్తృవిదాం ముదం

పితన్వన్వవ సత్యాగ వ్రత నిష్ఠః సకేశవః
అశేషశ్రీ తటాక్రాంత విశ్రాంతాం గద్వీదోజినాః
అగాధాం తద్గుణ కథా మవోజన్మాచ భూభుజే

★ ★ ★

రాజకార్య ప్రమాదిత్వాత్ రాజ చిత్త సురంజనం
కర్వన్న వర్తత సదా కేశవో మంత్రి శేఖరః

★ ★ ★

# పంచ బ్రహ్మోదయ భాష్యములోని వంశానుక్రమణిక




## అధోజ్ఞాపికలు

1 **HRK** 197వ పుటలోని కందుకూరి రెడ్ల వంశ వృక్షమున సీమాచ భూపతియును, నీతని తమ్ముడు శ్రీగిరియును నుదాహృతులు కాలేదు.

2 "శంకర కవికృతిగా సంస్కృత బసవ పురాణమును గర్ణాటకవి చరిత్ర పేర్కొనుచున్నది. అది ఇదిగక వేఱొకటి కావచ్చును. (బసవపురాణ పీఠిక, పుట 32, 1926)

3 ఎఱ్ఱిన గురువు శంకరమౌనిని గూర్చి వ్రాయుచు "బసవ పురాణమును సంస్కృతీకరించిన శంకరారాధ్యుడెవ్వడో తెలిసికొనవలెను." (నృసింహపురాణ పీఠిక, పుట IV నావిళ్ళ, మదరాసు 1953).

4 కృతికర్త తన కృతికన్య నిచ్చి కృతిభర్తకు ధారవోయును. కృతికర్త, కృతి భర్తల మధ్య నేర్పడిన సంబంధమును వైవాహిక పద్ధతిగనే తిక్కనాదులు గ్రహించిరి అట్లయినచో భారద్వాజ సగోత్రీకులయిన సింగన, శ్రీనాథులు కృతి భర్త, కృతికర్త లెట్లయిరో దురూహ్యముగా నున్నది. బహుశా కృతికన్యను నిచ్చుటలో గోత్ర విషయమైనంత పట్టింపు యుండి యుండక పోవచ్చును.

5 వీరుగాక కాంచీపురమునందు గండగోపాలుడను తెలుగు చోళరాజు తన గురువగు శంకరయోగికి అంబికాపురమును గ్రామమును 108 మంది బ్రాహ్మణులకు భోజన నిమిత్త మిచ్చినట్లు తామ్రశాసనముకలదు (El. Vol XIII పుటలు 194 197) ఈ శాసన కాలము 1291 — అని కొందరును, 1351 అని కొందరును చెప్పుచున్నారు. ఎఱ్ఱా ప్రగడ గురువు శంకరస్వామియొకడు కలడుకదా! (హరి పూ. 1-10, నృ పు 1-11) ఈ శంకరస్వాము లిరువురను నీ సందర్భమున స్మరణకు తెచ్చుచుంటినేగాని గుర్తించుట కొరకు మాత్రముకాదు.

6 శ్లో॥ శ్రీమత్కోటి ఫలీ పురీవర శివ ప్రాసాద సంవాసినం
లింగాంగైక్య విమర్శ దర్శన విదం వేదార్థ సంవేదినం
శశ్వత్ప్రాపిత శైవ ధర్మ సమయం శిష్య ప్రశిష్యాన్వితం
విశ్వారాధ్య గురుం నమామి సతతం విశ్వాభివంద్యం విభుం॥

అని శైవ పంచక మందలి యారాధ్య స్తుతులలో గలదనియును, కోటిఫలి యారాధ్యులకు విశ్వారాధ్యులని పేరున్నట్లును శైవమత ప్రకాశిక (సంపు 5, సంచిక 2, పుట 20)లో ముదిగొండ రామలింగ శాస్త్రిగారు వ్రాసిరి. బహుశః దీనికి ప్రమాణ మీ శ్లోకమేయయి యుండునేమో !



డా. చందు సుబ్బారావు

# క్రీ॥ శ॥ 2000 నాటికి ప్రపంచ నీటివనరుల సంక్షోభం ?

ఈ భూగోళాన్ని నిజానికి 'సముద్రగోళం' అనాలని ఒక శాస్త్రవేత్త చమత్కరించాడు. ఇది హాస్యోక్తి కాదు. భూమి ఉపరితలంలో 71% నీరు ఆక్రమించి వుంది. కేవలం 29% ఉన్నా, భూ ఖండాలు మానవునికి నివాసయోగ్యం కావటంచేత 'భూగోళం' అని పిల్చుకుంటున్నాం. భూమి పుట్టుక సమయంలో అవతరించిన 'నీరు' నేటికీ తన రూపంలోనూ, ఉనికిలోనూ తప్ప 'పరిమాణం'లో మార్పు చెందలేదు ఇలా ఆవిర్భవించిన నీటి మొత్తం 'పరిమాణం'లో 97% సముద్రాల్లో ఉప్పునీరుగానే వుంది అంటే త్రాగటానికిగాని, మానవుని ఇతర అవసరాలకుగాని యోగ్యమైన మంచినీరు కేవలం 3% అన్నమాట. తిరిగి ఈ మూడుశాతంలో 2 వంతులు ఘనీభవించిన మంచుదిబ్బలై ఉత్తర, దక్షిణధృవాల్లో ఉండిపోయింది. అంటే ఇక మిగిలింది ఒకే ఒక్క శాతం ఇది భూ ఖండాలమీద విభిన్నరూపాల్లో 'వనరులు' గా అవతరించివుంది. దీనినే మనం టూకీగా భూజలాలు లేక భూగర్భ జలాలు (ground waters) అనవచ్చు అయితే ఈ ఒక్క శాతం నీరు కూడా నదుల రూపంలోనూ, సరస్సుల రూపంలోనూ, భూమి పై పొరల్లోని 'తడి'గానూ, క్రిందిపొరల్లోని 'అంతర్జలం' (Sub surface water) గానూ విడిపోయి ఉండటం వలన మానవునికి అతి సులభంగా అంది వచ్చే మార్గంలోలేదు. అతడు ఎంతో శ్రమించితేతప్ప నీటిని 'వినియోగం'లోనికి తీసుకోవటం సాధ్యపడదు. అలా నీటిని అవసరాలకై వినియోగించే పద్ధతిలో మరి కొంత భాగాన్ని తను కోల్పోతున్నాడు. వెరసి తనకు లభ్యమయ్యే నీటివనరులకూ, వినియోగ క్రమానికి మధ్య అసమ తుల్యస్థితి (Imbalance) ఏర్పడుతుంది. ఇది ఇలా కొనసాగితే ప్రపంచ నీటి సంక్షోభానికి (World water crisis) దారి తీస్తుందని శాస్త్రవేత్తల అంచనా. ఈ విషయం గూర్చి కుణ్ణంగా చర్చించేముందు పైన వివరించబడిన నీటి వనరుల పరిమాణ పట్టిక (1) నొకసారి పరిశీలించి, దృష్టిలో ఉంచుకోవాలి.

పట్టిక—1

| 97% సముద్రాల్లో ఉప్పునీరు | 3% మంచినీరు | | | | |
|---|---|---|---|---|---|
| | నదులు | మట్టి పొరల తడి | సరస్సులు | అంతర్జలం | మంచు దిబ్బలు |
| | 0.3% | 06% | 0.3% | 24.3% | 75% |

## సంక్షోభం ?

ప్రతి ఏటా సముద్రాల్లోని నీటిమట్టంలో మీటరు మందం గల నీటిపొర ఆవిరై వాయుమండలంలో ప్రవేశించి, భూ ఖండాల మీదికి పయనిస్తుంది. అనువైన పరిస్థితుల్లో ఈ నీటి ఆవిరి చల్లబడి, ఘనీభవించి, నీటిబిందువులుగామారి వర్షం, మంచు, పొగమంచు, వడగండ్లు, మొదలైన నీటి రూపాల్లో భూమిపైకి అవతరిస్తుంది. తిరిగి భూమిమీదనుండి కాల్వలు, నదులద్వారా సముద్రంలోనికి పయనిస్తుంది. భూమిమీద అవతరించే సమయంలోనే భూమిపొరలు కొంతనీటిని గ్రహిస్తాయి. ఈ గ్రహించబడ్డ నీరు పై పొరల్లో 'తడి'గానూ, క్రింది పొరల్లో 'అంతర్జలం'గానూ నిల్వచేయబడుతుంది. ఈ మొత్తం ప్రక్రియను 'జలచక్రం' అంటారు. దాదాపు అన్ని ప్రాంతాల్లోనూ ఈ 'జలచక్రం' సాలీనా పునరావృతం అవుతుంటుంది. అందునేతనే ఒక ప్రాంతంలోని నీటి పరిమాణ విభాగాలు (పట్టిక 1. చూ.) స్థిరంగావుంటాయి. ఈ 'జలచక్రం' ఇప్పట్లో మారుతుందని గాని, భవిష్యత్తులో మారే సూచనలున్నాయని గాని ఎవరూ భావించటంలేదు. దాదాపు మానవాళి అవసరాలకు లభించే నీటి ఆదాయం స్థిరమన్నమాట ఖర్చులు మారవచ్చన్నది అంచనా. ఆదాయ వ్యయాలకు తూకం కుదరనప్పుడు 'సంక్షోభం' సంభవిస్తుంది. స్వర్ణసంక్షోభం, పెట్రోలియం సంక్షోభం, విద్యుత్ సంక్షోభాలవంటిదే ఇది కూడా.

నేటి ఆదాయ వ్యయా లెలావున్నాయి? ఏ రూపంలో వృద్ధి చెందుతున్నాయి? క్రీ॥ శ॥ 2000 నాటికి మానవుని అవసరాలు ఎలా ప్రణాళికల్లో పొందుపరచబడుతున్నాయి, అన్నవి ముఖ్యాం

శాలు. క్రీ॥ శ॥ 2 000వ సంవత్సరం నేటికి పట్టుమని 25 సంవత్సరాలు కూడా లేనందున భౌమిక కాలమానంలో శాస్త్ర వేత్త ఈ కాలాన్ని అతి ప్రాముఖ్యంతో చూడగలడు. ఈ సంక్షోభం గూర్చి పరిశీలించేముందు పట్టిక—2లో పొందుపరచబడిన అంకె లను ఒకసారి మననం చేసుకోవాలి.

మానవుని గృహ, సామూహిక, వ్యవసాయిక, నాగరిక అవస రాలు వృద్ధి చెందటంవలన అవసరమయ్యే అధిక నీటివనరుల వివ రాలీ పట్టికలో ఉహాయబడ్డాయి.

## పట్టిక – 2

[నీటి ప్రమాణం ఘన కి. మీ. లో]

| అవసరం | నేడు | క్రీ శ 2000 నాటికి |
|---|---|---|
| గృహ, మున్సిపల్ వాడకం | 110 | 920 |
| పశు సంపదకు | 40 | 150 |
| విద్యుద్ఛక్తి | 250 | 3,100 |
| పరిశ్రమలు | 200 | 3,000 |
| వ్యవసాయం | 2,500 | 4,250 |
| వ్యవసాయేతర పంటలు | 1,260 | 2,500 |
| మురుగు | 1,220 | ? |
| కాలుష్య ప్రభావం | 5,580 | ★ 37,600 |
| మొత్తం | 11,160 | 51,520 |

★ కాలుష్యం ఈ రీతిలో కొనసాగితే సంభవించగల అంకె. తగు జాగ్రత్తల వలన ఈ అంకె మారవచ్చు.

నీటి బడ్జెట్ వేసే జల ఆర్థిక శాస్త్రవేత్తలు పట్టిక-2 రూపొందించేముందు తీవ్రమైన పరిశోధనలు, వివిధ దేశాల, ఖండాల సామాజిక పరిస్థితులూ, పథకాలూ, నాగరికతలూ దృష్టి లోకి తీసుకున్నారు ఇవి యథేచ్ఛగా వేసిన అంకెలుకావు ఆయా దేశాల నీటి వనరుల ప్రామాణిక పరిస్థితిని పరిగణించిన పిదప, తగినంత 'సందేహ ప్రవృత్తి'ని నష్టంగానే భావించి ఆశావాదంతో రూపొందించిన అంకెలేనని గ్రహించవచ్చు.

వారు పరిగణనలోనికి తీసుకున్న అంశాల్లో ప్రధానమైనవి అయిదు.

1. మానవుని వ్యక్తిగత గృహ అవసరాలు తల ఒక్కంటికి నేడు రోజుకు 150 లీటర్లుండగా 2000 నాటికి 400 లీట ర్లకు పెరుగుతుంది.

2. 21 శతాబ్దం ఉదయించేసరికి ప్రపంచ పారిశ్రామిక జీవనం 15 రెట్లు వృద్ధిచెందుతుంది.

3. ప్రపంచ జనాభా ఆనాటికి 600 కోట్లను చేరుతుంది.

4 సాగులోనికి తీసుకురాబడే నేల 5 రెట్లు అధికమవు తుంది.

5. కాలుష్యం ఈ రీతిని కొనసాగితే మన నదులు, కాల్వలు మురికి నీటి ప్రవాహాలుగామారి 'మృత స్రవంతుల' ఒడ్డున మనిషి నిస్సహాయుడుగా ఉండక తప్పదు

ఈ అంశాల్లో మొదటి నాలుగూ నిర్మాణాత్మకమైనవికాగా అయిదవది విధ్వంసక రూపంలోనికి చెందినది. ఈ అంశాన్ని పరి గణనలోనికి తీసుకోవటానికి కారణం, మొదటి నాలుగు అంశాలను పునరాలోచించటానికి మానవజాతి సుముఖంగా లేకపోవటమే. ప్రగ తికి సంబంధించినంతవరకు అవిధనాంశాలు కాగా, ప్రగతితోపాటు సంభవించే అనివార్య ఋణాంశంగా ఇదికూడా లెక్కలోని కెక్కవలసి వచ్చింది.

ఇందులో 'మురుగు నీరు' తిరిగి వాడుకలోనికి తెచ్చే సూచన లున్నందున దాని తాలూకూ అంకె 2000 నాటికి ఎలా వుండ గలదో తేల్చబడలేదు ఈనాడు ప్రపంచంలో 100 పరిశ్రమలు మురుగు నీటిని తిరిగి శుభ్రపరిచి దాదాపు 80. ఘన. కి. మీ నీరు వాడుకలోనికి తెస్తున్నాయి. ఇవి చాలా ఖర్చుతో కూడి పనిచేయటం వలన వీటిని వృద్ధి పరచాలా లేదా అన్నది సందేహాస్పదంగా వుండి పోయింది. నీరును సక్రమంగావినియోగించటం ఇంతకంటె సులభం కావటంవలన (వ్యాధి నిరోధం, వ్యాధి నివారణ కంటే మేలన్నట్లు) నీటి శుద్ధి కార్యక్రమం అంతగా పట్టించుకోబడటం లేదన్నది గమ నించవలసిన విషయం

## సంక్షోభ నివారణ పద్ధతి

సంక్షోభం సంక్రమించిందాకా వేచిచూడటం వివేకం కాదు కనుక ప్రపంచ శాస్త్రవేత్తలు 'జల ప్రణాళిక'ను పునరాలోచించ మొదలెట్టారు. దీనికి ప్రాథమిక చర్యగా నేటి 'జల చక్రం' లో వివిధ ఖండాల 'బడ్జెట్' లను రూపొందించారు ఏ ప్రాంతం ఏ విధంగా నీటినిపొందుతున్నది, వ్యయపరుస్తున్నది రూపొందించారు. ఈ వివరాల వలన ఆదాయ, వ్యయాలతోపాటు, ఏ వ్యయం అని వార్యమో, సవరించతగునో, సక్రమమైన వాడుకలోనికి తేవటానికి వీలవుతుందో తెలుస్తుంది.

పట్టిక-3 లో ఈ వివరాలు పొందుపరచబడ్డాయి. [సంఖ్యా ప్రమాణాలు చిన్న చిన్న సవరణలతో పూర్ణాంకాలుగా స్వీకరించ వచ్చు.]

# పట్టిక – 3

[నీటి ప్రమాణం ఘన. కి. మీ లలో]

| ఖండం | వైశాల్యం మిలియన్ చ. కి. మీ | వర్షపాతం | ఆవిరి | బయటకుపోయే నీరు భూమి లోపల నుండి | పైనుండి |
|---|---|---|---|---|---|
| ఐరోపా | 9 8 | 7,165 | 4,055 | 2.045 | 1,065 |
| ఆసియా | 45.0 | 32,690 | 19,500 | 9,780 | 3,410 |
| ఆఫ్రికా | 30.3 | 20,780 | 16,555 | 2,760 | 1,465 |
| ఉ. అమెరికా | 20.7 | 13,910 | 7,950 | 4,220 | 1,740 |
| ద. అమెరికా | 17.8 | 29,355 | 18,975 | 6,640 | 3,740 |
| ఆస్ట్రేలియా | 8.7 | 6,405 | 4,440 | 1,500 | 465 |
| మొత్తం | 132 3 | 110,305 | 71,465 | 27,545 | 11,885 |

పట్టిక–3 ను పరిశీలించటం ద్వారా మన కో ముఖ్యాంశం తెలుస్తుంది. ప్రపంచ వర్షపాతం సాలీనా 110,305 ఘ. కి. మీ. కాగా (ఈ అంకె భవిష్యత్తులో మారదన్నది భూమిక) భూమిపై నుండి, లోనుండి బయటకుపోయి సముద్రాల్లోకలిసే నీటిప్రమాణం 40,000 (27,545 + 11,885) ఘ. కి. మీ. ఉంది. ఇందులో ఏ మాత్రం నీటి ప్రమాణాన్నయినా సముద్రంలో కలియనీయకుండా భూమిపైకి మళ్ళించి భూమి పొరల్లోకిగాని, భూమిపైన రిజర్వాయర్లలోగాని దాచుకోవటానికి ప్రయత్నించవచ్చు.

రెండవ అంశం ఆవిరి. నీటి వనరుల నుండి నీరు ఏటా సూర్య కిరణ ప్రభావం వలన వాయుమండలంలోనికి 'లేచే' అంశం చాలాముఖ్యమైనది ఇది ఇంతింతై, వటుడంతై అన్నట్లు కన్పించకుండా నీటి వనరుల్ని హరిస్తుంది ఈ విభాగం ప్రమాణం పట్టిక- 3లో చూపబడినట్లు 71,465 ఘ కి. మీ ఉండటం వలన, ఈ వ్యయాన్ని తగ్గించేందుకు ఏర్పాట్లు చేసుకోవటం పరిశోధనల్లో ప్రముఖ విషయంగా పరిణమించింది

కొన్ని రసాయనాలు నీటిలో కలపటం ద్వారా, నీరు ఆవిరయ్యే శక్తిని క్షీణింపచేయవచ్చు అలాగే భూమిపైన పలచని గడ్డి, చిన్న వృక్ష సంతతి పొరలను పెంచటం ద్వారా అంతర్జలం ఆవిరయ్యే 'వీలు' తగ్గుతుంది. అలాగని పెద్ద పెద్ద వటవృక్షాలను పెంచితే అవి తమంత తామే నీటిని గ్రహించి వాతావరణంలోనికి పంపించేయగలవు (ఒక దేశరక్షణ వ్యయం, అభివృద్ధి వ్యయాన్ని మించిపోయినట్లు), అలాగే మహారణ్యాలను పెంచేటప్పుడు ఈ విషయం దృష్టిలో ఉంచుకోవాలి.

వర్షపాతాన్ని హెచ్చించే కృత్రిమ పద్ధతులవలన కొంత వర్షపాతం పెంపగలిగినా తగినంత లభ్యమయే తార్కాణం లేనందున వర్షపాతాన్ని స్థిరసంఖ్యగా పరిగణిస్తున్నారు.

వీటి అన్నిటి ప్రాముఖ్యత ఒక ఎత్తు. కాలుష్య నివారణ ఒక ఎత్తు అని చెప్పుకోవచ్చు. 37,600 ఘ.కి.మీ (పట్టిక–2) నీటినుండి తగిన నివారణ పద్ధతులద్వారా, తగినంత నీటిని సద్వినియోగ పరచాలన్నది నిర్వివాదాంశం. ప్రపంచంలో ఈ విషయానికి ఇప్పటికే అత్యంత ప్రాముఖ్యత యివ్వటం జరిగింది వాటి విజయవంతమైన ఫలితాలు ముందుముందు తెలియగలవు.

## సంక్షోభం సంభవిస్తే... ?

కీడెంచి మేలెంచమన్నది సూక్తి. శాస్త్రజ్ఞులకూడా ఇది శిరోధార్యమే. అందుకుగాను వారు తగిన సన్నాహాలు చేయక పోలేదు. ఒకవేళ ప్రపంచ జలసంక్షోభం సంభవిస్తే ఆందోళన చెందవలసిన అవసరం లేకుండా ఈ క్రింది జాగ్రత్తలు తీసుకుంటున్నారు :

1. మొట్టమొదట చెప్పబడినట్లు భూగోళంపై నీటికి కరువులేదు. 97% నీరు 'ఉప్పునీరు'గా ఎటూ ఉండనే వుంది. దీనిని మంచినీరుగా (desalination) మార్చే పరిశ్రమలు ఇప్పుడు కేవలం పరిశోధనలస్థాయిలో వున్నాయి. ఒక్క రూపాయికి 100 లీటర్లు లభించగల సాంకేతిక ప్రగతి ఈనాటికే వుంది.

ఎక్కువ ఖర్చుతో అయినా 'నీటి ఎద్దడి' ని పరిష్కరించటం అసంభవం కాదు

2. మంచినీటిలో 75% ధృవప్రాంతాల్లో ఘనీభవించి ఉందని తెలుసుకున్నాం. ఈ నీటిని కరిగించి ఖండాలవేపు తరలించటానికి అపారమైన విద్యుచ్ఛక్తి అవసరం. కాని ఈ శక్తిని తగ్గించి, అధికమైన జల సరఫరా గావించటం ఊహాతీతం కాదు.

3 అసలు సంక్షోభానికి కాతగిన కారణంగా మురుగు లేక కాలుష్యాలను మాత్రమే ఎంచుతున్నారు కనుక నీటి ఎడల తగినంత శ్రద్ధ ఎప్పుడూ అవసరమే.

4. తక్కువ నీటితో వ్యవసాయ పద్ధతులు ఇప్పుడు కొన్ని ప్రాంతాల్లో అవసరమైనట్లే, నీటి వనరులు తగ్గినప్పుడు సహజ సిద్ధాలవుతాయి

ఒక జాతి, లేక వ్యక్తి సక్రమమార్గంలో ఆలోచించటం ద్వారా సంక్షేమ స్థితిని నెలకొల్పుకోగలడు. సంక్షోభ నివారణ వారికి ఎప్పుడూ సామాన్యంగానె కన్పిస్తుంది భవిష్యద్దర్శనం వివేకానికి నిదర్శనం గుర్తించుకోవలసింది ఒక్కటే నీరు ప్రాణికి జీవప్రదాయిని. నీరు లేకుండా గత్యంతరం లేదు ఉందేమో పరిశోధించి కనుగొంటే ఎవరికీ అభ్యంతరం ఉండదు.

## ఆధార గ్రంథాలు :

1. నీరు, భూమి, మనిషి; రిచర్డ్ చోర్లీ,
మిధియన్ కంపెనీ, 1969.

2. జలభూగర్భశాస్త్రం; డేవిస్ మరియు డీవీస్ట్;
జాన్ విలీ అండ్ సన్స్, 1970

3. లోఫోవిచ్; ప్రపంచ నీటివనరులు, మాస్కో, 1973.

4 అంతర్జలనిధుల పరిశీలన; వాల్టన్ విలియం, మెగ్రాహిల్
కంపెనీ, 1970.

# శ్వాసించే గోరీ

## శ్రీ వనమాలి

సీతాకోక చిలకలా గిలిగింతలు పెట్టే
అస్తమిస్తున్న సూర్యుడి దగ్గరికి
నన్ను తీసుకెళ్ళకు.
ఆ పండు కిరణాల్ని ప్రాణవాయువులా
శ్వాసిస్తే
దేహంలో మళ్ళీ రక్తకణాలు మేల్కొంటాయి
అక్కడ నాకు
చీకటిని స్రవించే వృక్షాలకు
ఉరితీయబడ్డ నా గాలిపటాలు కనిపిస్తాయి.

నిరాశ ఒక్కటే
జీవితంమీద వాలే సత్యాల్ని
చూపిస్తుందని తెలుసు నాకు
నన్నర్థం చేసుకో
ఆత్మ వంచనలాటి
ఆశావాదంతో రాజీపడలేను
నన్నీ
పుస్తకాల కోటగోడలమధ్య వదిలెయ్
శ్వాసించే గోరీలా ఉండిపోతాను.

~~~~~
~~~~~

"స్ఫూర్తి శ్రీ"

# తెలుగులో సాహిత్య విమర్శ

మనం మెచ్చుకున్నదాన్నే నలుగురూ మెచ్చుకోవాలనీ, మనం తిరస్కరించినదాన్నే నలుగురూ తిరస్కరించాలనీ మన అభిలాష. అందుకోసం వీలయినంతలో ప్రయత్నం చేస్తాము; పట్టు పట్టి ఒప్పిస్తాము కూడా. ఇది మానవ స్వభావం

మన ఆనందాన్నో, ఆవేదన్నో నలుగురితోనూ పంచుకుని అనుభవించడమే యిందులోని పరమార్థం. ఇదే విమర్శకు మూల సూత్రం

ప్రాక్తనయుగంలో — పనిచేసుకుంటున్న సమయంలోనో, విశ్రాంతి తీసుకుంటున్న సమయంలోనో, ప్రకృతి ప్రభావానికి పరవశించిన సమయంలోనో, విరుద్ధశక్తుల విజృంభణకు విల విల్లాడిన సమయంలోనో కవితా హృదయంలో కదలిక కలిగి కంఠను విచ్చుకుంది; తోటివారి అభినందనల్ని అందిపుచ్చుకుంది; వారిని తనవెంట లాక్కుంది ఆశువుగా పుట్టిన కవిత్వానికి ఆశువుగానే విమర్శలూ అందాయి మందిలో పుట్టిన మౌఖిక కవిత్వానికి మందిలోనుంచి మౌఖికంగానే విమర్శలూ పుట్టాయి.

అనంతరకాలంలో -- ఆశుకవిత్వం ఒక ప్రక్రియగా రూపొందింది. ఆశువిమర్శలు మాత్రం అలాగున్నట్లే యీనాడూ వ్యాప్తి పొందుతున్నాయి. నన్నయభట్టారకుడు తన భారతావతారికలో సభల్ని ప్రశంసచేశాడు ఆ ప్రసంగాన్నిబట్టి చూస్తే ఆ సభల్లో కవులు తమ కవితల్ని చదివి వినిపించేవారనీ, ఆ సభ్యులు విమర్శలు చేసిచేసి తిరస్కరించడమో, పురస్కరించడమో చేసేవారనీ అనిపిస్తుంది. ఆ సభలు మెచ్చినవాటికే అంతటా ఆమోద ప్రమోదాలు లభించేవి. అయితే, ఆ విమర్శలు కూడా ఆశువుగానే ఉండేవి ఇప్పటికీ చర్చా సదస్సులనుంచీ, ఉపన్యాసవేదికలనుంచీ, పౌరాణికుల వివరణల్లోనుంచీ, భాగవతారుల కథాకాలక్షేపాల్లోనుంచీ, సరస హృదయుల ప్రసంగాలనుంచీ, సారస్వతాచార్యుల పాఠప్రవచనాల నుంచీ సాహిత్య విమర్శ మౌఖికంగా వెలువడుతూనే ఉంది తన స్వరూపాన్ని వేర్వేరు కోణాల్లో ప్రదర్శిస్తూనే ఉంది.

అసలు, ఇంతకూ విమర్శ అంటే యేమిటి ? 'మృశ ఆమర్శనే' అనే ధాతువుకు 'వి' అనే ఉపసర్గ చేరడంచేత ఈ రూపం ఏర్పడింది. ఆమర్శన మంటే స్పృశించడమనీ, తరచడమనీ, సలహాయివ్వడమనీ, పరిశీలించడమనీ అర్థాలు. విశేషంగా, అధికంగా — అన్న అర్థాన్ని ఉపసర్గ తెలుపుతుంది. దీన్నిబట్టి విశేషంగా వివరించడమనీ, లోతుగా తరచి విశ్లేషించడమనీ, బాగోగులను నిర్ణయించి సలహా యివ్వడమనీ, సమగ్రంగా పరిశీలించి విలువ కట్టడమనీ 'విమర్శ' పదానికి అర్థాలు లభిస్తాయి. నిజానికి విమర్శ విధానంలో, వేర్వేరుగా కనిపిస్తున్న యీ అంశాలన్నీ అవినాభావ సంబంధం గల అంతర్భాగాలు మాత్రమే

తెలుగులో 'విమర్శ' అనే పదానికి 'నిందించడం' అనే అర్థమొకటి వాడుకలో ప్రబలంగా ఉంది. ఆంగ్లంలో ఉన్న Criticism అన్న మాటకూ ఈ అధోగతి తప్పలేదు విమర్శకులు దోషైకదృక్కులై, . కేవలం ఖండనమాత్ర పరాయణులయిన కాలంలో అది చారిత్రకంగా సంక్రమించిన స్వత్వం కావచ్చు. అది యౌగికమూ కాదు; యోగరూఢమూ కాదు ఆ అర్థం ప్రస్తుతానికి అప్రస్తుతం.

మనకు లిపిబద్ధమై ప్రాచీనంగా ఉన్న విమర్శ వ్యాఖ్యానమూ టీకా మొదలయిన రూపాల్లో ఉంది. పద విభాగం చేసి, శబ్దార్థం చెప్పి, వాక్యాన్వయం కుదిర్చి, అలంకారం గుర్తించి లక్ష్యలక్షణ సమన్వయం చేసి, వ్యాకరణాది విశేషాలు ప్రదర్శించి, రసభావాదుల్ని నిరూపించి, కావ్యసౌందర్యాన్ని ఆవిష్కరించడం వ్యాఖ్యాన లక్ష్యం లక్ష్యవిస్తృతినిబట్టి వ్యాఖ్యానం కూడా విస్తృతంగానే ఉంటుంది ప్రతిపదార్థప్రాయంగా ఉండేది టీక. భాషాజ్ఞానం చాలనివాడు టీక లేకపోతే కావ్యం జోలికి పోలేడు. 'టిక ఉన్నంతలో కావ్య మర్థమవుతుందా ?' అంటే అయినంత అవుతుంది అసలు తెలియనిదానికంటె ఏదో కొంత తెలియడానికైనా వీలు కలుగుతుంది

ఆధునిక కాలంలో విమర్శ బహుముఖాలుగా అభివృద్ధి చెందింది ఈ వృద్ధికి పాశ్చాత్య విమర్శన రీతులు ఎంతగానో సహకరించాయి. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర అని వంగూరి సుబ్బారావు గారూ, ఆంధ్రకవుల చరిత్ర అని కందుకూరివారూ సాహిత్య చరిత్ర రచనకు అంకురార్పణం చేశారు కాశీభట్ల, కవిత్వవేది, చాగంటి, ఖండవల్లి, నిడదవోలు పింగళి లక్ష్మీకాంతం, శిష్ట్ల రామకృష్ణ శాస్త్రి ఆ మార్గాన్ని సంపన్నం చేశారు కురుగంటి, పిల్లలమర్రి నవ్యాంధ్ర సాహిత్య వీధులు వేయగా, మధునాపంతుల ఆంధ్ర రచయితల కద్దం పట్టారు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ ఆంధ్ర రచయిత్రులనే కాక భారత రచయిత్రులను కూడా ఆలోకించారు. 'సమగ్రాంధ్ర సాహిత్యం' ఆరుద్ర చేతిలో అందాలు దిద్దుకుంటూ ఉంది.

విశ్వవిద్యాలయాల్లో డాక్టరేట్ మొదలయిన డిగ్రీలకోసం వ్రాసే సిద్ధాంత వ్యాసాలు చాలావరకు విమర్శ గ్రంథాలే. అయితే, వీటిలోనూ భేదాలు లేకపోలేదు. వ్యక్తి ప్రధానములూ, తత్త్వ

ప్రధానములూ అని సాముదాయిక గ్రంథాల్ని రెండు రకాలుగా విడదీయవచ్చు. సమగ్రములూ, ఏకదేశములూ అని ఐకాంతిక గ్రంథాల్ని రెండుగా విభజించవచ్చు. ఒక కవి వ్రాసిన అన్ని గ్రంథాల్నీ గ్రహించి సమగ్రంగా విమర్శిస్తే, అది వ్యక్తి ప్రధాన సాముదాయిక గ్రంథం. కొర్లపాటి శ్రీరామమూర్తిగారి శ్రీనాథుడు ఇటువంటి గ్రంథం. ఒక తత్త్వం, అంటే ఒకే విషయం ప్రధానంగా తీసుకుని అనేక గ్రంథాలనుంచి ఉదాహరణలు సేకరించి వివరించినట్లయితే, అది తత్త్వప్రధాన సాముదాయిక గ్రంథమవుతుంది. అంతటి నరసింహంగారి 'తెలుగు ప్రబంధములు–ప్రకృతి వర్ణన' యిటువంటిది. ఒకే గ్రంథాన్ని గ్రహించి అన్ని కోణాల్లోనుంచీ విమర్శించినట్లయితే ఐకాంతిక సమగ్ర గ్రంథమని పేర్కొవచ్చు. దివాకర్ల వేంకటావధానిగారి 'నన్నయ భారతం' ఉదాహరణం. ఒకే గ్రంథాన్ని గ్రహించి, అందులోనూ ఒక్క విషయాన్ని మాత్రమే వివరించినట్లయితే ఐకాంతిక ఏకదేశగ్రంథం అనిపించుకుంటుంది. వి.వి.ఎల్.నరసింహారావుగారి 'నన్నయ అక్షర రమ్యత' యిటువంటిది.

ఒక కవిని మరో కవితో కాని, ఒక కావ్యాన్ని మరో కావ్యంతో కాని పోల్చి విమర్శించడం తులనాత్మక పరిశీలన. ఎస్. వేంకటరమణయ్యగారి 'రంగనాథ కంబరామాయణములు' ఈ కోవకు చెందిన సిద్ధాంతగ్రంథం. సాహిత్య దృష్టితోనేకాక సాంఘికదృష్టితోనూ, ఛందో దృష్టితోనూ, ఆలంకారిక దృష్టితోనూ, భాషా ప్రయోగదృష్టితోనూ కూడా కావ్యవిమర్శ సాగింది. తత్త్వాన్ని ఆధారం చేసుకున్నట్లే ఛందః ప్రక్రియనూ, సాహిత్య ప్రక్రియనూ ఆధారం చేసుకునీ--కాలాన్నీ, స్థానాన్నీ ఆశ్రయదాతనూ ఆధారంగా చేసుకునీ సాముదాయక గ్రంథాలు వెలువడ్డాయి. విశ్వవిద్యాలయాల్లో పుట్టిన సిద్ధాంత వ్యాసాలేకాక ఈ కోవకు చెందిన అనేక గ్రంథాలు స్వతంత్రంగా వచ్చాయి. కొండ, విలుకూరి, విశ్వనాథ, పంచాగ్నుల, గడియారం, పుట్టపర్తి, యస్వీ జోగారావు, కె. వి. రమణారెడ్డి, జి.వి.సుబ్రహ్మణ్యం, తూమాటి దొణప్ప, సర్దేశాయి తిరుమలరావు ప్రభృతులు స్వతంత్ర విమర్శ గ్రంథకర్తల్లో కొందరు

ప్రాచీన గ్రంథాల్ని పరిష్కరించి ప్రచురిస్తూ కొందరు ప్రకాశకులు ఆయా గ్రంథాలకు పీఠికలు జతచేశారు దేవరాజసుధి, శేషాద్రి రమణకవులు, వేలూరి శివరామశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, బండారు తమ్మయ్య, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, గంటి జోగిసోమయాజులు, పింగళి లక్ష్మీకాంతం మొదలయినవారు ప్రశంసనీయ పీఠికాకర్తలు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ప్రచురించిన ప్రాచీన గ్రంథాల పీఠికలు దాదాపుగా, ఒక్క ప్రతిపదార్థ తాత్పర్యాన్ని మినహాయించి, వ్యాఖ్యానప్రాయాలుగానే సాగాయి ఎమ్మెస్కోవారు 'సంప్రదాయ సాహితి' పేరుతో ప్రచురించిన ప్రబంధాలకి విశ్వనాథవారు సంతరించిన పీఠికలు కథాకథన ప్రధానంగా ఉండి, అనభిజ్ఞులికి కూడా ఆసక్తిని కలుగజేస్తున్నాయి

సంస్థల సక్షంలో వెలువడిన గ్రంథాలకేకాక ప్రత్యేక గ్రంథాలకు కూడా కొన్ని పీఠికలు సమర్థ విమర్శలుగా రాణిస్తున్నాయి. మధునాపంతులవారి 'సదాశివ పంచాశిక'కు మాధవరామశర్మగారి 'ఉపహారం' భాష్యం వంటిది. జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి 'కరుణశ్రీ'కి నండూరి రామకృష్ణమాచార్యుల పీఠిక గచ్ఛద్వ్యాఖ్యలా పనిచేస్తుంది. వేంకట పార్వతీశ్వర కవుల ఏకాంతసేవకు దేవులపల్లివారి పీఠిక, కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్షానికి తల్లావఝ్ఝలవారి పీఠిక, వైతాళికుల గ్రంథానికి ముద్దుకృష్ణగారి పీఠిక భావకవిత్వోద్యమానికి వివరణలుగా అనిపిస్తాయి. దువ్వూరి రామిరెడ్డి 'పానశాల'కూ, దాశరథి గాలిబ్ గీతాల'కూ వ్రాసుకున్న పీఠికలు దాదాపు ఆ గ్రంథాలకు విమర్శలే. వచన కవులూ, విప్లవ కవులూ కూడా తమ కవితోద్యమాన్ని గురించి పీఠికల రూపంలోనూ, కవితల రూపంలోనూ, సంవాద రూపంలోనూ వివరించుకున్నారు.

ఇటీవల కొన్ని ప్రోత్సాహిక సంస్థలు బయలుదేరి, పలువురు ప్రముఖులచేత ప్రసంగాలు చేయించి, వాటిని పుస్తక రూపంలో అచ్చువేస్తున్నాయి. వీటిలో హైదరాబాదులోని 'యువభారతి' అత్యంత శ్లాఘనీయమైన కృషిచేస్తూ ఉంది. ప్రాచీన నవీన వర్తమాన కావ్యాలనే కాక ఇతర సాహిత్యప్రక్రియల్నికూడా విమర్శకు వస్తువుగా స్వీకరించడం ప్రశస్తంగా ఉంది. హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రకటించిన ఆంధ్ర మహాభారతోపన్యాసాలు, భాగవతోపన్యాసాలు ఎందరికో హస్తకలాపాలు, హృదయ నిక్షేపాలూ అయ్యాయి. తిరుపతి సాహిత్య సమితి, కర్నూలు సాహితీ సదస్సు, భీమవరం రామరాజభూషణ సాహిత్య పరిషత్తు మున్నగు సంస్థలు కూడ కొన్ని విమర్శక వ్యాస సంపుటాల్ని ప్రకటించాయి

శారద, భారతి అముద్రితగ్రంథ చింతామణి, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, ప్రతిభ మొదలయిన పత్రికలతో ప్రారంభమై ఈనాటి దిన, వార, మాసపత్రిక లన్నింటిలోనూ విమర్శ వ్యాసాలు ప్రకటితమౌతూ ఉన్నాయి. కొన్ని పత్రికలు పుస్తక సమీక్షల్ని కూడా ప్రకటిస్తూ ఉన్నాయి ఆకాశవాణి సాహిత్య ప్రసంగాల్నీ, పుస్తక సమీక్షల్నీ కూడా ప్రసారం చేస్తున్నది. కొన్నింటిని 'వాణి' లో ప్రకటించడం కూడా జరుగుతున్నది పూర్వముద్రిత వ్యాసాల్ని యిటీవల సాహిత్య అకాడమీ నాలుగు సంపుటాలుగా ప్రకటించింది. పురిపండా అప్పలస్వామిగారూ, జి. వి సుబ్రహ్మణ్యంగారూ సంపాదకత్వం వహించడమేకాక, వ్యాసస్వరూప స్వభావాల్ని వివరిస్తూ చక్కని పీఠికలు కూడా సంతరించారు. పానుగంటి, ముట్నూరి, మల్లంపల్లి, చిలుకూరి నారాయణరావు, జయంతి రామయ్య, గిడుగు రామమూర్తి, మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, వఝ్ఝల చిన సీతారామ స్వామి శాస్త్రి, తేకుమళ్ల కామేశ్వరరావు మున్నగువారి పత్రికావ్యాసాలు ప్రసిద్ధాలు దేవులపల్లి రామానుజరావు, బూర్గుల రామకృష్ణరావు, బులుసు వేంకటేశ్వర్లు, కాటూరి వేంకటేశ్వరరావు, తిరుమల రామచంద్ర మున్నగు వారి వ్యాసాలు గ్రంథరూపం కూడా ధరించాయి.

పత్రికల్లో శ్రీవాత్సవ వార్షిక సమీక్షలు చేసేవారు. అందువల్ల ఆ సంవత్సరంలో వచ్చిన సాహిత్యాన్ని గురించీ, అందులో వివిధ శాఖల్నిగురించీ స్థూలంగానైనా తెలుసుకోవడానికి అవకాశం ఉండేది.

తరువాత ఇద్దరు, ముగ్గురు అటువంటి ప్రయత్నాలు చేశారు కాని సఫలం కాలేదు.

ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ప్రకటించిన పుస్తకాల్లో నూరేళ్ల నవల, నూరేళ్ల నాటకం, నూరేళ్ల వ్యాసం మొదలయిన విధంగా చిన్న చిన్న విమర్శ గ్రంథాలు వచ్చాయి. అవి చారిత్రక సర్వేక్షణకు బాగానే సహకరిస్తాయి.

'స్వాతంత్ర్యానంతర సాహిత్యం' అన్న పేరుతో పలువురు పలు విధాలయిన పత్రికా వ్యాసాలు ప్రకటించారు.

బసవరాజు అప్పారావు 'ఆంధ్ర కవిత్వ చరిత్ర' అన్నపేరుతో పాశ్చాత్య విమర్శ విధానం ప్రదర్శించారు. కట్టమంచి వారి 'కవిత్వ తత్త్వ విచారం' నవీన విమర్శకు నాంది పలికింది. సాహిత్య శిల్ప సమీక్ష, కావ్య శిల్పం, సాహిత్య సోపానాలు మొదలయిన గ్రంథాలు విమర్శ శాస్త్రగ్రంథాల. కాకర్ల రామనరసింహంగారూ, చెర్ల గణపతి శాస్త్రిగారూ ఈ మార్గంలో బృహద్గ్రంథ నిర్మాతలుగా పరిగణనకు వస్తారు.

నాటక సాహిత్య విమర్శకులుగా పురాణం సూరిశాస్త్రి, మల్లాది రామకృష్ణశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీనివాస చక్రవర్తి, పోణంకి శ్రీరామ అప్పారావు, ముదిగొండ వీరభద్రశాస్త్రి ప్రభృతులు ప్రసిద్ధులు. కొడవటిగంటి, గోపీచంద్, గొట్టిపాటి, బుచ్చిబాబు, సుదర్శనం, అమరేంద్ర, కృష్ణకుమారి, నాగభూషణ శర్మ, బొడ్డపాటి, లత మొదలైనవారు నవలా కథానికా విమర్శకులుగా దర్శన మిస్తారు. ఈ కాలంలో వ్యాసంకూడా విమర్శ వ్యాసాలతో సముచిత సమ్మాన భాజనమయింది.

వ్యాఖ్యాన రూపంలోనూ, సిద్ధాంత వ్యాసరూపంలోనూ ఉన్న బృహద్గ్రంథం మొదలుకుని, పది పదిహేను పంక్తుల పరిమాణంగల గ్రంథ పరిచయం వరకూ కూడా విమర్శ వ్యవహరిస్తున్నది. బృహద్గ్రంథాలు సునిశిత దృష్టికీ, సునూక్ష్మ వివేచనకీ సహకరిస్తుంటే సంగ్రహ వ్యాసం సాముదాయిక ప్రభావంచేత గంతవ్యమార్గాన్ని కాంతిమంతం చేయవచ్చు. అయితే, ఒక చిక్కుంది. బృహద్గ్రంథంలో సాముదాయిక ప్రభావం పలుచబడి పరమార్థం గోచరంకాని స్థితి యేర్పడవచ్చు. సంగ్రహ వ్యాసంలో ప్రత్యంగ సౌందర్యాన్నీ, భావన సౌష్ఠవాన్నీ గుర్తించగల అవకాశం లోపించవచ్చు. బహుశా ఇటువంటి చిక్కును గుర్తించడంవల్లనే బృహద్గ్రంథంలో సింహావలోకనం చేర్చడం కనిపిస్తుంది. ఇది సాముదాయిక ప్రభావానికి సహకరిస్తుంది. సంగ్రహ వ్యాసంలోని లోపాన్ని పూరించడానికి అక్కడ ఎంతమాత్రమూ అవకాశం లేదు. విశ్వనాథవారి 'సాహిత్య సురభి' ఈ లోపాన్ని ఒక విధంగా పూరిస్తుంది. యువభారతివారు ప్రచురించిన 'మందార మకరందాలు', 'వేమన్న వేదం' మొదలయిన గ్రంథాలు ఈ లోపాన్ని తీరుస్తాయి; కవిత్వావగాహన శక్తినీ, ఆస్వాదన శక్తినీ అభివృద్ధి పరుస్తాయి. ఈ సంగతి గమనించే ఒకటి రెండు పత్రికలు కూడా ఈ మార్గాన్ని అనుసరించి పద్య వ్యాఖ్యానాన్ని ప్రచురించడం మొదలు పెట్టాయి.

కొందరి దృష్టిలో సృజన గొప్పది; విమర్శ తక్కువది. ఎందుకంటే సృజన వల్లనే, సృజనను ఆధారంగా చేసుకోవడం వల్లనే విమర్శ పుడుతుంది. కొందరి దృష్టిలో విమర్శ గొప్పది; సృజన తక్కువది. ఎందుకంటే, విమర్శకుడు కవికున్న సర్వశక్తులూ కలిగి ఉండడమే కాక కవికే ప్రాణ ప్రతిష్ఠ చేస్తాడు. ఈ రెండూ అతివాదాలే. ఒక నాణానికి బొమ్మా బొరుసూ వంటివారు కవీ, విమర్శకుడూ. కవి స్రష్ట; విమర్శకుడు ద్రష్ట.

కవి కెంత శిక్షణకావాలో విమర్శకుడికీ అంత శిక్షణకావాలి. కవికి మల్లేనే విమర్శకుడికీ నిగ్రహం అవసరం. కవితావేశస్థానాన్ని లౌకికావేశం లోబర్చుకోకూడదు. విమర్శకుడు పక్షపాతానికీ, వైమనస్యానికీ అతీతంగా ఉండాలి. సహృదయుడు మాత్రమే సమీక్షకుడు కాగలుగుతాడు.

విమర్శకు దోషోద్ఘాటనమే లక్ష్యం కాదు; అలాగే స్తోత్రపరాయణత్వమూ లక్ష్యం కాదు. సముచితత్వంతో గ్రంథం లోతులు తడిమి, అందాలు అందిపుచ్చుకుని, పాఠకుడికి అందించడం విమర్శకు లక్ష్యం కావాలి.

కొందరు విమర్శకులు మూలగ్రంథంలో ఉన్న దానినే, ఆ మాటలనే అటూ ఇటూ తిప్పి చెబుతుంటారు. తాము ఆస్వాదింపగలిగినప్పుడే యితరులచేత ఆస్వాదింపజెయ్యగల నేర్పుఅలవడుతుంది. అది లేకపోతే వట్టి ఊక దంపుడే. కొందరు అవసరమున్నా లేకపోయినా తమ పాండిత్యాన్నంతటినీ కుమ్మరిస్తారు. దీనివల్ల పుటలు పెరగవచ్చు, విలువ యెంత మాత్రమూ పెరుగదు. తెలుగు వ్యాసం నిండా ఆంగ్లాది భాషల నుంచి వాక్యాలకు వాక్యాలే ఉదాహరిస్తూ వస్తే వ్యాసం తెలుగుతనాన్ని కోల్పోతుంది. వ్యాసకర్తకు తనమీద తనకే విశ్వాసం లేదేమో అని కూడా పాఠకుడు భావింపవచ్చు. ప్రమాణోద్ధరణ వాక్యాలు ముక్తసరిగా ఉండడం మంచిది.

సాహిత్యంపట్ల అభిరుచిని పుట్టించాలే కాని విమర్శకుడు పాఠకుడికి అరుచిని పుట్టించకూడదు. విమర్శకుడు తానెంత లోతుకు దిగినా పాఠకుడికి ఊపిరాడకుండా చెయ్యకూడదు. ఇటువంటి దోషాలు కాస్సేపు విస్మరిస్తే, మొత్తంమీద 'తెలుగులో సాహిత్య విమర్శ' ఈనాడు సరియైన మార్గంలోనే వ్యవహరిస్తున్నదన్నది సారాంశం.

శ్రీ ఎ. ఎ. బి. రామారావు

# సులోచనాలు

తాతయ్యంటే నాకు ప్రాణం.

మామ్మ నన్ను ముద్దు చేస్తుంది.

—శెలవలకి మావయ్య వచ్చి ఊరు తీసుకెళతానన్నాడు.

''అమ్మో! బాబీ లేకపోతే క్షణం గడవదు'' — తాతయ్య వెంటనే అరిచేశాడు.

''ఎండల్లో వాడెందుకురా! వాల్తేరునుంచి బిలాస్‌పూర్. అక్కడ వాళ్లిక్కడకు రావడం మంచిది కాని ఈ చల్లదనంలోంచి బాబోయ్, ఆ ఎండల్లోకా!''

'మీ మామ్మ కాళ్లల్లో కర్ర పెట్టేసిందిరా' అన్నాడు మావయ్య నాతో ఇవేవీ పట్టనట్టు నాన్నగారు అట్టమీద అస్థిపంజరం బొమ్మ ఉన్న ఇంగ్లీషు పుస్తకం చదువుకుంటున్నారు

అమ్మ ఎప్పుడూ ఏవో పనుల గొడవలో ఉంటుంది. నా గురించి పట్టించుకోనే పట్టించుకోదు. ''వెధవ. అర్థరాత్రి వరకూ అలా తిరుగుతాడు. రాత్రయితేమాత్రం నా పక్క వదలడు'' అంటుంది. చెల్లంటే అమ్మకి ముద్దు. నే నడిగితే కీ ఇచ్చేకారు కొనలేదు కాని చెల్లాయికి మాత్రం ఏడు రూపాయలిచ్చి రబ్బరు బొమ్మ కొనేసింది. ఆ గయ్యాళి అది నాకొకసారి చూడడానికైనా ఇవ్వకుండా దాన్ని కౌగ లించుకునే తిరుగుతుంది.

''వీడికి జోళ్లపిచ్చి'' అంటుంది పిన్ని

''—మూడు జతల జోళ్లుండగా ఇంకా ఎన్ని కావాలిరా నీకు!'' అని ఊరికే కోప్పడుతుంది

స్కూలు యూనిఫారమ్‌తో బూట్లుండాలా? ఆటలకి కెట్సు. మరి మామూలుగా ఎక్కడికైనా వెళ్ళడానికి చెప్పులు సరదాగా తొడుక్కోడానికి బెల్టు జోడు కావాలన్నాను.

''పోన్లేవే! పాతిక రూపాయలు పడేస్తే వస్తాయి!''—పిన్నినీ, అమ్మనీ కసిరేసి నాన్నగారు కొన్నారు. ఇంతకీ పిన్నిని నేనడిగింది ఇంతోటి భాగ్యమేం కాదు—రజని అన్న క్లాస్‌మేట్ కొనుక్కున్న బెల్టుజోడు

అప్పుడప్పుడూ కసురుకున్నా నేనంటే నిజంగా పిన్నికిగారమే.

బాబాయి పిన్నికి చెప్పమన్నమాట ఎవరూ వినకుండా డాబా మీద చెబుతాగా—అందుకని.

—''అభిమానాలంటే మీవేనే. మిమ్మల్ని చూస్తే పినతల్లి పెత్తల్లి పిల్లలనుకోరు. ఒకేతల్లి పిల్లలనుకుంటారు మంచివాళ్ళు ఏ రోజుల్లోనూ ఉన్నారు''

—మామ్మ ఎవరైనా వచ్చినపుడు చెబుతూ ఉంటుంది.

కాని మామ్మంటే అమ్మకెందుకు భయం? సినిమాకు నన్ను తయారుచేసి తనూ ముస్తాబై నాన్నగారు వచ్చిన తరువాత రయ్‌మని పోదామని నేను స్కూటరు చుట్టూ తిరుగుతూ ఉంటే మామ్మ 'రేపు వెళుదువ్‌గానిలేవే' అనేస్తుంది.

ఎందుకో అర్థంకాదు. చెల్లికి పక్కలు వెచ్చగాఉంటే సినిమాకి ఎందుకు వెళ్లకూడదు?

బాబాయి వచ్చాడు బ్యాంకునుంచి. నే పెద్దయితే బాబాయి ఉజ్జోగమే చేస్తా. ఎంచక్కా కొత్తనోట్లు, రూపాయి కాసులూ ఎప్పుడు కావాలంటే అప్పుడు తెచ్చుకోవచ్చు.

నేను సినిమా కెళ్లాల—స్కూటరుమీద బాబాయి నడిగాను ''తీసుకెళ్లవా?'' అని. బాబాయి నన్ను మేడమీదకి తీసుకెళ్లాడు. ''ఒరేయ్ బాబీ, సినిమాకింకా అరగంట టైముంది మనం ఇక్కడ నుంచి జగదంబా కెళ్లడానికి ఎంత టైము పడుతుందిరా?''

''నాలుగున్నర నిమిషాలు.''

''కరెక్ట్! తడుముకోకుండా చెబుతావ్ అందుకే నువ్వంటే నాకిష్టం'' అంటాడు బాబాయి.

''మరేం మరేం...నువ్వు'' బాబాయి జేబులోంచి క్యాడ్‌బరీ చాక్లెట్ తీశాడు.

''ఎంటీ, పిన్నినీ సినిమాకు రమ్మన్నా?''

''ఓరి, పిడుగా! పిన్ని కొట్టదూ?''

''నన్ను కొట్టదులే'' చాక్లెటు లాక్కుని ఇన్ గేట్‌వైపు పరిగెత్తబోయా. అరయితే పిన్ని లైబ్రరీనుంచి వచ్చేస్తుంది. గేటుదాటి ఈపాటికి మా పిఠాపురం బి.సి క్వార్టర్సుడౌన్ దిగుతూ ఉంటుంది. దోవలోనే పిన్నికి బాబాయి ప్రోగ్రాం చెప్పేయాలి

''—బాబీ నా జోడు ఇలా ఇవ్వరా!?''

# పెదతిరుమలాచార్యుని భగవద్గీతానువాదము

1 శ్రీ భగవద్గీత–తొలి తెలుగు భావానువాదం–తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు. ప్రచురణ: వేంకటేశ్వర విశ్వవిద్యాలయం. పరిష్కర్త – ఆచార్య డా. జి. యన్. రెడ్డి. ప్రస్తావన– వైస్ చాన్సలర్ కె. సచ్చిదానందమూర్తి.

2 తాళ్ళపాక అన్నమాచార్యుల జీవిత చరిత్రము. రచయిత : చిన్నన్న. తృతీయ ముద్రణము. వెల 7–25

3 శృంగార సంకీర్తనలు–24,25 సంపుటములు. కర్త: అన్నమాచార్యులు. పరిష్కర్త-శ్రీ గౌరిపెద్దిరామసుబ్బశర్మ. ప్రతి ఒక్కొంటికి రూ 10.

4 అన్నమాచార్యుల సంకీర్తనలు – సంపుటము–2 కూర్పు: శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు శెట్టి. ఎం. ఎ. (2, 3, 5 తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలు)

భారతీయులకు భగవద్గీత పవిత్ర గ్రంధము. అట్టిగ్రంధము తెలుగు వారికి 16 వ శతాబ్దమువరకు తెలుగు భాషలోనికి అనూదితము కాలేదు. భారత మందించిన కవిత్రయము వారు భగవద్గీత జోలికి పోలేదు.

తిరుమల క్షేత్రమున సంకీర్తనాచార్యులై, ఆంధ్ర సాహిత్యమున కవి కుటుంబములలో ప్రముఖులైన తాళ్ళపాకవారికీ గౌరవము దక్కినది.

తాళ్ళపాక అన్నమాచార్యులు పదకవితా పితామహుడు. యోగ, వైరాగ్య, శృంగార మార్గములలో 32000 సంకీర్తనలను వేంకటేశ్వరస్వామిపై చెప్పెను వీరి కుమారుడు పెద తిరుమలాచార్యుడు భగవద్గీతకు భావానువాదము కావించినాడు. పెద తిరుమలాచార్యుని కృతి నిన్న మొన్నటి వరకు అముద్రితము.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపకులపతులు, తాత్త్వికవేత్తలు అయిన ప్రొఫెసర్ కె. సచ్చిదానందమూర్తి "ఆంధ్ర భగవద్గీతా సాహిత్యంలో ఆది గ్రంథమైన దీన్ని సంస్కరించి ప్రకటించమని" కోరినమేరకు వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రాచ్య పరిశోధన సంస్థ దీనిని సూర్యాలోకము కావించినారు ఇట్టి పవిత్ర గ్రంధమును, ముఖ్యముగా తాళ్ళపాక వంశీయులు వ్రాసిన దానిని, అందును దివ్యతిరుపతి క్షేత్రమున ప్రకటించుటకు కారణభూతులయిన ప్రొ. సచ్చిదానందమూర్తిగారిని ఆంధ్రలోకము అభినందింప దగిన విషయము.

సుమారు 43 సంవత్సరముల క్రితము ఈ తిరుమలాచార్యుని ఆంధ్రవేదాంతము లేదా భగవద్గీత అచ్చులో నున్నట్లు దేవస్థానము వారు ప్రచురించిన "అన్నమాచార్యులు వారి సంతతివారి లఘు కృతులు సం. 1." అను గ్రంధమున 11వ పుటలో గలదు. 1938లో 'పరమయోగి విలాసము'ను ప్రచురించిరి. అందును 26వ పుటలో నదేవిధముగా 'నచ్చులో నున్నట్లు' తెల్పిరి. దీనిని బట్టి ఈ భగవద్గీతాంధ్రీకరణ ముద్రణను గూర్చి టి. టి. డి అధికారులకు తెలియుననియు, నది యే కారణముచేతనో వెలుగు చూడలేదనియు తెలియుచున్నది.

## భాషాపరిష్కరణ

ఈ గ్రంధము వ్యావహారిక భాషలో రచితమైనది. తాళపత్ర లేఖనములనుండి ప్రథమముగా ముద్రింపబడినది. ఈసందర్బమున పరిష్కర్త లిట్లు తెలపినారు :

"పెదతిరుమలయ్య భగవద్గీతా వ్యాఖ్య వచన రచన. పైగా వ్యావహారికం. కాబట్టి, ఛందోబద్ధమైన కావ్యప్రబంధాల తాళపత్ర ప్రతులకన్నా ఈ వ్యాఖ్యాప్రతుల్లో లేఖకదోషాలు, పాఠభేదాలు, ప్రమాదాలు, లోపాలు అధికంగా ఉండడానికి ఆస్కారం వుంది. ఉన్నాయి కూడా" (39 పుట)

ఇట్లు తెలిపి, లేఖన దోషములను రెండు పుటలలోనిచ్చినారు ఆపైని లేఖన సంప్రదాయములను యిట్లు సోదాహరణముగా నిరూపించినారు:

1) వలపల గిలక 2) పూర్ణబిందు పూర్వకద్విత్వము 3) పూర్ణబిందు అనునాసిక సంయుక్తత 4) పూర్ణబిందు పూర్వక అద్విరుక్తహల్లు 5) పదమధ్య అజ్లోపము 6) ఏత్వమునకు నిత్వము 7) పదమధ్యములో వ్యస్తముగా అచ్చు.

లేఖన విశేషములు. 1) పదాదియకార వకారాలు 2) ఐ, ఔలకు అయి, అవులు 3) తాలవ్యహల్లు అత్వమున కిత్వము 4) ఋత్వమునకు రు 5) హల్లునకు పరముగానున్న ఋత్వమునకు రి లేదా రు 6) ఏత్వమున కత్వము, దీర్ఘాకారము, యా వత్తు 7) చ వర్ణమునకు శ; సలు 8) శ వర్ణమునకు స. 9) టవర్ణమునకు ష. 10) జ్ఞ కు గ్జ. ఆధునిక భాషాశాస్త్రరీతిని వీనిని వింగడించినారు.

పై లేఖన పద్ధతి ముద్రణ పద్ధతికి భిన్నముగా నున్నదని తెలుపుచు నేటి ముద్రణ పద్ధతి ననుసరించి ఈ గ్రంథముద్రణ మున తాము చేసిన మార్పులను పరిష్కర్తలు ప్రదర్శించినారు. ఇంతకుముందెవ్వరును నింత విశదముగా తాళపత్ర లేఖన సంప్రదాయములు వివరింపలేదు. పరిష్కర్తలైన ఆచార్య జి. యన్. రెడ్డిగారు బహు పరిశ్రమచేసి, యీ ముద్రణము వెలయించిరి. తాళ్ళపాక కవుల ప్రత్యేక సాహితీ విశిష్టతను తొలుత పరిచయము చేసిన వారు పరిష్కర్తలే. తాళపత్ర ప్రతులను తలస్పర్శిగా శోధించి—ఆంధ్రభాషా లేఖన స్వరూపమును విపులముగా వివరించినారు. ఆ భాషా లక్షణములను ఆంధ్ర వ్యాకరణానుసారముగా లక్ష్యములతో గూడ వింగడించినారు. ఇది భాషాశాస్త్రవేత్తలకు పాదేయము. ఇది ఎంతయు ప్రశంసనీయము.

## గ్రంథకర్త పెదతిరుమల్లయ

ఈ గ్రంథమునకు కర్త తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు అని కలదు. కాని వ్రాత ప్రతులలో "తిరుమలాచార్యులు" అను నామము కానరాదు. తిరుమలయ్య, తిరుమలప్ప, తిరుమలయ్యంగారు అనియే కలదు

వ్రాతప్రతులలో పెద తిరుమలాచార్యులు అను నామమే లేనపుడా పేరుతో నీ గ్రంథము వెలయించుట సరికాదు. వ్రాత ప్రతులందలి ప్రతివిషయమును నత్యంత ప్రామాణికముగ దీసికొన్న పరిష్కర్తలీ విషయమును గూర్చి నేమియు చర్చింపకుండుట పరిష్కరణ పద్ధతికి విరుద్ధము గ్రంథకర్త "పెదతిరుమలాచార్యులు" అని తన యితర గ్రంథములలోను చెప్పుకొనలేదు.

ప్రస్తావన (3పుట)లో "ఒక వేదాంతగ్రంథం ప్రథమంగా ఆంధ్రంలోకి పూర్తిగా అవతరించటం కూడా దీనిద్వారానే" అని పెదతిరుమలాచార్యుల భగవద్గీతానువాదమునకు ప్రథమ వేదాంతానువాద గౌరవమును ప్రస్తావన కర్త లిచ్చియున్నారు. కాని "మడికి సింగన జ్ఞానవాశిష్ఠము, ఈశ్వర ఫణిభట్టు పరతత్త్వ రసాయనము, కొలని గణపతిదేవుని శివయోగసార, మనోబోధ, స్వర మంజరులు" అన్నియు పూర్ణవేదాంత గ్రంథములేగదా! పెద తిరుమలాచార్యునికి ముందుగా పుట్టినవే.

## "ఆంధ్రవేదాంతము"

ప్రస్తావనలో (3పుట) నీ విధముగా వ్రాయబడియున్నది :

పెదతిరుమలాచార్యుని భగవద్గీతా ఆంధ్రీకరణం "ఇది 'ఆంధ్ర వేదాంత మని', 'భగవద్గీతాటీక' అని, 'భగవద్గీతా వచన మని' పేర్కొనబడింది" అని ప్రస్తావనకర్త లిట్లు వ్రాసినను పీఠికాకర్తలు (XXXIV) 'ఆంధ్రవేదాంతము' విషయమై కొంత చర్చ జరిపి, తుదకు "వ్యాఖ్యలకు నామకరణంచేసే ఈ సంప్రదాయాన్నిబట్టి పెదతిరుమలయ్య భగవద్గీతా వ్యాఖ్యకు ఆంధ్ర వేదాంతమని—గ్రంథంలో ఈ పేరు లేకున్నా తర్వాత వారు వ్యవహరించారని ఊహించవచ్చు" అన్నారు.

అసలీ విషయమై చర్చ అనవసరముగా పెరిగినది.

1924లో వంగూరి సుబ్బారావుగారు తమ శతకవుల చరిత్రలో "చిన్నన్న తండ్రియగు తిరుమలాచార్యుఁడు కూడ ద్విపదలలో నాంధ్రవేదాంతము ... రచించినట్లు తెలియుచున్నది' అని 1930 టి. టి డి ఇ. రిపోర్టు 284, 300 పుటలలో "ఆంధ్రవేదాంతము ఇన్ ద్విపద మీటర్" అని, 1934లో ప్రాచ్య లిఖిత పుస్తకశాల గ్రంథ వివరణ పట్టికలో ఆర్ 595 నెం గల అష్టమహిషి కల్యాణ వ్రాతప్రతికి చేర్చిన తాళ్ళపాక వారి వంశవృక్షములో (1507 వ పుట) "ద్విపద రూపమున నంధ్ర వేదాంతము" అని, 1945లో వెంకటేశ్వర వచనములకు పీఠిక వ్రాయుచు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "ఆంధ్రవేదాంతము (ద్విపద)" (సింహావలోకనము, పుట 105) అని. 1951 లో ఆంధ్రకవితరంగిణి 8 వ సం. 152 వ పుటలో చాగంటి శేషయ్యగారు "ఆంధ్ర భగవద్గీత... ఆంధ్ర వేదాంతము" అని వేర్వేరుగాను తెలియజేసిరి.

ఆంధ్ర వేదాంతము ద్విపద రూపమునన్నున్న గ్రంథమని పై వ పేర్కొన్న వారందరు స్పష్టముగా తెలియజేయుచుండగా 1949లో వేటూరి ప్రభాకరశాస్త్రిగారే 'అన్నమాచార్య చరిత్ర' పీఠికలో—

"ఉరుయోగ సామ్రాజ్య విభవ
జనకుండు తిరుమలాచార్యవర్యుండు
వేదాంతవిద్యా ప్రవీణుడై యంధ్ర
వేదాంత మొనరించి, ద్విపద రూపమున
హరివంశ కావ్యమాయ తరస మ్మూర్తి
హరివంశ మిగులొత్త నను వొందజేసె" (పుట 89)

అని చిన్నన 'అష్టమహిషీ కల్యాణ' అవతారికా పంక్తులలోని—

'వేదాంత మొనరించె ద్విపద రూపమున' అన్న పాదమును
'వేదాంత మొనరించి, ద్విపద రూపమున
హరివంశ కావ్యమా ........'

అని మార్చుటవలన ప్రస్తుత చర్చకవకాశము కల్గినది. పై ఆర్. నెం. 595 ప్రతిలోను, టి. టి. డి. దేవస్థానమువారు 1936లో ప్రకటించిన అష్టమహిషీ కల్యాణ ముద్రిత ప్రతియందును

"....................... యాంధ్ర
వేదాంత మొనరించె ద్విపద రూపమున"

అనియేయున్నది మరి శ్రీ శాస్త్రులవారట్లు మార్పు చేయుటకు భగవద్గీత వచనము, ఆంధ్ర వేదాంతమని భావించిరో లేదా వారికి హరివంశ ద్విపద కావ్యము లభించినదో ? 'ద్విపదకు ద్విపదకుం దెగఁజెప్పవలయు' ని కదా చిన్నన్న మతము.

పుట 16 17 ఈ రెండు పుటలలో భగవద్గీత పద్య వచనానువాదములు పేర్కొన బడినవి. కాని యీ క్రిందివి అందు లేవు :

గోపినాధ వెంకటకవి–దేవగుప్త సన్యాసిరాజు (పద్యము)

వావిలికొలను సుబ్బారావు (ద్విపద)

గీతభాష్యార్క ప్రకాశిక వచనము కీ. శే. బెల్లంకొండ రామారావుగారి సంస్కృత గ్రంథమునకు తెలుగు వచనానువాదము కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావుగారు దీనిని మూడు సంపుటములుగా ముద్రించిరి (ఇవి మదరాసు విశ్వవిద్యాలయ పుస్తక భాండాగారమున తెలుగు గ్రంథములలో గలవు) నాగేశ్వరరావుగారి భగవద్గీత నేడు ప్రచారములో నున్నది.

ఆధునిక కాలమున వెలువడిన వచన భగవద్గీతాను వాదములలో లోకమాన్య బాలగంగాధర తిలకుగారి 'గీతా రహస్యము' ముఖ్యముగా పేర్కొనదగినది దీనిని కీ. శే. నోరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మహారాష్ట్ర భాషనుండి తెనిగించిరి. వావిళ్లవారు దీనిని ముద్రించిరి. దీని ప్రతులిప్పుడు లభించుటలేదు. పునర్ముద్రణము చేయదగినది.

తెలుగులో భగవద్గీత, పద్య, ద్విపద, వచన, వ్యాఖ్యాన, గేయ రూపములనున్న ముద్రితా ముద్రితానువాదములను గూర్చి పరిశోధన జరుగవలసియున్నది. అప్పుడు తెలుగు వేదాంత గ్రంథములలో దాని వ్యాప్తి తెలియగలదు

పుట 28 ''తాళ్లపాక అరలోని తాళ్లపాక కవుల సాహిత్యాన్ని గురించి మన ప్రాచీన కవులెవరూ ప్రస్తావింపలేదు మొట్టమొదట ప్రస్తావించినవాడు విదేశీయుడైన ఎ డి. కాంబెల్. అతడు క్రీ. శ. 1816 లో వ్రాసిన మాటలు అని ఆతని ఆంగ్ల వాక్యములుదాహరింపబడెను.''

తాళ్లపాక కవుల సాహిత్యాన్ని గురించి మొట్టమొదట ప్రస్తావించినవాడు విదేశీయుడైన కాంబెల్ కాదు. ప్రాచీన తెలుగు కవియైన అప్పకవి - ఈతడు క్రీ. శ. 1656 లో వ్రాసిన అప్పకవీయమున — రెండు పట్టుల తాళ్లపాక పెదతిరుమలయ్యను నితర తాళ్లపాక కవులను పేర్కొన్నాడు.

ద్వితీయాశ్వాసము — రేఫఱకార నిర్ణయము—సీసమాలిక

''తాళ్లపాకాన్వయోదధిపూర్ణధవళదీ
ధితి పెద్ద తిరుమల దేశికుండు'' (2–196)

తృతీయాశ్వాసమున — నామాఖండ యతి లక్ష్యముగా

చిన్నన్న ద్విపద కెఱుగును
పన్నుగ పెదతిరుమలయ్య పదమున కెఱుగున్
మిన్నంది మెఱసె నరసిం
గన్న కవిత్వంబు పద్య గద్య శ్రేణిన్. (3–325)

అని తాళ్లపాక వంశీయులగు చిన్నన్నను, నరసింగన్నను పేర్కొన్నాడు. ఈ నరసింగన్నయే సంకుసాల నృసింహకవి. చిన్నన్న పెదతిరుమలయ్య కుమారుడు. దీనినిబట్టి కీ. శ. 1656 నాటికే తాళ్లపాకవారి అరలో రాగిరేకులపైనున్న రేఫఱకార నిర్ణయము. తాళ్లపాక చిన్నన్న ద్విపదకృతులు సుపరిచితములని స్పష్టముగా చెప్పవచ్చును.

అప్పకవి చిన్నన్న ద్విపద కృతుల నన్నింటిని సావధానముగ పరిశీలించియే, చిన్నన్న ద్విపద కెఱుగును అని ప్రశంసించినాడు ఇంతేకాదు. అతని 'అష్టమహిషీ కల్యాణము'నుండి యీ క్రింది ద్విపదను ఉపాయాన శబ్దమున వ్యంజన యతికి లక్ష్యముగా నీ ద్విపద నుదాహరించినాడు :

''ఇంతుల మేల్బంతి యిడిన సేమంతి
బంతి చేదోయి నుపాయన మొసగి.'' 3–174

అప్పకవి సమకాలికుడగు గణపవరపు వేంకటకవి, తన ''ప్రబంధరాజ - వేంకటేశ్వర విజయ విలాసమున'' చిన్నన్నను పేర్కొన్నాడు.

''ఎన్న తెనుగునకు రాజును
గ్రన్నన యతి రాజునకును రమణ యకునునే
చిన్నను ద్విపద నొనర్పను
చిన్నన్నను బిరుదు గద్య చెప్పిన ఘనుడన్.'' 50 ప.

17వ శతాబ్దిని శత్రు సంహార శతక కర్త

''ఇల తాళ్లపాక చిన్నన్న రోమములైన
తంబురా దండెకు తంత్రులౌనె''

అని చిన్నన్నను నుటంకించినాడు.

'ఆచార్య సూక్తిముక్తావళి'లో సంబూరి కేశవాచార్యులు చిన్నన్నను ప్రశంసించినాడు.

తాళ్ళపాక వారి కృతులతో బ్రౌను దొరకు పరిచయమున్నది. తాళ్ళపాక చిన్నన్న కృతిని ప్రొఫెసర్ విల్సన్‌ద్వారా ఇండియా ఆఫీసు గ్రంథాలయమునుండి కాపీచేయించి, తెప్పించి అందు పాఠాంతరము లెక్కించినాడు. ఆక్స్‌ఫర్డ్‌లోని బోడ్లియన్ గ్రంథాలయమున గూడ దీనికొక ప్రతిగలదట. (చూ. డి. నెం. 1106 పరమయోగి విలాసము ప్రా. వి. పుస్తకశాల పట్టిక మదరాసు) ఆతని లేఖలలో నీ గ్రంథ ప్రసక్తి కలదు.

## తాళపత్ర ప్రతుల్లోని లేఖన విధానం

''అసలు ప్రాచీన తెలుగు శాసనాలను, తాళపత్ర గ్రంథాలను పరిశీలిస్తే తెనుగు లేఖనంలో ఒక నిర్దిష్టమైన పద్ధతి, ప్రామాణికత ఏ యుగంలోనూ ఉన్నట్లులేదు.''

తెలుగులో ఒక నిర్దిష్టమైన లేఖన పద్ధతి ఇప్పటికి పదమూడు వందల యేండ్ల క్రిందటి నుండియు నున్నట్లు శాసనములు సాక్ష్యమిచ్చుచున్నవి. సాహిత్యమునకు సంబంధించిన గ్రంథలేఖనము, భారతాది కావ్య లేఖనము ఇప్పటికి తొమ్మిది శతాబ్దముల నుండి యవిచ్ఛిన్నముగా నడచుచున్నది. నన్నయనాటినుండి చిన్నయ వఱకును నీ లేఖన పద్ధతి మూలముననే తెలుగు సాహిత్య గ్రంథములు ముద్రణ కెక్కినవి. ప్రాచీనాంధ్ర వాఙ్మయమంతయు చెక్కు చెదరకుండ నిలిచి, సురక్షితమై యున్నది. ఆ ప్రాచీన సాహిత్యమంతయు

ఛందోబద్ధమైన పద్య కావ్యములని గణయతి ప్రాసాదఛందోనియ మముల మూలమున, భాషా స్వరూపము యధాతథముగా, నిర్దుష్ట ముగా, నిర్దిష్టమైన పద్ధతిలో నున్నది.

## ఆంధ్ర సాహిత్య పరిషత్తు

క్రీ. శ 1915 తొలిసారిగా తాళ్లపాక కవి కృతులను ముద్రించిన యశస్సు ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారిది. పరిష న్నిర్మాత యగు కీ. శే. జయంతి రామయ్య పంతులు చిత్తూరులో ఉప మండల కర్మగాహి (Deputy Collector) గా నున్నప్పుడు కీ. శ. 1915 లో తిరుపతి క్షేత్రమునకు అధికారరీత్యా వెళ్లి – వేంకటేశ్వరుని దర్శించి, తాళ్లపాకవారి "అర"లో నున్న రాగిరేకుల పైనున్న ఈ క్రింది గ్రంథములను గుర్తించి, వానిని కాగితముల మీద వ్రాయించినారు.

(1) అన్నమయ్య వేంకటేశ్వర శతకము
(2) పెద తిరుమలయ్య రేఫఱకార నిర్ణయము
(3) ,, నీతి సీస పద్య శతకము
(4) ,, సుప్రభాతస్తవము
(5) ,, ఆంధ్ర భగవద్గీత
(6) చిన తిరుమలయ్య సంకీర్తన లక్షణము

పై వానిలో రేఫ ఱకార నిర్ణయము నీతి సీసపద్య శతకము, సంకీర్తన లక్షణము ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో 1915 లో ముద్రితమైనవి. అందులో నీతి సీస పద్య శతకమునకు ప్రత్యేక ప్రతులు గలవు. తక్కినవి ముద్రితములు కాలేదు.

అన్నమయ్య వేంకటేశ్వర శతకమును పరిషత్కార్యాలయము నందున్న ప్రతినిబట్టి ప్రతి వ్రాయించి, వావిళ్లవారు క్రీ శ. 1951లో నా పీఠికతో కూడ ప్రకటించినారు. తిరుపతి దేవ స్థానమువారు దీనిని ముద్రింపలేదు. ఆంధ్ర భగవద్గీత నేడు ముద్రింపబడినది.

## శృంగార సంకీర్తనలు–సంపుటములు 24–25

తాళ్లపాక అన్నమాచార్య విరచితమగు నీ శృంగార సంకీర్త నలు రెండు సంపుటములకు పరిష్కర్తలు గౌరిపెద్ది రామసుబ్బ శర్మగారు వారీ సంపుటములకు పీఠికలేగాక – కొన్ని పదములకు అర్థవివరణము వ్రాసిరి సంకీర్తనల రాగముల అకారాది సూచిక లీయబడినవి 24 వ సంపుటమున 593ను, 25 వ సంపుట మున 587. మొత్తముమీద 1180 సంకీర్తన లున్నవి.

అన్నమాచార్య రచిత శృంగార, ఆధ్యాత్మ సంకీర్తనలు ముప్పది రెండువేల ప్రస్తుతము వీనిలో లభించుచున్నవి 14535

కీర్తనలు. అనగా సగటునకు పైగా సంకీర్తనలు మనకు లభింప లేదు. ఆతడు ఎనుబదేండ్లు ప్రతిదినము రచించిన కీర్తనలు దినమున కొకటి చొప్పున 80 × 365 = 29200 — ఉత్సవ దినముల లోను, పుణ్యతిథులందును హెచ్చుగా వ్రాసియుండవచ్చును అప్పుడవి 32000 అగును.

## అన్నమాచార్యుల సంకీర్తనలు - సం. 2

ఈ గ్రంథము అన్నమాచార్యుని ముప్పదవ వర్ధంతి ఉత్సవ సందర్భమున ఆవిష్కరింపబడినది ఇందు 54 సంకీర్తనలుగలవు. వాని ఆకారాది సూచియు, అందలి కొన్ని పదములకు అర్థవివరణము గలవు. శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారి 'అన్నమాచార్యుని కవిత' అను పునుర్ముద్రణ వ్యాసము గలదు. కూర్పు, శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు శెట్టి. పూర్వ సంకీర్తనల ముద్రణ సంపుటము నుండి ప్రచారము పొందిన సంకీర్తనలు ఇందు కూర్చబడినవి

## అన్నమాచార్యుల జీవిత చరిత్రము

చిన్నన్న కృతమగు నీ ద్విపద కావ్యము తొలుత కీ శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు క్రీ శ 1949లో విపుల పీఠికతో ప్రకటించిరి. క్రీ.శ 1966లో నిది రెండవ ముద్రణ- మందినది నేడు మూడవసారి ప్రకటితమైనది మూల గ్రంథమున 47 పుటలు గలవు. ప్రభాకరశాస్త్రిగారి పీఠిక 137 పుటలు ఈ ప్రశస్త పీఠిక తిరిగి ముద్రితమగుట ముదావహము. తృతీయ ముద్రణ పరిష్కర్త గౌరిపెద్ది రామసుబ్బశర్మ. వారు దీనికి 'వివేక దీపిక' అను పేర పీఠిక వ్రాసినారు అందు ప్రభాకర శాస్త్రిగారి పీఠికలోని సారములు, మూలగ్రంథమున సారములు చర్చింపబడినవి.

ఈ గ్రంథ ప్రథమ ముద్రణము (1949) న 'అన్నమాచార్య చరిత్ర' అని యున్నది ప్రస్తుత ముద్రణమున ' అన్నమాచార్యుల జీవిత చరిత్రము'' అని యున్నది.

శృంగార సంకీర్తనములకు సంపాదకత్వము వహించిన పరిష్కర్తలు అన్నమాచార్యుని భాషా విశేషములను, రాగిరేకుల యందలి వ్రాత తీరును గూర్చి విశేషముగా చర్చించియున్నారు గ్రాంధిక వ్యావహారిక భాషా సమస్య విషయములో సంకీర్తనము లందు మాత్రమే గ్రాంధిక, వ్యావహారిక భాషా సాంకర్యము కలదని తక్కిన గద్య పద్య రచనల యందంతటను గ్రాంధికమునకే పట్టాభిషేకమని పరిష్కర్తల యభిప్రాయమైనట్లు తోచెడిది

పుట 4

''భాసుర భారతార్థముల భంగుల నిక్కమెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లగ జేసినట్టియ
బ్జాసన కల్పులందల తునార్యుల నన్నయ తిక్కనార్యులన్''
(నృసింహ పురాణము 1–9)

మహాభారత కాలమునాటికే ఈ వాదమున్నట్లు పై నుదాహరించిన పద్యమువలన తెలియుచున్నది. నన్నయ ప్రకృతి ప్రత్యయ సంవిధాన యోగ్యమైన తెలుగు పదజాతిని గ్రాంధిక భాషగా నుపయోగించుకొనినాడు ఆ పై దానిని మరింత విస్తారముగా తిక్కన చక్కబరచినాడు. తక్కిన వారందరును వారి అడుగుజాడలలో నడచినారు పదప్రయోగమునందు భారత కవులకున్నంత ప్రామాణిక దృష్టి తక్కిన వారికి లేదేమో ? తరువాతివారు వస్తుతత్వ మెరుగని వాదవైతండికులు

పై పద్యమున ''గాసట బీసట'' యనగా వ్యావహారిక భాషయని యర్థమా? అప్పుడు దానిని ''చదువుట'' ఏమి? ''గాథలు త్రవ్వ'' అనగానేమి?

'గాసట బీసట—' అనునది జంటపదము. 'గాసట' గాథా సప్తశతి తద్భవరూపము 'బీసట' బేతాళ పంచవింశతి తద్భవ రూపము ఈ రెండును, ''గాథాచ్ఛందస్సు''లోనున్న ప్రాకృత కావ్యములు—''గాథల త్రవ్వుట''యనగా గాథాచ్ఛందస్సులోనున్న ప్రాకృత కావ్యములు చదువుటయని యర్థము. (చూడుడు: కీ. శే. వేలూరి శివరామశాస్త్రిగారి నృసింహ పురాణానుబంధము )

గాసట బీసట వ్యావహారిక భాషయైన యెడల దానిని చదువుట ఎట్లు? వ్యావహారిక భాషాకావ్యములున్నగిదా చదువుట. ఆనాడు తెలుగున వ్యావహారిక భాషలో కావ్యములున్నవా?

''గ్రాంధిక వ్యావహారిక భాషలు రెండును దేవదానవులవలె తొలినుండి కుమ్ములాడుకొనుచునే యున్నవి. తెనుగు దేశమున వ్యవహారమున నొకతీరు భాష గ్రంథములయందు మడిగట్టుకొన్న మఱొక భాష వాటి వాటి పనుల సాగించుచునే యున్నవి. అన్ని దేశభాషలోను నిది సహజమే గ్రాంధిక వ్యావహారిక భాషలలో ఒకటి ప్రామాణికము. ఒకటి అప్రమాణికము అనేవాదము పందొమ్మిదవ శతాబ్దమునుండి శ్రీ గిడుగు శ్రీరామమూర్తి పంతులుగారు, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు మొదలగు ఉద్దండ పండితుల వాదబలముతో వేళ్లుదన్ని నేటికిని నిలువులేక క్రొత్త క్రొత్తగ చిగురించుచునే యున్నది ''

అన్ని దేశభాషలందు నిది సహజము. దేశ భాషలలో ఒక్క తెలుగు భాషలోనే ఈ గ్రాంధిక, వ్యావహారిక భాషావాదమున్నది గాని, ఇతర దేశ భాషలగు తమిళ, కన్నడ, మళయాళ, మహారాష్ట్ర భాషలలో లేనే లేదని వారి భాషా చరిత్రలు తెలుపుచున్నవి. దాక్షిణాత్య దేశ భాషయందే కాదు ఉత్తర భారత దేశభాషలు, బంగాళీ భాష, హిందీ భాషలోనూ నీ వాదములేదు చూడుడు:

**History of the Bengali Language – Suniti Kumar Chatterjee – Introduction PP 1–140.**

అసలు పరిష్కర్తలు గ్రాంధిక వ్యావహారిక భాషల ప్రసక్తిని వదలి అన్నమయ్య కవితా కళను గూర్చి విమర్శించి యుండినచో బాగుండెడిది. ఈ వివాద విషయముపై నెంతయేని వ్రాయవచ్చును.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారు, టి టి. దేవస్థానమువారు తాళ్ళపాక కవుల వాఙ్మయోద్ధరణకై కావించుచున్న కృషి సర్వదా ప్రశంసనీయము.

*కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు*

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# 1978 దీపావళి కథల పోటీ

## మొత్తం రు. 5000ల బహుమతులు

**ఈసారికూడా దీపావళికి కథానికల పోటీ పెడుతున్నాము.... పోయినేడాదిలాగే యీ ఏడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఐదు కథలను ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో ఆతరువాతి సంచికలో వేస్తాము. అటు తరువాత పాఠకుల బ్యాలట్ నిర్వహిస్తాము.**

---

## ముగింపు తేదీ 16-9-78 శనివారం

---

పోటీలో ఎన్నికైన ఐదు కథలకు ఒక్కొక్కదానికి రు. **600** లు చొప్పున బహుమతులు యిస్తాము. అటు తరువాత బ్యాలట్‌లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. **600**, రు. **500**, రు. **400** ల వంతున అదనపు బహుమతులు యివ్వడమే గాక మిగిలిన రెండు కథలకు రు. **250** ల చొప్పున కన్సొలేషన్ బహుమతులు అందజేస్తాము.

* "కథానిక" ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాలుగు పేజీలు మించకుండా వుండాలి. 12 అరటావులు దాటకుండా వ్రాస్తే చాలు. నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.
* కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి.
* అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీకథలు పంపకూడదు. ప్రసారమైన, ప్రచురణఅయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు.
* పై అంశాల గురించి హామీపత్రం ప్రతికథతో పాటు విధిగా వుండితీరాలి. కలంపేరు వాడినా అసలుపేరు, యింటిపేరుతో పూర్తిగావిడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతోపాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది.
* కథలతోపాటు రచయితల పేర్లు పడవు. బ్యాలట్ తరువాత వారి పరిచయంతోనే వేస్తాము.
* రచనలపై పేచీలువస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది.
* పోటీలో నెగ్గిన కథల రచయితలు తమఫొటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి ప్రచురణకు అంగీకరించాలి.
* ముగింపు తేదీ దాటినతరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలువెంబడి పరిశీలిస్తాము. పోటీకి పంపిన కథలను ఎటి పరిస్థితులలోను త్రిప్పి పంపలేము.

సం॥

శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

# శుంగ-కాణ్వ-సాతవాహన నాణాలు

'భారతి' జూన్ నెల సంచికలో 'సిముక సాతవాహన నాణాలను' గూర్చి నేనొక వ్యాసము వ్రాసితిని అందు కొన్ని నాణెములు శుంగరాజులవికూడ కాదగునని చెప్పితిని. తర్వాత కరింనగరు పోస్టల్ డిపార్టుమెంటులో పనిచేయుచున్న వెనుక నాణాలను తెచ్చిన శ్రీ నరహరిగారే మరల అదే కోటలింగాల గ్రామం నుండి మరి కొన్ని నాణాలను సేకరించి యిచ్చిరి నేను వారికి సదా కృతజ్ఞుడను నాణాలు ఇంత స్పష్టంగా చరిత్రాధారాన్ని నిరూపించునా అనే విభ్రాంతిని కలిగిస్తున్నవి వాటిలో కొన్ని. అదివరకు పరిచితమైనవి కాకపోవుట వలన వాటిని గుర్తించుట కొంత ఆలస్యమయ్యెను అవి మూడు మాత్రమే ప్రస్తుత వ్యాసమున కుపయుక్తములు. వీటిలో ఒకటి మంచిరాగితో చేసింది. 2, 3 లు సీసముగా నుండు కల్తీ రాగివి అన్ని యించుమించు సమచతురస్రాకారం కలవి. వాటి కొలతలు, బరువులు : (1) 15 × 16 మి మి.; 32 గ్రైనులు; (2) 14 × 13 మి మి ; 35 గ్రైనులు; (3) 17 × 15 మి మి ; 44 గ్రైనులు వీటిలో 2, 3 లు సందేహాస్పదమైనవి కాని మొదటిది మాత్రము అక్షరములు స్పష్టముగ నుండుటచేత కాణ్వులదని నిశ్చయముగ తెలియుచున్నది అవి ప్రాచీన బ్రాహ్మీ లిపిలో 'కంవాయసౌ' లేక 'కంవాయసి' అనిగాని చదువుటకు వీలుగా నున్నవి మిగిలిన చిహ్నములన్ని పాడైపోయినవి రెండవ దానిమీద '[వ] యసి' అని మాత్రమే కలవు అక్షరముల క్రింద చెట్టు, ఎడమ వైపుకి నిలబడ్డ యెద్దు, దానిపైన కుడిప్రక్క చుక్కలతో చుట్టబడిన వలయము, దానిమధ్య నొక చుక్క కలవు రెండవ వైపున కొంత నష్టమైపోయిన 'నంది పాదముల' గుర్తు కలదు మూడవ దానిపైన అక్షరములన్ని పై భాగములందు తెగిపోయినవి అక్షరాల క్రింది భాగాలు మాత్రము క, స, ర అనే వాటి పోలికలు కలిగియున్నవి రెండవ దానిమీదవలె దీనిపైన గూడ తొట్టెలో నున్న చెట్టు. యెడమ వైపుకి తిరిగి నిలబడ్డ యెద్దు దానిపైన చుట్టు చుక్కలున్న వలయము దానిలో చుక్క రెండు మూడు నాణాలు గుర్తులు సమానమేకాని పరిమాణంలో భేదమున్నది. రెండవ వైపున నాలుగు నంది పాదములమధ్య చిన్నవలయమున్నట్లు కనిపించును. మూడు నాణాలకు వెనుక వైపున నంది పాదాల గుర్తులు సమానముగా నున్నవి

వీటిలో మొదటి నాణెం చాలా ముఖ్యమైనది. దీనిపైన 'కంవాయసౌ' లేక 'కంవాయసి' అనే నాలుగక్షరాలు స్పష్టంగా కనుపిస్తున్నవి. తుది అక్షరం 'సి' వలె నున్నది కాని ఇకార గుడి ఉండవలసిన దానికన్న పొడవుగా పైకి వ్రాయబడెను. కనుక దాన్ని 'సౌ' అని చదువవచ్చు ననిపించుచున్నది. మూడవ నాణెంలోని చివరి అక్షరం 'ర' వలె నున్నది కనుక పూర్తి వ్రాత 'కంవాయ సౌర' లేక 'కంవాయ సిరి' కాదగునని చెప్పవచ్చును ఈ రెండు విధముల వ్రాతలకు మనకేదైన విడివిడిగా అర్థములు కుదురునేమో చూడవలెను మొదట 'కంవాయ సౌర' అను పేరును పరిశీలించుదము. 'కంవాయ'అనగా కణ్వాయ అను సంస్కృతమునకు ప్రాకృత రూపము. ఇందు సంశయములేదు. కాకతీయ అనుటకు 'కాకతి' అని మాత్రమే వాడినట్లును, చాళుక్య అనుటకు చల్కి లేక సల్కి అని హ్రస్వముగా వాడినట్లును, క్వాణ్వాయన అనుదానికి ప్రాకృతములో 'కంవాయ' అని హ్రస్వరూపము వాడుట కుదురును. 'సౌర' అనునది రాజుపేరు కావలెను. కాణ్వ వంశములో ఈ పేరుగల రాజు కనుపించుట లేదు. ఆ వంశములోని రాజుల మొత్తము నలుగురు మాత్రమే. వారు వసుదేవుడు 9 యేండ్లు, భూమి మిత్రుడు 14 యేండ్లు, నారాయణుడు 12 యేండ్లు, సుశర్మ 10 యేండ్లు, మొత్తము నలుగురు సామాన్యముగా పురాణము లీ నలుగురినే పేర్కొనుచున్నవి.[1] వారు పాలించినది 45 ఏండ్లు మాత్రమే. వీరిలో 'సౌర' అను రాజులేడు కాని మత్స్య పురాణముయొక్క ఒక వ్రాతప్రతిలో వసుదేవుడికే 'సౌర' అనే పేరున్నట్లు చెప్పబడెను. అచటి శ్లోక మిట్లు కలదు·

అమాత్యో వసు దేవస్తు బాల్యా ద్వ్యసనినం నృపం।
దేవభూమి మథోత్సాద్య శౌంగస్తు భవితా నృపః॥

అనగా (శుంగ రాజుల) మంత్రియగు వసుదేవుడు బాల్యము నుండి వ్యసనపరుడైన దుష్టుడైన దేవభూమియను (శుంగ)రాజును చంపి శౌంగుడు రాజు కాగలడు. ఇచట వసుదేవుడే శౌంగుడని అన్వయించవలసివచ్చును కాని వసుదేవుడు కాణ్వుడు. కనుక 'శౌంగస్తు భవితా నృపః' అను చివరి భాగము అసంగతమని తెలియుచున్నది పోనీ, 'శౌంగంతు భవితా నృపః' అని ద్వితీయాంతముగ జెప్పి దేవ భూమికి విశేషణముగ జేయవచ్చును. కాని 'తు' అను నిర్దేశార్థక అవ్యయము నిరర్థకమగును శ్లోకములో కాణ్వరాజును నిర్దేశించుట ముఖ్యము ఈ పురాణ పరిశోధన చేసిన పర్గిటరు అనేక వ్రాత ప్రతులను పరిశీలించి ఒక మత్స్య పురాణ ప్రతి'లో 'సౌరస్తు భవితా నృపః' అను పాఠాంతరమును సేకరించెను.[2] దీనినిబట్టి వసుదేవునికి 'సౌర' అనే నామాంతరమున్నట్లు విశదమగుచున్నది. జనశ్రుతి యందు ప్రాకృతములోనున్న అనేక గాథలను పురాణకర్తలు సంగ్రహించి, సంస్కృతములో రచించిరను వాదము కలదు. 'సౌర' అను వాడుక పదమును వసుదేవుడని సంస్కృతములో చెప్పి, మరల స్పష్టార్థము ఆ 'సౌర' అనే పేరును కూడ వాడియుండుడు. ఇటి

పునరుక్తులు పురాణములందు తరముగా వచ్చుచుండును. సాతవాహన సిముకుని గూర్చి చెప్పచు—

శిశుకో హ్యాన్ధ్ర జాతీయః ప్రాప్స్యతీమాం వసున్ధరాం।
త్రయోవింశత్సమా రాజా సిముకస్తు భవిష్యతి॥[3]

అని శిశుకుడని, సిముకుడని ఒకేచోట వాడబడెను.

కనుక మన నాణెంమీదనున్న 'కంవాయసార' అను పదము కాంణ్వాయన వసుదేవుని తెలుపగలదు. చివరలో షష్ఠీప్రత్యయాంతము 'స' అను నక్షరముకూడ ఉండియుండును.

ఈవిధంగా పురాణ శ్లోకాన్ని సారాంతరంతో సరిపెట్టినా, అసలు నాణెంమీద 'సా' అనే అక్షరమే సందేహంకదా అనవచ్చును. అంటే అక్షరంపైన ఎడమప్రక్కకు 'ఏ'త్వమును తెలుపుగీత బ్రాహ్మిలో ఉండవలెను నాణెములమీద 'ఏ'త్వరేఖలు లేకుండుట కూడ కలదు. 'ధనదేవస' అనుటకు 'ధనడవస' అని మాత్రమే కొన్ని అయోధ్యనాణాలమీద కలదు.[4] 'సాతవాహన' అనుటకు 'సతవహన' అనుటకూడ ఇట్టి దీర్ఘాది లోపాలకు ఉదాహరణ. అయినను వేరొక పక్షములో దానిని 'సి' అనియే గ్రహించుదము.

అపుడు 'కంవాయసిరి' అని నాణెముమీది వ్రాతయగును చివరి భాగము కత్తిరించబడెను గనుక మరేదైన రాజు పేరుగల అక్షరములు నష్టమై యుండవచ్చును అట్లుగాక ఇంతమాత్రమే పూర్తి వ్రాతయన్నను 'కంవాయసిరి' అనగా 'కాణ్వాయన రాజ్యలక్ష్మి' అని అర్థము చెప్పవలెను. 'అర్జునాయనానాంజయః' అని అర్జునాయనుల నాణెములు కొన్నిగలవు.[5] అంటే అర్జునాయన వంశపు రాజుల విజయము అని ఆ నాణెములమీది వ్రాత తెలుపును. అట్లే 'కంవాయసిరి' అనే వ్రాతకూడ 'కాంణ్వుల రాజ్యలక్ష్మి' అని తెలుపును ఈ పేర్చుతో నిమిత్తము లేకుండగనే 'కంవాయ' పదమే యీ నాణెము కాణ్వరాజుదని అతి స్పష్టముగ తెలుపుచున్నది ఈ నాణెములో ఈ విషయమును ధ్రువపరచు మరొక గొప్ప నిదర్శనము కలదు.

ఇది పునర్ముద్రిత నాణెము. అంటే పూర్వమొకరాజు ముద్రించిన నాణెంమీద కాణ్వరాజొకడు మరల తన ముద్రను వేసుకొనెను పూర్వకాలములో జయించిన రాజులు ఓడిపోయినవారి నాణెములను కొన్నిటిని, కనీసము టంకసాలలో దొరికిన వాటినైన తమ విజయసూచకముగ తమ పేర్లతో తిరిగి ముద్రించుట ఆచారము. గౌతమీపుత్ర శాతకర్ణి నహపానుడనే శకరాజుయొక్క నాసిక ప్రాంత రాష్ట్రమును జయించి ఆ టంకసాలలోగల కొన్ని వేల నహపానుడి నాణాలను తిరిగి తన (గౌతమీపుత్ర) బొమ్మతో కూడ విజయసూచకంగా పునర్ముద్రించెను. అట్టివి అనేకము లభ్యమయ్యెను. అట్లే యీ పువర్ముద్రితనాణెం కాణ్వరాజుయొక్క జయమును, పూర్వపు రాజుయొక్క పరాజయమును తెలుపుచున్నది. కాణ్వులకు పూర్వము శుంగులు రాజ్యమేలినట్లు పురాణములనుబట్టి చరిత్రకారులు ఏకగ్రీవముగ స్వీకరించిరి. ముదట చెప్పిన శ్లోకమును చూడవలెను. శుంగులలో పదవరాజగు దేవభూమి లేక భాగవతుడను వానిని వ్యసనశీలుడగుటవలన రాజ్యానికి అనర్హుడని భావించి, వాని మంత్రియగు కాణ్వవసుదేవుడు చంపించెనని పురాణములు చెప్పను. ఒక వారస్త్రీచేత చంపించియుండునని తలంచెదరు. శుంగరాజుల గుర్తులు కొన్ని యీ నాణెముపై అణగారిపోయి గుర్తించుటకు వీలగుచున్నవి. వాటిలో బాణము సంధించిన విల్లు, తలక్రిందైన సశీర్షక త్రికోణచిహ్నము (triangle-headed standard) మొదటివైపున, నాలుగు నందిపాదములమధ్య వలయం వుండే గుర్తు వేరే రేఖలతో కలిసిపోయి రెండోవైపున కానవచ్చును. లోగడ ఇదే కోటలింగాలలో దొరకిన నాణాలలో కొన్ని యివే గుర్తులతో 'రణోసమగోపస' (ఈ నాణెం సమగోపుడనే రాజుధి) అని వ్రాయబడినవి కలవు. ఈ సమగోపుడు శుంగులలో తొమ్మిదో రాజైన 'సమాభాగుడు' కావచ్చునని వెనుక జూన్ నెల 'భారతి'లో ఊహించి వ్రాసితిని. అవే గుర్తులున్న నాణెం కాణ్వరాజుచేత పునర్ముద్రితమైనది నాకు లభ్యమైంది కనుక, ఆ సమగోపరాజు శుంగరాజేనని నిశ్చయమగుచున్నది. కడపటి పదవ శుంగరాజునేకదా కాణ్వరాజు చంపించినది. కనుక తొమ్మిదవ శుంగరాజైన సమగోపుడి నాణాలు వాడుకలో నుండుట అసంభవముకాదు. లేదా తండ్రి వాడిన గుర్తులనే దేవభూమికూడ తన నాణాలపై వాడియుండును టంకసాల్లోనైనా కొన్ని అట్టి నాణాలు లభించగా వాటిని మొదటి కాణ్వరాజు పునర్ముద్రించుట సంభవమేకాగలదు. ఆ కాణ్వరాజు మొదటివాడగు వసుదేవుడు అతనికి 'సార' అనే నామాంతరమున్నట్లు ఒక 'పురాణ వ్రాతప్రతి'లో మన్నది అది అంగీకార్యముగానిచో 'కంవాయసిరి' అనే వ్రాతనే గ్రహించి, కాణ్వుల రాజ్యలక్ష్మి అని నూతన వంశస్థాపనను సూచించుటకై పునర్ముద్రణము చేయబడెననవచ్చును. లేదా 'సిరి' తర్వాత రాజు పేరుగల కొన్ని అక్షరములు నాణెము చివరి అంచుభాగములో తెగిపోయి యుండును. మొత్తముమీద ఆ రాజుమటుకు కాణ్వరాజు. అతడు శుంగుల అధికారమును కూలద్రోసిన వసుదేవుడే యగునని నిశ్చయముగ జెప్పవచ్చును ఈవిధంగా పురాణములందున్న చరిత్రాంశమునీ పునర్ముద్రితనాణెం ధ్రువపరచుచున్నది.

ఈ సందర్భమున ఒకటి రెండు సంశయములు కలుగవచ్చును నాణెములపైన రాజులపేర్లతో తల్లిపేరు లేక గోత్రం పేరు ఉండుట ఆ కాలంలో కానవస్తుంది. గౌతమీపుత్ర శాతకర్ణి, వాసిష్ఠీపుత్ర పుళుమావి, మాఢరీపుత్ర ఇత్యాదులు. కాని వంశం పేరు నాణాలపై వాడట అరుదు అట్లని పూర్తిగా లేవనజాలము. 'చిముక సాతవాహన' అని సాతవాహనకులము నాణెముపై పేర్కొనబడెను. 'చుటుకులానన్ద' మరియొక ఉదాహరణ. వేంగి చాళుక్యులు క్రీ. శ. 973 తర్వాత 30 యేండ్లు రాజ్యము కోల్పోయిరి. క్రీ 1001 లో విమలాదిత్యుడు తిరిగి వేంగి సింహాసనమెక్కి 'చాళుక్యచంద్ర' అను వంశ పునస్థాపన సూచకమగు బిరుదముతో నాణెములను ముద్రించెను. ప్రస్తుతం శుంగవంశమును తొలగించి కాణ్వవంశ స్థాపన సూచకముగ నాణెములపైన 'కంవాయ' అను వంశనామాన్ని వాడుటలో తప్పలేదు. దీనికొక నిర్దిష్టమగు విధానములేదు. తర్వాత వచ్చిన కాణ్వరాజులు వంశనామముతో నాణాలను ముద్రించిరో లేదో వారి నాణెములు దొరకినపుడుగాని

తెలియదు. అట్లే యీ 'కంవాయసి' అనే వ్రాతకు ముందు వెనుకల నేమైన కొన్ని అక్షరములు లోపించవచ్చునుగదా; అప్పుడేదైనా వేరే అర్థము నీయవచ్చునుగదా అనదగదు. ఇప్పుడున్నంత మేరకు స్పష్టమైన సమన్వయము కుదురుచుండగా; అది పురాణోక్త వర్తితాంశమున కనువాదకముగానుండగా ఇప్పటికీ వివరణము సుసంగతము, ఆధారసహితము కాగలదు.

మరొక గడ్డు ప్రశ్న కలదు. శుంగులు, కాణ్వులు ఆంధ్రదేశంలో అధికారం నలిపిరనుటకు ఆధారాంతరములు లేవు కనుక ఆంధ్రదేశంలో వారి నాణాలు దొరకటం సులభముగా సమ్మతగ్గది కాదు. ఈ నాణాలు వేరే చిన్నచిన్న మాండలీకులవి కావచ్చునుకదా? నిజమే. ఇచట ఆధారాంతరం అందరు అంగీకరించిన పురాణాల కధనమే. శుంగులను తొలగించి కాణ్వులు, కాణ్వులను తొలగించి సాతవాహనులు రాజ్యాధికారాన్ని పొందినట్లు పురాణాలు చెప్పచున్నవి. సాతవాహనులు ఆంధ్రదేశంలో కాణ్వులక్రింద సామంతులుగనో, సేనాధిపతులుగనో ఉన్నట్లు—

'కాణ్వాయనాంస్తతో భృత్యః సుశర్మాణం ప్రసహ్యతం
శుంగానాంచైవ యచ్ఛేషం క్షపిత్వాతు బలీయసః
శిశుకోన్ధ్ర జాతీయః ప్రాప్స్యతీమాం వసుంధరామ్'

అనే శ్లోకాలు తెలుపుచున్నవి కనుక కాణ్వులక్రింద సామంతులుగ నున్నంతమటుకు సాతవాహనులు కాణ్వుల నాణాల నుపయోగించుచుండియుందురు. తమిళనాడులో డి యమ్. కె ప్రభుత్వం ఉన్నంతమాత్రాన అచట భారత జనతాప్రభుత్వ పక్షాన జారీయైన నాణాలు, తపాలాబిళ్లలు మున్నగునవి అసంభవమనగలమా. కాణ్వరాజు మగధనుండి వచ్చి కోటలింగాలలో శుంగనాణాలను పునర్ముద్రించ నక్కరలేదు. టంకసాలలో ఆ రాజకీయ మార్పును సూచించుటకు కొన్ని వెనుకటి నాణాలను పునర్ముద్రించుమని ఆదేశిస్తారు. మన కోటలింగాల అట్టి టంకసాల స్థానమై యుండును లేకపోతే యిన్ని నాణాలు ముఖ్యమైన రాజులవి యిట్లా దొరుకుట సంభవించదు. రాగినాణాలు తక్కువ విలువ గాగి యుండును గనుక సాధారణంగా యితర రాజ్యాలనుండి యిక్కడికి వ్యాపారాదులవల్ల వచ్చియుండుననుట సమంజసము కాదు. కాంగ్రెసు ప్రభుత్వం పోయి జనతాప్రభుత్వం వచ్చిన తర్వాత మన రాష్ట్రాలలో ఎట్టి సందిగ్ధ ప్రభుత్వాలు వచ్చినవో మనకు బాగా తెలుసు. అట్లాగే మౌర్యుల తర్వాత క్రీ. పూర్వం 190 ప్రాంతంనుండి 80 వరకు శుంగులు పాలించిరి. వారిని తొలగించి కాణ్వులు ఆక్రమించిరి. ఈ మార్పు సామంతులకొక చిక్కు సమస్య అయింది. శుంగుల ననుసరించవలెనా ? లేక క్రొత్తగా అధికారం చేబట్టిన కాణ్వుల ననుసరించవలెనా అని. లోపల విశ్వాసాలు యెట్లున్నను పైకిమాత్రం మగధ సింహాసనంమీదనున్న రాజుయొక్క చెప్పచేతల్లో ఉన్నట్లు నటించారు. ఆ సమయంలో జరిగిన పునర్ముద్రణ వ్యవహారమిది కావచ్చును.

ఇంతవరకు శుంగ — కాణ్వ నాణాలనుగూర్చి కలగలిపి చెప్పకొన్నాను ఇంక ఒక విలక్షణమైన సాతవాహన నాణెమును గూర్చి పరిశీలిద్దాము ఇది రాగి మిశ్రమైన పొటిన్ అనబడే మిశ్రలోహంది చలుదరము; 17 x 17 మి, బరువు 41.9 గ్రైనులు; ముద్రతో అచ్చువేయబడెను

మొదటివైపున —

సశీర్షక త్రికోణాకార పతాక; ఉజ్జయిని గుర్తు, దానిపైన అర్ధచంద్రరేఖ; స్వస్తికము (సగభాగము నష్టమయ్యెను), యెడమవైపునకు నిలచున్న యెద్దును సూచించు తల, కొమ్ములు మాత్రము కొద్దిగ కనుపించుచున్నవి; దానిముందు (తొట్టిలోనున్న) చెట్టు (సగభాగమే). పేరు — [సి] రి సాతవాహన[స]

రెండవవైపున - ద్విరేఖాత్మక వలయముచుట్టు నంది పాదములు రెండు మాత్రమే కనుపించుచున్నవి. ఇవికూడ రెండు రేఖలతో నున్నవి.

దీని బరువు, ఆకారము శుంగుల, కాణ్వుల, నాణాలకు సమీపములో నున్నవి సశీర్షక త్రికోణపతాక శుంగరాజైన సమగోపుడి నాణాలమీద వాడబడిందే స్వస్తిక, చెట్టు, యెడమవైపుకి తిరిగిన యెద్దు కూడా వారి నాణాలపైనున్నవే. చెట్టు, యెద్దు కాణ్వుల నాణెములపైన కూడా కలవు. కాణ్వుల నాణెంపైనున్న చుట్టు చుక్కలున్న వలయం గనవాలు వున్నట్లు తోస్తుంది. వెనుకవైపున నందిపాదముల గుర్తులు పూర్తిగా శుంగులు కాణ్వులు వాడిన విధముగనే యున్నవి స్వల్పభేదములు కలవు.

ఈ పోలికలనుబట్టి సాతవాహనుడు పైవారి చిహ్నములను అనుకరించెనని స్పష్టము. ఉజ్జయిని గుర్తుమటుకు క్రొత్తది. ఏనుగులేదు. పేరులో 'రణో' అను స్వాతంత్ర్యమును సూచించు విశేషణము లేదు. కనుక ఈ సాతవాహనుడు శుంగులకుగాని, కాణ్వులకుగాని సామంతుడుగ రాణెమును ముద్రించియుండునని యూహించుటకు వీలగుచున్నది. అక్షరముల పోలికలు కూడ దీనిలోనివి కాణ్వనాణెముపై నున్నవాటిని పోలియున్నవి. మరియొక విశేషము దీనిపైనున్న పేరులోని అక్షరములన్ని పైకి కుదించి యున్నట్లు కనబడుచున్నవి. అందువలన క్రిందనున్న గుర్తులు (చెట్టు, ఎద్దుతల) తర్వాత వేరొక సందర్భమున ముద్రించబడెనా యను అనుమానము కలుగవచ్చును అట్టిది జరిగియున్నచో అది సాతవాహనుని స్వాతంత్ర్య ప్రకటనమును తెలుపగలదు.

1 శుంగరాజైన సమగోపుని నాణెము

మొదటివైపున—సశీర్షక త్రికోణ పతాక, స్వస్తిక, బాణము సంధించిన విల్లు కలవు.

రెండవవైపున — రెండు రేఖలతోనున్న నందిపాదములతో చుట్టబడిన ద్వివలయము.

2 కాణ్వనాణెము : 'కంవాయసా లేక కంవాయసి'

మొ. వైపు అణగిపోయిన సశీర్షక త్రికోణ పతాక, బాణము సంధించిన విల్లు కలవు మరి కొన్ని గుర్తులు స్పష్టముగలేవు.

రెం. వైపు. కలసిపోయిన ద్విరేఖాత్మక నందిపాద

ముద్రలు.
నాణెము పునర్ముద్రితము

3 సిరి సాతవాహనుడిది.

**మొ. వైపు :** సశీర్షక త్రికోణ పతాక, చంద్రవంకగల ఉజ్జయిని గుర్తు. స్వస్తిక (సగము మాత్రమున్నది)
చెట్టు (**మూడు** ఆకులుమాత్రమున్నవి)
ఎద్దుతల (పైభాగం మాత్రం కలదు).

**రెం. వైపు :** ద్విరేఖాత్మక నందిపాదములతో చుట్టబడిన ద్వివలయము.

ఈ మూడు నాణెములలో**ను** రెండవవైపున గల నందిపాదముల గుర్తులు సమము. మొదటివైపున కూడ సశీర్షక త్రికోణ పతాక, అంటిలోను కలదు. విల్లు—బాణము 1,2 లోను, స్వస్తిక 1, 3 లలోను. చెట్టు, ఎద్దు వేరే నాణెములలో ముగ్గురు రాజుల వాటిలోను కలవు.

వీటిని చూడగనే వాటి సామ్యములు గోచరించును.

సాతవాహనుడి నాణాలు ఇదివరకు కొన్ని దొరకెను[6] వాటిపైన 'రఞో సిరిసదవహ' అని యుండుటచేత ఈ సాతవాహనుడు ముందు స్వాతంత్ర్యమును ప్రకటించి **యుం**డుననిచెప్పవీలగుచున్నది ఈ యంశమింకను పరిశీలించవలెను 'రఞో సాతకణిస' అను పేరున్న సాతకర్ణి రాజుయొక్క నాణెమొకటి ప్రాచీన, పంచి మార్కు నాణెం వంటిదికూడ కలదు.




ఇంతవరకు దొరకిన నాణెములనుబట్టి యీ క్రింది నిర్ణయములు చేయవచ్చును :

1. **మౌ**ర్యుల అనంతరము శుంగులు కూడ ఆంధ్రదేశమున ఆధిపత్య**ము**ను నెరపుచుండిరి.

2. వారికి లోబడి సాతవాహనులు సామంతులుగ ఆంధ్రదేశమును పాలించియుందురు.

3 కాణ్వులు శుంగులను తొలగించిన సందర్భమున కొన్ని శుంగ నాణెములను కాణ్వరాజు పునర్ముద్రించెను. అట్టి నాణెములు స్వల్పముగ టంకసాలలుండు తావులందే దొరకుచుండును. కనుక కోటలింగాల శుంగులనాటినుండి సాతవాహనుల కాలంలో కొంత వరకైనా టంకసాలమై యుండును. **పూ**ర్వసాతవాహనులవేగాని అర్వాచీన సాతవాహనుల నాణాలిక్కడ ఇంతవరకు దొరకలేదు. ఇచట దొరకిన నాణాలన్నీ నలుచదరపువి. ఎద్దుగాని, ఏనుగుకాని యెడమ వైపునకే నిలబడియున్నట్లు కలదు బరువులు కూడ 76 గ్రైనులు మించుటలేదు అంటే సుమారు పాతిక కార్షాపణములు, అర్ధ కార్షాపణముల విలువగల రాగినాణెములు, పాటీను నాణెములు ఈ టంకసాలలో ముద్రించబడెడివి. గుండ్రటి నాణెములుగాని, బరువైన కార్షాపణములుగాని **యి**చట ఇంతవరకు లభించలేదు (సుమారు 160 నాణాలు దొరకినవి). అర్వాచీన సాతవాహనులీ టంకసాలను వాడినట్లు తోచదు.

4 కాణ్వుల కాలంలో సాతవాహనుడు, బహుశ ఒక సాతకర్ణి కూడా వారికి సామంతులుగ నుండక ధిక్కరించియుందురు ఒక ప్రాచీన సాతకర్ణి నాణెము కూడ వీటిలో కలదంటిమి. అది యితర సాతకర్ణి నాణెములకంటె విలక్షణంగా పంచ్ మార్కు నాణెమును పోలియుండును. కనుక పురాణాల్లో చెప్పబడని సాతకర్ణి యొకడు—సిముకుడికి **పూ**ర్వమున్నట్లు నమ్మటకు వీలగుచున్నది. వీరు పేరుకు మాత్రము మగధ రాజులకు సామంతులుగ నుండి యుందురు కాణ్వులు సింహాసనంపైన స్థిరపడకపోవటయే దీనికి కారణము. రాజవంశములు మారినపుడు సామంతులైనసాతవాహనులు తమ విశ్వాసమును శుంగులకుగాని, కాణ్వులకుగాని స్పష్టపరచక యుండి యుందురు. అట్టి వారిలో సిరి సాతవాహనుడు, సాతకర్ణి యిప్పటికి తెలియుచుండిరి. చాళుక్య మూడవ తైలపుడు బలహీనుడై కలచురి బిజ్జలునిచేత తొలగింపబడినపుడు కాకతి ప్రోలుడు, రుద్రుడు క్రీ. 1150 నుండి 1162 వరకు తటస్థముగనుండిరి. అట్లే యీ సాతవాహనులుకూడ మొదట కాణ్వుల కాలంలో తటస్థముగ నుండి తర్వాత కాణ్వాధికారమును ధిక్కరించియుందురు. విదిశలో కొందరు శుంగులు కూడ స్వతంత్రులైయుందురు. ఈ విధముగ వింధ్య ప్రాంతములోను, దక్షిణాపథము**లో**ను కాణ్వాధికారము సన్నగిలెను. నాలుగవ కాణ్వరాజగు సుశర్మ వీరి తిరుగుబాట్లను అణచుటకు వింధ్యనుదాటి దక్షిణాపథముపై దండెత్తి వచ్చి యుండును. సిముక సాతవాహనుడీ యదనుచూచి సుశర్మను

చంపి, శుంగ బలమును **కూడ** తరిమివేసి యుండును. ఇంతకన్న మరియొకటి సంభవమని తోచును. సాతవాహనులు అప్పటికే గొప్ప బలమును కలిగియుండిరి. అనేక కోటలు కూడ వారి కుండెను. దీనికితోడు శుంగ బలమును కాని, కాణ్వబలమును కాని తమ పలుకు బడిలో నుంచుకొని యుందురు. కాకతిప్రోలుడు కళ్యాణి చాళుక్య రాజగు జగదేకమల్లుడి (క్రీ. శ. 1138–1150) సైన్యము **తోనే** తన పొరుగున తిరుగుబాటు చేసిన పొలవాస రాజులను, కందూరు చోడులను ఓడించి తెలంగాణములో తన ప్రాబల్యమును స్థాపించుకొనెను. **అట్లే** సాతవాహనులు కూడ శుంగ సైన్యమునో **లేక కాణ్వ** సైన్యమునో నమ్మికతో నడిపించుచు తుదకిద్దరిని ఓడించి, తరిమివేసియుందురు. అందుకనే పురాణములో సిముకుడు కాణ్వ భృత్యుడై సుశర్మను చంపి, మిగిలిన శుంగ బలము నోడించి, రాజ్యము పొందెనని చెప్పబడెను. మగధ సింహాసనాన్ని సిముకుడు ఆక్రమించినట్లు తెలుపు ఆధారములు లభించలేదు. వింధ్య దక్షిణముననే అశ్మక, ఆంధ్ర, విదర్భ దేశములలో సిముకుడు స్వతంత్ర రాజ్యము స్థాపించియుండును. ఈ విషయము లన్ని, మరికొన్ని నిదర్శనములు కోటలింగాలలో లభించినపుడు గాని నిశ్చయముగ చెప్పలేము.

5. ఇంతవరకు లభించిన నాణెములనుబట్టి శుంగుల అధికారమును కాణ్వులు. కాణ్వుల అధికారమును సాతవాహనులు త్రోసిపుచ్చిరని వాటిపైనున్న గుర్తులను, పునర్ముద్రణమును, పేర్లనుబట్టి చెప్పవచ్చును. పురాణములందున్న కధనమునకు ఈ నాణెములు ప్రత్యక్ష సాక్ష్యము నొసగుచున్నవి. 2 వ నాణెం లోని 'కంవాయ' అనునది పునర్ముద్రిత నాణెముపైనుండుట ప్రబలసాక్ష్యము కాగలదు.

6. ఇదివరకెపుడు లభించని కాణ్వనాణెములు దొరుకుట ఇదియే మొదలు. ఈ వంశమునకు చెందిన పురావస్తు నిదర్శనము ఇదియే మొదటిది.

7. శుంగానాణెములు కూడ వీటివలన ధ్రువపడుచున్నవి.

8. సిముకుడికిముందు శుంగులకు, కాణ్వులకు పురాణములలో చెప్పబడిన కాలము సుమారు (112 + 45) 157 సంవత్సరములు **మౌర్యుల** అనంతరం చెప్పవలసియుండును కనుక స్వతంత్ర సాతవాహన రాజ్యస్థాపనము క్రీ. **పూ.** 40 తర్వాత జరిగియుండుననువారి వాదము నంగీకరించుటలో తప్పులేదు.

## అధోజ్ఞాపికలు

1 మత్స్య పురాణము. అధ్యా. 272, శ్లో. 32–37.
వాయు అధ్యా 99, శ్లో 343 47
విష్ణు చుర్థాంశము, అధ్యా. 24, శ్లో 38 42
భాగవతము. స్కంధ, 12, అధ్యా. 1, శ్లో. 19–21.
బ్రహ్మాండ. III. 94 శ్లో 156–60.

2. **Pargiter, The Dynasties of the Kali Age** పుట. 33

3. ,, ,, ,, పుట. 38

4. **Allan, catalogue of the coins of Ancient India P. 133**

5. ,, ,, ,, **P. 121, 2**

6. **JNSI. XXII P. 139.**

# కవిత

## శ్రీ జంధ్యాల బాలగంగాధర తిలక్

సర్వాభరణ సంభూషితయై
పట్టు పీతాంబరాలలో
ఏకాదశమ శతాబ్దంలో
కస్తూరీ కర్పూరాలతో
పరవశిస్తూ ప్రవేశించింది
కవితాబాల ... !

ఇరవయ్యవ శతాబ్దంలో
నగలన్ని దిగి విడచి
ఖద్దరు బట్టలలో
కదం త్రొక్కుతూ వచ్చింది
కవితా కల్యాణి
మంచి గంధంలా పరిమళించే
మానవత్వమనే ఒకే ఒక్క అలంకారంతో!

కేవలం ఆహార్యం చూచి
గుర్తుపట్టగలిగే వారు
నేడు మొండిగా వాదిస్తున్నారు
ఈమె పేరు 'కవిత' కాదని !

# కలగూరగంప

## స్వేచ్ఛ (ఒక పరిశీలన)

నేరమే అధికారమై
ప్రజల్ని నేరస్తుల్ని చేసి వేటాడుతుంటే
ఊరక కూర్చున్న
నోరున్న ప్రతివాడూ నేరస్తుడే. (మేధావి)

ఈ దేశంలో ప్రజల్ని దెబ్బతీయడం నేర్చినవాడు శాంతి బట్టలేసుకుంటున్నాగ. ప్రజల్ని మోసపుచ్చి, మాయజేసి, నోట్లు పంచి, ఓట్లు సంపాదించి గద్దె నెక్కినవాడు జపించేది గాంధీ నామం. అలాంటి మహామహులే కదా నేడు దేశపాలకులు. ఇక నేరమే అధికారము గాక ఏమవుతుంది. అవును నేరమే అధికారమై తమ తమ కనీసపు హక్కుల్ని కోరిన ప్రతివాన్నీ నేరస్తుల్ని చేసి వేటాడుతుంది. లేకుంటే ప్రత్యేక పోరాటాన్ని సాగించి మూడు వందల మందిని పొట్టన పెట్టుకున్న వ్యక్తి ముఖ్యమంత్రి అయేవాడా? నక్సలైట్ల పేరుతో నవయువకుల్ని అరెస్టు చేసి, చిత్రహింసలకు గురిచేసి ఆఖరుకు చెట్లకు కట్టించిపిన పోలీసు గుండాలకు వత్తాసు పలికేవాడా? రహస్య విచారణంటూ భార్గవ కమీషన్ రద్దవడానికి మూలకారకుడయేవాడా? కాటికి కాలుజాపుక కూర్చోవడం నేర్పెడి కర్మసిద్ధాంతం మూడు పూలు ఆరుకాయలుగా వెలుగొందుతున్న దేశంలో ఎదురు తిరగడము చేతనవుతుందా? అయి తీరుతుంది! గడ్డితినే నెదడ్లు ఎల్లకాలము ఉంటాయనుకోవడం బుద్ధితక్కువ. నేరాన్ని నేరమని నోరున్న ప్రతివాడూ బల్లగుద్ది చాటిచెప్పి, నేరస్తునికి శిక్ష వేయ గల్గిననాడు విప్లవం వెలుగొందక ఏమవుతుంది? అంటే జనంలోంచి జడత్వం దూరం కావాలి జనం సంకెళ్ళు తెంచుకొని స్వేచ్ఛను అనుభవించగల్గాలి.

మానవతా దృక్పథంతో ఆలోచించే ప్రతి ఆలోచనాపరుడూ కోరుకునేది విప్లవం. ఎన్ని ఆలోచనలు, సుడులు తిరుగుతున్నా విప్లవానికొక రూపాన్ని సృజించలేక సతమతమౌతున్నారు ఈనాడు చాలామంది ఎన్నినోళ్ళలో గింగిర్లెత్తుతున్నా ఈ పదానికి సరియైన ప్రతిరూపం సృష్టించలేకపోతున్నది కలం. అందుకే విప్లవ సృజనకు సంధాలు కోకొల్లలుగా చెప్పబడుతున్నాయి నేడు. వంచనా శిల్పానికి ఆలవాలమైన ఈ దేశంలో ప్రతి నాయకవర్యుడూ విప్లవం పేరుతో ప్రజల్ని దగావేస్తూనేయున్నాడు. అభ్యుదయగానులమని చాటుకునే రచయితలుసైతం నేడు ప్రభుత్వ పాలకుల గానాబజానా చేసి, పదవులు సంపాదించుకుంటున్నారు విప్లవంపేరెత్తితేనే గంగవెర్రులెత్తే రచయితలు అవార్డులు కొట్టుకుంటున్నారు దుశ్శాలువల్ని కప్పుకుంటున్నారు విప్లవానికి వెన్నుపోటు పొడుస్తున్నారు. శివసాగర్ గారన్నట్లు 'మరోరకం కవుల ఆకలి మంటలవాళ్ళపక్షం వహిస్తారు వారి పోరాటాల కీర్తిస్తారు ఈ దోపిడీ సమాజం పులి స్వభావాన్ని చూపించి దాన్ని కూలదోసేమార్గం నిర్దేశిస్తారు. ఇలాంటి వారికోసమే నిర్బంధాలు, కుట్రకేసులు, జైళ్ళు, సంకెళ్ళు'' వీళ్ళు విప్లవ కవులు. దోపిడీ పాలకులకు వెరవని వరవరరావు విప్లవయాత్రా పథగామి అలాంటి వారికి—

''నిర్బంధాలు నిగ్గుదేల్చే నిప్పుకొలుములు
అధ్యయన శిబిరాలు ఆలోచనా మజిలీలు
అపజయాలు వర్గచైతన్యానికి పదునుపెట్టే ఎదురుదెబ్బలు''
(నూతన మానవులు)

కాక ఇంకేమవుతాయి.

మార్క్సిస్టులోనూ రెండు రకాలున్నారు వర్గపోరాటమే విప్లవానికి సరియగు మార్గమని అది జనంలోంచి రావాలని కొందరి వాదన చారుముజుందార్ వర్గీయులు మరోరకానికి చెందిన దృక్పదం కలవారు దోపిడీగాండ్రను వ్యక్తిగతంగా అంతమొందించడమే వీరి ధ్యేయం దీనినే మనం నక్సలిజం అంటున్నాము వరవరరావు ఈ రెంటినీ ఒంటబట్టించుకున్న కవి అందుకే

మానవ నరాల్లో నక్సల్బరీ శ్రీకాకుళాలు ప్రవహిస్తున్నాయ్
మార్క్సిజమ్ మా వెన్నెముక
(నెత్తుటి చైతన్యంలో ఉదయించిన గీతం)

అన్నవాడే

ప్రజల వర్గ చైతన్యంలో ప్రభవించి
మా కలాల్లో ప్రతిఫలించిన సూర్యుడు.
(నెత్తుటి చైతన్యంలో ఉదయించిన గీతం)

అనగలిగారు ఆయుధం పడితే విప్లవం వస్తుందనేది కొందరి వాదన అయినా, పరిపాలకులకు వ్యతిరేకంగా శక్తివంతంగా, ఆయుధం పట్టగల్గిననాళ్ళు ప్రజలు.

వరవరరావు ''స్వేచ్ఛ' వందిమాగధస్తోత్రంకాదు కణకణం పోరాటం రగిలే స్వభావం, అణువణువు స్పందించే ప్రకృతి కల్గియున్నది. విప్లవం ఈ యుగశిశువుగా భావించే కవి —

ప్రజల రాజ్యాధికారం కత్తిని నిర్మించే కొలిమిలో
మనం రవ్వలమైతే ఎంత వెలుగు (ఆహ్వానం)

అనే ఆశయాన్ని వ్యక్తపరుస్తారు. కవి స్వీకరించెడి ప్రతీకలు ప్రజా జీవితములో నివసించెడివి. పదవ్యామోహము శూన్యం. ముఖ్యంగా తెలుగు సాహిత్యాన్ని అస్పష్టతా, అవాస్తవికతా లోకంగా సృష్టించి తామూ ప్రజాకవులమని చాటుకునే రచయిత లందరూ 'స్వేచ్ఛ'ను చదివైనా బుద్ధితెచ్చుకుంటే తెలుగు కవిత్వాన్ని ఆవరించిన చీకటిభూతం దూరమౌతుంది

మనదేశంలో పేరుకపోయిన భయంకరమైన అంటురోగం కుల, మత, దురహంకారం ప్రతి నాయకుడూ కులమతాల్ని అడ్డు చేసుకుని గద్దెనెక్కే వాడే కుల మతాలకు బలియైన అభాగ్యులెందరో? మొన్నటి బెల్చీ సంఘటనను ఎవ్వరూ మర్చిపోలేదను

కుంటూ. ఆ అసహాయకుల్ని బలి తీసుకున్న దురహంకారుల్ని ఉరి తీశారా? లేదు ఆ ధనాంధుల్ని జన్మఖైదు చేశారా? లేదు. ఆ సంఘటనకు సిగ్గు చెందుతున్నామని భారత జాతి మొత్తం సిగ్గుపడాలని ఇటు పాలకులూ, అటు ప్రతిపక్షీయులూ వాపోయారు అంతకంటే ఏం చెయగలిగారు. ధన మదం చాటున దాక్కున్న ఆ క్రూరమృగాల్ని ఎందుకు శిక్షించలేక పోయారు? బెల్చి సంఘటనను తలపించేదే 1974 లో ఒకసంఘటన జరిగింది ఆ సంఘటనకు బలైన వ్యక్తి కోటేశు

''నెత్తురు చెమటగా సంపన్నుల పొలాలకు నీళ్ళుపెట్టే తొండాలుగా
తమ కండరాలను మలచిన వాళ్ళూ
చేతులను పుళ్ళుగా, కాయిలుగా, రాళ్ళుగా చేసుకొని
బీళ్ళనూ, రాళ్ళనూ తొండలు కూడా గుడ్లు పెట్టని నేలనూ
మెత్తని కుంకుమ పువ్వులా కరిగించిన వాళ్ళూ''
('మరో కోటేశు మృతి')

పుళ్ళతో చీముకారే ఈ వ్యవస్థకు ఎందరు అనామకులు ఆహుతి అయినారో, ప్రజా కవుల హృదయాలకు ఈ వార్తలు రంపపుకోత కాదూ? అందుకే

''కోటేశుల బంగారు బతుకుల్ని మట్టిపాల్జేసిన
ఈ ఫ్యూడల్ కోటల పునాదుల్ని
సంఘటిత ప్రజాశక్తితో ధ్వంసం చెయ్''
(మరో కోటేశు మృతి)

అని ఎలుగెత్తి చాటి చెప్పారు.

''చేసేది దేవుడి గాజ మనసేమో చెప్పులమీద'' అన్నట్లు సోషలిజం వల్లించే పాలకులు శాస్త్రాన్ని శంకించే డాక్టర్లలాంటి వారు. పుచ్చిపోయిన అవయవాల్ని నరికి, సమాజాన్ని రక్షించే శస్త్ర చికిత్స చేయగలరు. మన మాతృదేశాన్ని విప్లవము వైపు మళ్ళించే సూర్యుడు ఉదయించే దెప్పుడు? అసలు ఈ స్వార్థపూరిత మాన వాధములు అరుణోదయం కావడానికి దోహదం కాగలరా? అందుకే కవి

''ప్రసవ వేదన పడుతున్న మాతృదేశాన్ని
శస్త్ర చికిత్స చేయడానికి జంకే వాజమ్మలు
గర్భస్రావాలో, చచ్చిన పిండాలో పట్టే
మంత్రసానులుగా మిగులుతారు''
(బీహార్, నవంబర్ 4, 1974)

అని ఈ మూర్ఖ వ్యవస్థవైపు వేలెత్తి చూపిస్తాడు.

''ప్రజల నెత్తుటిలో చిగురించిన
తొలి సామ్యవాద రక్త పతాకాన్ని
కంటికి రెప్పలా కాపాడిన కామ్రేడ్ లెనిన్'' (లెనిన్నిజం)

ఈ భూగోళంలో దారిద్ర్యం, ఆకలి అలుముకొని వున్నంత వరకూ మార్క్సిస్టు దృక్పథాన్ని సవాల్ చేసే హక్కు ఎవరికీ లేదు. బీద సాదలకు ఆత్మశాంతి లేకుండాచేసి దోపిడీ వ్యవస్థగా పేరు పొందినవారే నేడు విశ్వశాంతి గురించి ఉపన్యసిస్తున్నారు. కాగితాల్ని ఖరాబు చేస్తున్నారు. వీళ్ళ అమానుష చర్యల్ని ప్రతిఘటించాలనే ఉదయించిన రక్తపతాకం లెనిన్. వర్గపోరాట చరిత్రకు విప్లవశ్వాస లెనిన్. అందుకే విప్లవ రచయితలకు, విప్లవాన్ని ఆశించే వారికి—

''లెనినంటే
విప్లవ తద్దినానికి యిల్లలుకునే
రివిజనిజం అలుకు పిడచ కాదు
విప్లవానికి పునరంకితమయ్యే
ప్రజాయుద్ధ ఎజెండా'' (లెనిన్నిజం)

తన చేతికష్టము కళ్ళెదురుగా దోచుకుపోతుంటే చూస్తూ ఊరుకునేవాడు ఎదురుతిరగ చేతగాని దౌర్భాగ్యుడు. వాళ్ళలోనే అగ్గి రాజుకుంటే కంచు కోటలు కూడా తునాతునకలై పోతాయి ప్రజా శక్తిని ఎదురొడ్డి ఏ నియంతా నిలదొక్కుకోలేడు. ఇది చరిత చెప్పిన సత్యం

''మన విజయం ప్రజలది
ఇంకెవ్వడో కోసుకపోవడానికి
అలుకుతున్న పొలం కాదిది
ఇంపీరియలిజం దోచుకపోవడానికి
పోడుస్తున్న చెమట కాదిది'' (ఐక్యత)

చైనా కమ్యూనిస్టు పార్టీ 10వ కాంగ్రేస్ డాక్యు మెంట్స్‌ను కవిత్వంగా మలచినా వరవరరావు కలంలో దేశీయ వాస్త వికత తొంగిచూస్తుంది మన దేశంలో ఇంకా కొనసాగుతున్న వెట్టి చాకిరిని వేలెత్తి చూపుతున్నాయి పై కవితా పంక్తులు.

మూడు భాగాలుగా ధ్వనించేలా పీఠికలో దండయాత్ర, ఉదయ కిరణాలు, రేపు స్వేచ్ఛలో రాస్తాను అనువని హెడ్‌లైన్స్‌లో అగుపించినా ఇందులో తారసిల్లేవి రెండు రకాల కవితలు అవి పోరాడు పాటలు + వచనకవితలు. శివసాగర్‌గారన్నట్లు ''వరవరరావు కవితలన్నిటా విప్లవ ఆశావహ దృష్టి ఊపిర్లు పరుచుకుంది.'' సంకెళ్ళు తెంచుకుని, జైలుగోడల్ని ఛేదించుకొని వెలుగులోకొచ్చింది స్వేచ్ఛ

''ఉధృతంగా వ్యాపిస్తున్న తూర్పు గాలిని
బంధించడానికి జెయిళ్ళు, కాల్చడానికి తుపాకులు
ఎదిరించడానికి దోపిడీ చీకట్లు ఎగబడుతున్నా,
ఉదయ సూర్యకాంతిలో
ఎక్కడా కనిపించకుండా
అంతటా సంచరిస్తూ
తూర్పు గాలి.''

**శ్రీ కె. అంజయ్య**

# 'లోనారయ వలెన్'

అచ్చుపు వాడుక భాషలో వ్రాయదలచుకున్న వ్యాసానికి గొడ్డు గ్రాంధికపు పేరు పెట్టడం ఒక విచిత్రి విశేషం. చిరు వెటకారం కూడా ఉంటే ఉండనీయండి. అది ఒక 'రిలీఫ్'.

ఈమధ్య పత్రికలు చదవడం — వాటిని పట్టించుకోవడం అలవాటు తప్పిపోయింది. నాకు నచ్చిన ఉదాత్త రచనలు చదువుకుంటూ, వాటి విచారధారతో కాలక్షేపం చేస్తున్నాను. కాగా మొన్న ఎవరో 1978 మే నెల 'భారతి'లో శ్రీ రమణారెడ్డిగారి 'జగద్ధితంబుగన్' తెచ్చి చూపించారు దాని అధోజ్ఞాపికలో 'ఫలానావారి సారమతి నన్నయ చదివాక 14–1–77 హైదరాబాదు జైల్లో రాసింది' అని ఉటంకించారు.

హైద్రాబాదుజైల్లో కారాక్లేశం అనుభవిస్తూ కూడా మిత్రులు శ్రీ రెడ్డిగారు నా గ్రంధం అంతశ్రద్ధగా చదివినందుకు ముందుగా కృతజ్ఞతలు చెప్పుకోవాలి. చదివి పక్కను పడవేయకుండా స్వమతానుసారంగానే కానీయండి—నాలుగు ముక్కలు రాయడం కూడా విశేషం. అయితే నా గ్రంధలక్ష్యానికీ, ఆ వ్యాసానికీ ఏమీ సంబంధం లేదు. నా గ్రంధ ప్రేరణవల్ల తన మనస్సరస్సులో రేగిన ఆలోచనల అలల అక్షరరూపం అది ఇంకోవిధంగా చెబితే అది ఒక బహిరంగ స్వగతం! కొన్ని అభిప్రాయభేదాలున్నాయి. నేటి సాహిత్యయాత్రలో అవి తప్పవు. అంతమాత్రంచేత ఎవరికీ వచ్చిన నష్టం లేదు

అసలు ఆయన వ్యాసం వెనక ఉండే ఆలోచనా ధోరణికీ, నా గ్రంధోద్దేశ్యానికీ భూమిక ఒకటి కాదు ఆయన చరిత్ర మీదనుంచి సాహిత్యాన్ని చూస్తే — నేను సాహిత్యం మీద నుంచి చరిత్రను చూస్తాను. నాకు ఉపసర్జనమైనది ఆయనకు ప్రధానం. ఆయన ప్రధానం నా ఉపసర్జనం. ఇవి సమాంతరంగా నడిచే రెండు దృక్పథాలు వీటి ఏకీకరణ ప్రయత్నం వృధాప్రయాస. అయితే ఈ ప్రసంగం ఎందుకు ? అనవచ్చు.

అక్షరాలా నిజం. కాని కొందరికి — నా పుస్తకం చదవని వారికి — రెండోవైపు భావన ఏమిటో—అనే చిన్న జిజ్ఞాస కలగవచ్చు. వారికోసం — నా వైపునుంచి రెండు మాటలు అవసరమేమో అనుకున్నాను. అంతేగాని—ఇది ఒక వాదంగా కొనసాగించే అవసరంగాని, ఆసక్తిగాని లేదు.

క్లుప్తంగా నా గ్రంధలక్ష్యం ఇదీ—

నన్నయ్యగారిమీద తరుచుగా వినపడే నాలుగు వాదులు ఎంతవరకు యధార్థాలు ? అని తెలుసుకోదలచి ఆయన భారత భాగం క్షోదక్షమంగా చదివి, ఈ అభిప్రాయాలు ఏర్పరచుకున్నాను.

(1) ఆయన భారత 'ప్రథమానువాదకు'డే కాడు; ఏ సంస్కృత గ్రంథాన్నయినా—ఇంపుగా, సొంపుగా తెనుగుచేయడం నేర్పినవాడు. కవిత్వమంటే స్పష్టమైన దర్శనం ఉన్నవాడు.

(2) బ్రాహ్మణ ప్రశంసకు భారతం తెనిగించలేదు ప్రసక్తమైనచోట మూలంనుంచే తెనుగుచేశాడు. ఇది దోషమే అయితే ఈ 'దోషానికి' ఎక్కువ పాత్రులు -- తిక్కన్నగారు.

(3) భారతంవంటి ఉద్గ్రంథాన్ని తెనిగించడానికి అప్పుడున్న తెలుగుభాష, ఛందస్సామగ్రీ చాలదు. తొలుత సంస్కృత సహాయం తప్పదు. కనుక సంస్కృత ప్రాబల్యం కనపడినా బోధ దృష్ట్యా అది ఎవ్వరినీ బాధించలేదు. రసానుగుణంగా నడిచింది కూడా.

(4) ఆయ నంత 'స్వస్థానవేషభాషాభిమతుడు' వేరొకడు కనపడడు. 'ఏ సంస్కృత పురాణ గ్రంధమూ దేశభాషలోకి తేగూడదు' అనే ఛాందసులను ప్రతిఘటించి, నారాయణభట్టు సహాయంతో భారతాన్ని దేశభాషలో వెలయించడం ఆయన అభ్యుదయవాదితకు తార్కాణం. దాని ప్రతిబింబమే తిక్కనగారి 'ఆంధ్రావళిమోదము'. కనుక ఆయన జాతీయతను విస్మరించలేదు.

అంతేకాక మరి రెండు ప్రకరణాలలో ప్రసన్నకథ, ప్రసన్నకవిత అన్న అంశాల గురించీ, నన్నయగారి భారతాంధ్రీకరణ విరోధాభాసముల గురించీ, విపులంగా చర్చించాను. ఈ అభిప్రాయాలు ఖండితములైతే నేను ఆత్మపరీక్ష చేసుకోవాలి. తప్పని నిర్ధారణ అయితే దిద్దుకోవాలి ఆ అవసరం ఇంతవరకు నాకు కలగలేదు.

ఇక —

నా గ్రంధం చదివినప్పుడు రెడ్డిగారికి కొన్ని ఆలోచనలు కదిలినట్లే — ఆయన వ్యాసం చూడగానే నాకూ కొన్ని ఊహలు పొరాడినవి. మనవి చేస్తాను :

నన్నయగారి సత్యవ్రతంమీదగాని, రాజరాజు శౌర్యాతిశయం మీదగాని, నే నేగోపురాలు నిర్మించలేదు. కనుక అవి కూలిపోతాయనే భయం లేదు.

ఒకటి ఉంది — మునిగింది గంగ; వలచింది రంభ; (రాసింది కవిత) అన్నటు నన్నయ్యకు ఆశ్రయదాత రాజరాజు. 'అన్యరాజ తేజో జయశాలి' అవడం అసహజ మేమీ కాదు.

ఇక్కడ — ఇంకో ఆలోచనకూడా ఉంది.

దొరికిన ఆధారాల మూలంగా మనదగ్గరకు వచ్చిన చరిత్ర పరోక్షం; దాన్ని విశ్వసించడమే మనకు శరణ్యం. నన్నయకు రాజరాజు చరిత్ర ప్రత్యక్షం. రాజరాజు నిజంగా అంత పనికిమాలిన వాడే అయితే — నన్నయగారు 'బూతు పొగడినట్లు' పొగడితే — సత్సభాంతరాల్లో లేక రాజమహేంద్రవరంలో ఆయన 'ఆబోరు' దక్కేదా ?

పోనీ — సభలో రాజుగారి సంగతి అని ఊరుకున్నా — పరోక్షంలోనైనా విజ్ఞులలో నవ్వులపాలు అయివుండేవాడు కాడా? ఆ 'లోకజ్ఞు'నకు అంతమాత్రం లోకజ్ఞానం లేకపోయిందా? అనే ఆలోచనలు రాకుండాఉండవు. నిజమే. తెలుగు కవులకే కాదు, ఏ పూర్వకవులకూ చరిత్రమీద అంత 'మోజు' లేదు. చరిత్రను తెలిసినంతలో ఒక ఉపపాత్రగానే ఉపయోగించారు గాని 'శిరసా' వహించలేదు. చూపంతా చరిత్రమీదే ఉంటే—కవిత్వం ఇంకిపోతుందని భయమేమో. చిన్నరాజో, రాజ్యమో దొరికితేచాలు. కవిత్వంతో విజృంభించేవారు. తిక్కనగారిని చూడండి—దాయాదులవల్ల పదవీ

భిషిక్తుడై — తనతండ్రి తిక్కరాజలాగనే గణపతిదేవ చక్రవర్తి దయమీద నిలదొక్కుకున్న మనుమసిద్ధిని—

''శ్రీ రాస్తాం మనుమక్షితీశ్వర భుజాస్తంభే జగన్మండల ప్రాసాద స్థిరభారభాజి దధతీ సా సాలభంజీ శ్రియమ్...'' అంటూ ఒక సార్వభౌముణ్ణి పొగడినట్టు ఆకాశాని కేత్తేశాడు. అంతేకాదు ఆయన బలపరాక్రమాలను 8 పద్యాల్లో ఎక్కడలేని వివరాలతోనూ నోరూరేలా వర్ణించాడు. గణపతిదేవునిపేరు రాకుండా జాగ్రత్త పడ్డాడు. ఆ బలసౌందర్యాలు నిజమో, అబద్ధమో తెలియదుగాని, ఆ కవిత్వంమాత్రం అమోఘంగా ఉంది. అయితే — చరిత్రజ్ఞులు ఆ వర్ణితాంశాలు నిజమని ఒప్పుకున్న దాఖలాలేదు [1]

తాను నిత్యసత్యవ్రతుడనని చెప్పకపోయినా — 'వైదిక మార్గనిష్ఠ మగువర్తనము'తో 'పుట్టుకృతార్థతం బొరసిన పుణ్య చరిత్రుడు.'' అసలుచరిత్ర పట్టించుకోకుండా వ్రాసినందుకు అప్పుడు కొందరైనా అచ్చపు నెల్లూరు పరిభాషలో 'సిగ్గొట్లు, సిగ్గొట్లు' అనుకున్నారేమో. అంతేకాదు, ఆత్మస్తుతిలో నిము ఖుడూ కాలేదు. ''అమలోదాత్త మనీష నే నుభయకావ్యప్రౌఢి పాటించు శిల్పమునన్ బారగుడన్—సన్మాన్యుడన్'' అని ఢంకా బజాయించి, నిర్మొహమాటంగా ఉత్తమపురుషలో చెప్పుకున్నాడు.

నన్నయ 'ఆత్మస్తుతి' పద్యం నారాయణభట్టుదేమో అని కొందరు పెద్దలు అనుమానిస్తూఉండగా [2] — ప్రథమపురుషలో ఉంటేనే ఎబ్బెట్టుగా ఉందిగదా దీనిమాట ఇక అడిగారా?

రెండువందల సంవత్సరాల తర్వాతవచ్చి — లౌకికుడుగా, మంత్రిగా రాటుదేరిన తిక్కనార్యుడైనా - నన్నయ్యతాలూకు ఈ 'అవలక్షణాలను' విడచి అచ్చంగా ఉన్నదున్నట్టుగా వ్రాస్తే తెలుగుకవుల కీ అపకీర్తి ఉండేది కాదుగదా.

అట్లా జరగలేదు.

అయితే ఆ మహాకవులరచనను అంత తేలిగ్గా కొట్టిపారేయ డం న్యాయం కాదేమో అని తోస్తుంది. ఇద్దరి పోష రాజులూ అంత గొప్పవిజేతలు కాకపోయినా పరుల సహాయంతీసుకున్నా—చేసిన యుద్ధాలలోనే, దొరికిన సమయాలలోనే 'జయశాలి శౌర్యమును', 'వైరిరాజుల మదం బడగించుటను' చూపి ఉండవచ్చుగదా! అట్లే ఆ సౌందర్య, ఔదార్యాలు కూడ మనకు పరోక్షం; వారికి ప్రత్యక్షం! వారు తాము చూచిన ఆధారాలతో అతిశయోక్తి కొంత కలిపి వర్ణించి ఉండవచ్చు. అసలు కవిత్వమంటేనే అందమయిన అబద్ధ మాయె. అది చరిత్ర అంత సత్యంగా ఉండమంటే ఎట్లా ఉంటుంది? ఉంటే అది కవిత్వ మెలా అవుతుంది?

ఆత్మస్తుతి—నిజానికి అంత ఆరోగ్యలక్షణం కాదు. కాని తమ శక్తిసామర్థ్యాలమీద తిరుగులేని ప్రత్యయం కలవారు నాడూ నేడూ ఆత్మస్తుతి చేసుకుంటూనే ఉన్నారు. మనం నిర్వికారంగా హర్షిస్తూనే ఉన్నాం. వాల్మీకి తన్నుగూర్చి 'వాక్యవిశారదః' అనీ నన్నయ్య 'యత్యమరాచార్యు'అనీ, తిక్కన 'కళావిదుడ'ననీ, విశ్వనాథ 'బ్రాహ్మీమయమూర్తి'ననీ, శ్రీశ్రీ 'అంతరసాధ్యం నామార్గం' అనీ అంటే—వారి ప్రతిభ చూచినమీదట—నిజం — అంటే మాత్రం తప్పేమీ అనుకున్నాం. కాబట్టి ఇది వారి రచనలను చదివి ఆనం దించడానికి ఏమీ అడ్డురా దనుకుంటాను.

నన్నయగారి 'జగద్ధితంబు లో జగిత్తూ', కృష్ణద్వైపాయ నుడి 'లోకహిత నిష్ఠ'లోని లోకం, తిక్కనగారి 'జనసంప్రార్థ్యంబు' లోని జనం, ఆంధ్రావళిలోని ఆవళి, ఎవరు ?

వ్యాసుని లోకం యావద్భారతమేకాక — మానవాళి అంతా కావచ్చు. అయితే — ఆయన 'హితనిష్ఠ' ఎవరిని బాగుచేసింది ? నన్నయ, తిక్కనగార్ల జగిత్తు, జనం, ఆవళి, అంతా తెలుగు ప్రజలే కాక తప్పదు. అయితే ఎల్ల తెలుగులకు ఈ భారత రచన, నీతి ధర్మాలూ, అందాయా ? లేక అగ్రవర్ణాలవారే గుత్తగొన్నారా? అంటే — అందరికీ ఉద్దేశించకపోతే ఈ తెనుగు చెయ్యడం ఎందుకు ? అజ్ఞానులను దూరంగా ఉంచడానికే అయితే సంస్కృతమే సురక్షితం గదా !

ఏ దేశంలోనైనా ఉద్గ్రంథాల ఉపదేశం, సందేశం, అందరికీ అందుతుందని చెప్పలేం. దానికి తగిన చిత్త సంస్కారం భాషా పరిజ్ఞానం ఉన్నవారికే అది ప్రాప్యం అవుతుంది. కావ్యంలో, నాటకంలో, అనుభూతీ, రసగ్రహణం సర్వ సాధారణం అని చెప్ప గలమా ? ఈనాడు ప్రజలకోసం వ్రాస్తున్నామని చెప్పే వచనకవిత అందరికీ అందడం ఖాయమేనా ? జనంలో — పరిజ్ఞానాన్ని బట్టి మందాధికారులు, మధ్యమాధికారులు, ఉత్తమాధికారులు. ఎప్పుడూ ఉంటారు. వారి అధికార భేదాన్నిబట్టి వివిధ ప్రక్రియల్లో వారికి మహాత్ముల సందేశం అందుతూ ఉంటుంది. ఉత్తమాధికారులు ఉద్గ్రంథాలను స్వయంగా చదువుకుంటే — మధ్యమాధికారులు అనువాదాల ద్వారా, వ్యాఖ్యానాల ద్వారా గ్రహిస్తారు. మందాదికారు లకు వారి స్థాయికి తగిన ప్రక్రియలద్వారా అందజేస్తారు.

భారతం విషయంలోనూ అంతే జరిగింది.

అగ్రవర్ణాలలో కూడా ఈ మూడు తరగతులూ ఉండవచ్చు. ఎవరి స్థాయినిబట్టి వారు భారత నీతిధర్మాలను కవితా సౌందర్యాన్నీ గ్రహించారు. మందాధికారులు తోలుబొమ్మలు, హరి కథలు, యక్ష గానాలు, ఆట, పాటలు ద్వారా భారత హృదయాన్ని అవగతం చేసుకున్నారు. కనుకనే 'వింటే భారతమే వినాలి; తింటే గారెలే తినాలి' అన్న మాటలతో క్రింది తరగతి వారు తమ భారతాభి మానాన్ని నిరాడంబరంగా వెల్లడించారు.

'భారతం బొంకు; రామాయణం రంకు' అన్నవారూ ఉండ వచ్చు. అయితే వారి చిత్త సంస్కారం అంతకంటె గ్రహించలేక పోయిందని వారిమీద జాలిపడాలి.

కాని — ఆ మాటల్లోనూ ఒక పరమార్థం ఉన్నదేమో అనిపిస్తుంది. భారతసారం దుర్యోధనుని ఆడితప్పడం; ఆ బొంకు నీ బ్రతుకులో రానివ్వకు ! రామాయణసారం స్త్రీ వ్యామోహం;

దాని జోలికి పోకు! సూత్రప్రాయంగా పై మాట లన్నవారు చాల గడుసువారేమో.

భారతం కథలవల్ల, సూక్తులవల్ల, వ్యంగ్యమైన బోధలవల్ల ఎవరి స్థాయిలో వారిని ఆకర్షించింది.

వట్టి కథా కాలక్షేపం కోసమే అయితే బృహత్కథ, కథా సరిత్ సాగరం వంటివి ఉండనే ఉన్నాయి. కాని అవి రామాయణ భారతాలవలె ప్రజలను పట్టుకోలేదు.

తెలుగు భారతం ద్విజుల కంటె ద్విజేతరులకే ఎక్కువ ఆత్మీయం అయింది. వైదిక విప్రులు తెలుగు భారతం ప్రాయశః చదవరు సంస్కృత గ్రంథమే వారి కారాధ్యం. తీరాంధ్రంలో, రాయలసీమలో, తెలంగాణంలో — తెలగా, కమ్మ, వెలమ, రెడ్డి కులస్థులకు తెలుగు భారతంలో కొన్ని ఘట్టాలు కంఠపాఠం పల్లె సీమలలో పండితులనుపెట్టి భారతం పురాణం చెప్పించుకునేవారు. పండితులతో సమంగా భారత ఘట్టాల గురించి చర్చించేవారు. సుమారు అర్థశతాబ్దం క్రిందట ఈస్థితిని స్వయంగా ఎరుగుదును. రామలింగారెడ్డిగారి తెలుగు అభిరుచికీ, ప్రవేశానికీ తమ తండ్రిగారు కారణమని వ్రాశారు. చిత్రం — శ్రీ అనంత కృష్ణశర్మగారు తమ ఆంధ్రాభిరుచికీ, తెలుగు భారత ప్రవేశానికీ కారణం రామలింగారెడ్డి గారు అని ఒకసారి చెప్పి ఉన్నారు. ఇంతకూ — తెలుగు భారతం ద్విజుల సొత్తు కాలేదు. తెలుగు భారతం తెలుగు జాతి రుచినీ, (అపూర్వ కథలు) శుచినీ (ధర్మం) పెంచిన దనడానికి ఏమీ సందేహం లేదు.

ఇంతయేల — సర్వ ప్రజాభ్యుదయ వాదులూ, సామ్యవాద ప్రథమ ప్రవర్తకులూ అయిన రష్యావారు స్వభాషలోకి భారతం అను వదించుకుని లక్షల ప్రతులు దేశంలో వెదజల్లడానికి ఏదో విశేషం ఉండాలిగదా! వ్యాసమహర్షి 'లోకహితనిష్ఠ' భారతదేశంతో ఆగక రష్యనుల వివేకపాకానికి కూడా తోడ్పడం దన్నమాట!

నిర్వచనోత్తర రామాయణం నాటికి తిక్కన శివభక్తుడు. భారత రచననాటికి 'విష్ణురూపాయ నమశ్శివాయ' అనే పరతత్త్వ ద్రష్ట.

అయితే ఆయన శైవాన్ని ఎందుకు విడచినట్టు? మనఃపరిపాకంమాట సరే. ఆనాడు ఒకదాని నొకటి అణచడానికి ప్రయత్నిస్తూ — తర్కసహంకాని అశాంతినీ, ఆవేశాన్నీ రెచ్చ గొడుతూ ప్రజలను తమ గుప్పిట్లో పెట్టుకోడానికి ప్రయత్నించే బౌద్ధ జైన శైవాదుల ధాటికి విరుగుడుగా పనిచెయ్యగలిగింది జ్ఞాన ప్రధానమైన ఒక్క బ్రహ్మతత్త్వమే. అదే అద్వైతం. ఉపాధి భేదంవల్ల, నామరూపాలవల్ల — రుచిభేదం ఏర్పడి హింసా, క్రౌర్యాలకు కూడా వెనుదీయనంతటి దూరం వెళ్ళాయి అవి. ఈ స్థితి ఇట్లా కొనసాగ నివ్వడం ప్రజాశ్రేయస్సు కోరిన ఏ వివేకవంతునకు సాధ్యం కాదు. దీనిని శాంతపరిచే మార్గం ఏమిటి?

అదే తిక్కనగారు చెప్పిన 'వైదికథ్యాయిత'. ఆయన అవలంబించిన వైదికమార్గ నిష్ఠ వారు వర్తనమునకు అర్థం ఇదే. స్తిమితమైన ఆత్మజ్ఞాన సాధనవల్ల చిత్తశాంతి లభిస్తుంది విరోధాలు నశిస్తాయి ఈ అద్వైతం మనవద్దకు వచ్చేసరికి 'ఇనుప గుగ్గిళ్ళు' అయింది గాని — దేశంలో తత్త్వాలు పాడుకుంటూ తిరిగే భిక్షుకులకు సైతం కరతలామలకం. ద్విజేతరులైన భక్తు లెందరో ఈ తత్త్వచింతనతో పండినవారున్నారు. ఉన్నవవారి 'మాలపల్లె' లోని హరిజనుడు రామదాసు ఈ తరగతివారికి ప్రతీక. అతని జ్ఞానసాధన ఒంటబుట్టిన అద్వైతఫలం. భిక్షుకుల 'తందానతాన'లో అద్వైతసారం ఉందన్నారు. తను = ఆ బ్రహ్మ తత్త్వం, తాన, తాన = తానే, అనగా మానవుడే — సోఽహం బ్రహ్మ ఈ తత్త్వం అన్ని విమతాలను తనలో కలుపుకుంటుంది.

ఈ విషయాన్నే వివేకానందుడు ఎలుగెత్తి చెప్పాడు. ఈ ఎరుక కలిగితే మానవుడే దేవుడు; వేరే దేవుడు లేడు. ఈ స్థితికి వైదిక మతం నడిపిస్తుంది. వేదమతం వేరు, ఉపనిషన్మతం వేరు అనుకోవడం భ్రమ. రెండూ ఒకే గ్రంథంలో పూర్వోత్తర భాగాలు. పూర్వభాగం చిత్తసంశుద్ధికి మూలమైన కర్మమార్గం చూపితే — ఉత్తర భాగం జ్ఞానమార్గం నిర్దేశిస్తుంది దానివల్ల ఆత్మసాధన పూర్తి అవుతుంది పై అర్థాన్ని సంగ్రహించేదే ఈ క్రింది వాక్యం: "అవేశపూరితములగు క్రొత్త మతములకంటె సనాతనమును వర్ణాశ్రమధర్మ సమ్యగ్విభక్త సోపానక్రమ విలసిత మును, సమతాభూషితమును అగు వైదికమతమే ప్రజావళికి ఎప్పటి కైనను సుఖశాంతుల నిచ్చి పరిరక్షింపగలదు"

ఈ సమాసాన్నిఇట్లా అర్థం చేసుకోవాలి:

వర్ణధర్మ సమ్యగ్విభక్తము; ఆశ్రమధర్మ సోపానక్రమ విల సితము; కనుక సమతాభూషితం.

సంఘశరీరానికి నాలుగు వర్ణాలు నాలుగు అవయవాలు. ఖచ్చితంగా ఎవరిపని వారు చెయ్యడానికి ఈ విభాగం వృత్తిలో, వర్తనంలో, పోటీ పనికిరాదు ఇక్కడ తల కెంత గౌరవమో పాదాలకూ అంతే మన్నన పాదాలులేని తల, తలలేని పాదాలు వ్యర్థం. ఒక్కటే శరీరం అయినప్పుడు అవయవాలకు తగాదా తెలివితక్కువ. సమ్యగ్విభాగం అంటే ఇదీ. సోపానక్రమం ఆశ్రమాలది. బ్రహ్మచర్యం పూర్తి అయితే గార్హస్థ్యం పైమెట్టు. దానిపైది వానప్రస్థం. త్యాగపూరితమైన సంన్యాసం ఆఖరి మెట్టు. ఈ క్రమపరిణామం లేని సంన్యాసం కూలిపోతుంది. బౌద్ధం పతనమవడానికి కారణం ఈ పరిణామం లేకపోవడమే. 'పచ్చికాయ దెచ్చి పడవేయ ఫలమౌనే?' సనాతనమంటే రచయిత ఉద్దేశం స్థిరత; ప్రాచీనత కాదు. ఆ వర్ణవిభాగం, ఈ ఆశ్రమ సోపానాలు, పరస్పరానుబద్ధము లయినప్పుడు విషమస్థితి తొలగి సమత విలసిల్లుతుంది. సమత అంటే సామ్యవాదం కాదు, సామ రస్యం. ఇదీ ఆ సమాసకర్త హృదయం.

చతుర్ధవర్ణానికి సేవాధర్మం "పరమోధర్మం" ఎప్పుడూ కాలేదు. అది ఒక స్థూల విభాగం మాత్రమే. దీనికి రాతిగోడలు

లేవు. చతుర్థవర్ణస్థులకు ద్విజులకు మించిన గౌరవం దక్కడం మనం చూడగలం. వాల్మీకి, వ్యాసులు, పురాణప్రవక్త సూతుడు, ద్విజులు కారు. భారతంలో ధర్మప్రవక్త విదురుడు చతుర్థకులజుడని స్పష్టం.

ఏ ద్విజునకూ లేని గౌరవం అందుకున్నాడు. భారతంలోని ధర్మవ్యాధ కథ కులగౌరవాన్ని చెప్పదు; గుణగౌరవాన్ని చెబుతుంది. ఈధర్మాన్ని నేర్చుకో మంటుంది. అందరినీ—ఇంతయేల. అనుశాసనికపర్వంలోని ఈ శ్లోకం చిత్తగించండి.

> ''న యోని ర్నాపి సంస్కారో, న శ్రుతం న చ సన్తతిః
> కారణాని ద్విజత్వస్య, వృత్తమేవ తు కారణమ్ ''

ఈ వరుసలో ఈ అర్థాన్నే ప్రపంచిస్తూ ఇంకా 3 శ్లోకాలున్నాయి. ఆరణ్యపర్వంలోని ఈ పద్యం ముక్తాంతంగా ఈ మాట అంటుంది :

> ''పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును
> నిజము, శూద్రుకంటె నీచతముడు;
> సత్య శౌచ ధర్మశాలి శూద్రుం డయ్యు
> నతడు సద్ద్విజుండ యనిరి మునులు —''

ఏవర్ణస్థులైనా స్వయోగ్యతవల్ల ఔన్నత్యం పొందే ఏర్పాటు ఆర్షమతంలో ఉంది. ఈ వ్యవస్థ సుస్థిరంగా ఉన్నంతకాలం ఎవరూ మేము తక్కువ అనికాని, మాకు అన్యాయం జరిగిందని కానీ అనుకోలేదు. అంతా అన్నదమ్ములం అనుకున్నారు.

ఇక జాతీయత. సారమతి 39 పుటలో చివరి పేరా చూస్తే నా దర్శనం బోధ పడుతుంది. కేవలం పలుకుబడులనో, కాకువులనో పట్టుకుని, జాతీయతను నిరూపించలేదు. ''ఒక జాతి జీవధర్మము ఆ జాతీయుల సర్వవర్తనములందును ప్రతిబింబించుచుండును.'' దానిజీవనాడి తెలియుట జాతీయత నెరుగుట. తెనుగుజాతి జీవధర్మం తెనుగుదనం. ఇక్కడ తెనుగుదనం అనే మాట విశాలార్థంలో ప్రయుక్తమయింది.

నన్నయ భారతానికి 'మన్నిక' కలగడానికి కారణం — ''ధర్మశాస్త్రం వంటిది కావడంవల్లా, మతస్పర్శవల్లా మహితమైన ఇతివృత్తం ఉండడంబట్టీ'' కాదు. ఒక మహేతిహాసానికి అపూర్వమైన కావ్యరూపం ఇవ్వడంవల్ల అది తెనుగువారి మన్ననకు పాత్రమయింది. 'ధర్మశాస్త్రజ్ఞులు' అనే నన్నయ పద్యం వ్యాసభారత ప్రశంసా పరమైనది గాని - తెనుగు భారతానికి ఉద్దేశించి కాదు. ఆ లక్షణాలు మూల-భారతాన్నిబట్టి కొన్ని తెలుగు భారతంలో ఉండవచ్చు. తల్లిపోలిక పిల్లల కున్నట్టు.

అంతమాత్రంచేత అది ధర్మశాస్త్ర మనుకోవడంగాని, మతగ్రంథం అనుకోవడంగాని సరియైన భారతావగాహనం అనిపించుకోదు.

నన్నయయే 'ఇక్కావ్యంబు రచించెద' అన్నాడుగదా! ధర్మశాస్త్రం కావలిస్తే మనుస్మృతి చదువుకుంటారు మతగ్రంథం కావలిస్తే భగవద్గీత చదువుతారు. తెనుగుభారతం అపూర్వ కథా సౌందర్యంకోసం, కవితా మాధుర్యంకోసం చదువుతారు.

ఆనుషంగికంగా మతధర్మవిషయాలు ప్రసక్తములు కావచ్చు. కాని — రచనాతాత్పర్యం మాత్రం అదికాదు.

పద్యవిద్య — పద్యం వేరు, పద్యవిద్య వేరు. వేదంలోని ఛందస్సులను వాల్మీకి, శాసనాల్లో ఉన్న పద్యాలను నన్నయ్య గ్రహించి వాటి రచనను ఒక విద్యగా (కళ) మలచారు. తెలుగులో గొప్ప వృత్తరచనకు నన్నయ పెట్టింది పేరు. నేటికీ ఒడుపుగా పద్యంరాయా లనుకున్నవారికి నన్నయ్యే ముందు శరణ్యం! కనుక 'తెలుగులో పద్యవిద్యకు నన్నయ్యే ఆద్యు డనుకునే రోజులు' గతించలేదు. ఎప్పటికీ గతించవుకూడా. ఇట్టి పద్యవిద్య ప్రజలకు శిరోభారం కాలేదు సరిగదా — శిరోభూషణం అయింది!

సుమారు—ఏభై, అరవై ఏండ్ల కిందట — వీధిబడులలో పిల్లలచేత శతకాలు, భాగవతపద్యాలు కంఠోపాఠం చేయించేవారు. వారిచదువంతా తెలుగుసాహిత్యంతోనే బ్రాహ్మణేతర బాలకులకే వీటిమీద అధికశ్రద్ధ ఉండేది వారికి వృత్తాలు, సీసాలు, వచోవిధేయాలు. తెలుగుపద్యం అంటే భయం పట్టుకున్నది. 'తెల్లవాడికి తెలుగుపద్యాలమీద ఖాతిరీ 'లాయిన' నాటినుంచే.

ఏతావతా—నన్నయగారిది సత్యవ్రతం అయినా, కాకపోయినా రాజరాజు శౌర్యవంతుడని నిర్ధారణ లేకపోయినా తెలుగుప్రజలకు సమాజంలోని ఎగుడుదిగుళ్ళు, అద్వైతం తెలియకపోయినా—తెలుగు భారతమాధుర్యం ఆస్వాదించేందుకుగాని, భారత నీతి ధర్మాలు అవగతం చేసుకోడానికిగాని ఎట్టి అభ్యంతరం ఉండదనుకుంటాను.

## అధోజ్ఞాపికలు

1 చూ. జమీన్‌రైతు పింగళి ఉగాదిసంచికలో డా. సి రామచంద్రరావు 'నిదురించిన నెల్లూరుచరిత్ర' పుట. 34

2 చూ. చాగంటి శేషయ్యగారి 'ఆంధ్రకవితరంగిణి' మొదటి సంపుటి, పుట 4.

*శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి*

# గూడూరు శాసనములోని విశేషాంశములు

''భారతి'' జులై సంచికలో ''గూడూరు శాసనములోని విశేషాంశములు'' అను శీర్షికతో శ్రీ ఐ. వై. డి. మల్లికార్జున వ్రాసిన వ్యాసములోని కొన్ని అభిప్రాయములు సవరణ జేయదగియున్నవి. స్వయముగా ఈ శాసనమునే గాక, కాకతీయులకు సంబంధించిన అనేక శాసనములను, గ్రంథములను జూచి సాధ్యమైనంత సమగ్రముగా పరిశోధనజేసి, అనేక నూతనాంశములను, ఆశ్చర్యకరములైన విషయములను, నమకూర్చి, తగిన సాక్ష్యాధారములతో,

నేను త్వరలో ప్రత్యేక గ్రంథముగా ప్రకటించుచున్న ''ఓరుగల్లు కాకతీయాంధ్ర చరిత్ర'' [అచ్చులో నున్నది] వెలువడినచో, రచయిత ఆశించినట్లు, కాకతీయుల తొలివెలుగులే గాక, కాకతి మొదటి బేతరాజు చరిత్రకూడ తెలియరాగల మహద్భాగ్యము సమకూరగలదు. ''గూడూరు శాసనము'' గురించిన విషయ వివరణకు తోడ్పడగల ప్రత్యేక ఉపశీర్షిక మాత్రము సంక్షిప్తముగా నిచ్చుట ప్రకటించుచున్నాను.

ముందుగా రచయిత జేసిన పొరపాటులను జూపుదును.

కాకతీయుల మొట్టమొదటి శాసనము క్రీ. శ. 956లో కాకర్త్య గుండ్యన వేయించినది. [దీని సరియైన ప్రతి 'ఎపిగ్రాఫికా ఆంధ్రికా' — మొదటి వాల్యూంలో ఉన్నది] దాని నీ రచయిత చూచినట్లుగాలేదు. ఇవేగాక ఈ వ్యాసమునకు సంబంధించినంత వరకు ఉపయుక్తములైన కుకునూరు శాసనము, కాకతి మైలాంబ బయ్యారము చెరువు శాసనము గూడ ఈ రచయిత చూడలేదని స్పష్టముగ తెలియవచ్చుచున్నది. మాంగల్లు శాసనము కాలమున రాష్ట్రకూట చక్రవర్తి మూడవ కృష్ణరాజేగాని, ఆ శాసనమున గుండ్యనచే ప్రస్తావింపబడినవాడు,వేంగీ సామ్రాజ్యాధిపతి గుండ్యన ప్రోత్సాహమున దొమ్మనయను బ్రాహ్మణునకు మాంగల్లు [కృష్ణా జిల్లా, నందిగామ తాలూకా] అగ్రహారమును దానమిచ్చినవాడు — తూర్పు చాళుక్య చక్రవర్తి దానార్ణవుడు [క్రీ శ.950–973]. గుండ్యన రాష్ట్రకూటుల సేనాధిపతియేగాని — రెండవ కృష్ణరాజు సేనాధిపతి దండెన గుండ్యనకు మనుమడు. ఇతడు మూడవ కృష్ణరాజు సైన్యమున ప్రముఖస్థాన మాక్రమించిన ప్రత్యేకాధికారి. [సైన్యాధిపతి యని శాసనమున స్పష్టపరుపబడిలేదు]. కాకతి మైలాంబ బయ్యారము చెరువు శాసనములోను, సిద్ధేశ్వర చరిత్ర పీఠికలోను ఇతడే పెండ్లి గుండ్యన [లేక] పిండిగుండ్యన యని వ్యవహరింపబడియున్నాడు.

పై జూపిన శాసనములను జదువకయే ఈ రచయిత వ్యక్తముచేసిన అభిప్రాయములు తప్పుగా నున్నవి.

గుండ్యన కొఱవి మండలమును చక్రవర్తి మూడవ కృష్ణరాజు అండదండలతో ముదిగొండ చాళుక్యులనుండి తన స్వాధీనము జేసికొన్నాడనుట వాస్తవ విరుద్ధము. కుకునూరు, గుముడూరు శాసనములలో జెప్పబడియున్నట్లు ముదిగొండ చాళుక్య వంశస్థుడగు, రణమర్దనుని సంతతి కుసుమాయుధుని ప్రపౌత్రుడగు బొట్టు బేతరాజు ''కొఱవి''యందు సామంతునిగా నున్నాడు. బేతరాజు కుమారుడగు ప్రోలరాజు కాలమున మేడేపల్లి [మణినాగపుర మనునది మరొకపేరు] శాసనమున జెప్పబడినట్లు, మాధవవర్మ సంతతివాడగు ఉగ్రవాటిక [కొఱవికి మరొకపేరు] మేడరసు, అతని సంతానమగు జగద్దేవుడనువారలు, ఉగ్రవాటి [కొఱవి] యందు రాజ్యము చేయుచు, కాకతి ప్రోలరాజుతో స్నేహ సంబంధములు గల్గియుండిరి [బాణాజీపేట శాసనమున ఈ మేడరసు—ప్రోలరాజు లిర్వురును ''వీరకమలజినాలయము''నకు భూదానము జేసిరని యున్నది.]

గుండ్యన తన రాష్ట్రకూట సంబంధ బాంధవ్యములను శాసనకాలమునకు ముందుగా[క్రీ.శ. 920–950మధ్యగాబోలును] పూర్తిగా వదలుకొన్నాడు. శాసనమున ''కాకర్త్య గుండ్యన నామ ధేయః'' - ''కాకత్య గుండ్యనార్యః'' యనిమాత్రమే వ్రాయించి, తండ్రి తాతలు రాష్ట్రకూటులని మాత్రము తెలియజేయుటకై ''ఎఱియ రాష్ట్రకూటః,'' 'గుండియ రాష్ట్రకూటః'' అని స్పష్టపరచినాడు. కృష్ణరాజు పనుపున దానార్ణవునకు సహాయము గానింపవచ్చిన గుండ్యన వేంగీచాళుక్య రాజ్యమునకు [మంచికొండ నాడు ప్రాంతమునకు] సరిహద్దు గ్రామమగు ''కాకతి పురము''న నున్న [పొరంకి] ఎఱ్ఱన కుమార్తెను వివాహమై, వారివంశమగు ''కాకతి'' వంశమున గలసి, వారి సంస్థానమునకు వారసుడై, ఎఱ్ఱనకు పుత్రసంతానము లేనందువలన, ఇల్లరికపు టల్లుడైనందున ''పెండ్లి గుండ్యన''యని వ్యవహరింపబడి, కాకతి ఎఱ్ఱన కడు వృద్ధుడైనందున అతడు జీవించియుండగనే సామంత సంస్థానాధిపతియై — కాకతీయుడుగనే పరిగణింపబడినాడు. కాకర్త్య గుండ్యనపై దండెత్తినవాడు మరొక సంస్థానాధిపతి ''విరియాల భీమనృపతి''. బొట్టు బేతనయు, కాకర్త్య గుండ్యనయు గలిసి విరియాల భీమనృపతి నోడించిరిగాని యుద్ధమున ''గుండ్యన'' మరణించెను. [కుకునూరు శాసనము నీ రచయిత జూచినట్లులేదు.]

కాకతి మొదటి బేతరాజును (గుండ్యన కుమారుడు) గరుడాంక బేతడందు రనుట సరియగును గాని బొట్టు బేతన ఇతడే ననుట తప్పు. ఈ శాసనమున ఆ పేర్లు రెండును వేర్వేరు పద్యము లందు, వేర్వేరు సందర్భములందు జెప్పబడియున్నవి జూడక వీరేగాక చాలమంది పూర్వ వ్యాఖ్యాతలును ఇట్టి పొరపాటు చేసిరి. కుకునూరు శాసనమున బొట్టు బేతడు ముదిగొండ చాళుక్య వంశస్థుడుగా, కొరవిపాలకుడుగ జెప్పబడియున్నాడు. కాకర్త్య గుండ్యన సమవయస్కుడుగా - స్నేహితుడుగా — ప్రత్యేక వ్యక్తిగా ఈరెండు శాసనముల సమన్వయమున ఇతనిని గుర్తింపవచ్చును. గరుడాంక బేత డతి బాల్యమున నున్నాడనియు, బొట్టు బేతడు ''కొరవి'' యందు ప్రతిష్ఠ జేయబడదగిన వయస్సున (ప్రౌఢ వయస్సున) నున్నాడనియు ఈ శాసనము కంఠోక్తిగా బల్కుచున్నది.

పూర్వ వ్యాఖ్యాతలీ శాసన వ్యాఖ్య యందిట్టిదే మరొక పొరపాటును గూడ జేసిరి. ''విరియాల భీమ నృప ఘస్మరుడై'' జనించిన (పొరంకి వెన్న నృపుని సంతానమగు) ఎఱ్ఱన. ''విరియాల ఎఱ్ఱన'' యని పలువురు వ్యాఖ్యాతలు—''విరియాల ఎఱ్ఱన'' గాడు. ఇతడు కాకతి పురాధిపతి ఎఱ్ఱన. (మైలాంబ శాసనమును వీరెవరును జూడక పోవుటచే ఏర్పడిన ఈ తప్పు — తరువాతనైనను శ్రీ పరబ్రహ్మశాస్త్రిగారి వంటి పండితులును సరిజేసుకొనలేదు.)

ఇక వీరు గూడూరు శాసనమును పునర్విమర్శించి, దాని పూర్వాపరముల పేర వ్రాసిన వివరణము తప్పుల తడకగా నున్న దనుటకు నిదర్శనముగా — శాసన పాఠమే — సరియైన ప్రతి—ఇట జూపబడును.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణయగు ''వరంగల్ జిల్లా శాసనములు'' అను గ్రంథమున (కొన్ని సవరణ లున్నవిగాని కొన్ని తప్పులును ఉన్నవి) దీని ప్రతియున్నది ఈ రచయిత దానినైనను జూడక కల్పనలైన పాఠాంతరములు ప్రకటించియున్నారు

1 అనుపమ దుర్జయాన్వయ సుధాబ్ధి ననేకులు రాజనందనుల్
సనిన పొంటి వెన్నడను సంభవుడయ్యె నతి ప్రసిద్ధుడై
వినుత విరోధి మండలిక వెన్నడు వెన్నడువోలె వానికిన్
ఘనుడగు నెఱ్ఱిభూపతి జగద్వినుతుం డుదయించె కీర్తితోన్.

2 భావిత కీర్తినా బరగి, పాండవ మధ్యమ భీముడో యనం
గా విరియాల భీమ నృప ఘస్మరుడై, యుదయించె వానికిన్
భూవి నుతుండు మాండలిక భూషణుడెఱ్ఱినరేంద్రుడుత్తమ
శ్రీవినుతుండు బంధుజన సేవ్యుడు దానుదయించె నున్నతిన్.

3 అతడని బొట్టుబేత వసు ధాధిపు జేకొని వాని వైరి ను
ద్వృతముగ జంపి యా కొరవి దేశము నందు ప్రతిష్ఠ జేసి త
త్ప్రతిమయు పేరు పోడగల దాయము బిట్టర గద్యనంబు స
ప్రతిముడు వానిచే మొగడు పల్లియు పంద్రెడునేల జొప్పడెన్

4 అరుదగునట్టి ఎఱ్ఱినృపు నంగన కామమసాని యాకేమే
ల్గళ దని బేత భూవిభుని గాకతి వల్లభు పిన్నవాని తా
బరగగజేత బట్టి ఘను వల్లభరాయుని – యోగిజొచ్చి భా
స్కర నిభు చక్రవర్తి గని కాకతి నిల్పుట కోటి సేయదే.

5 కారకి కాలుడై పడసె కాటయ నాయకు జంపి సూర డ
వ్వేలుపు గొండ రవ్వ నృపు వేలుపు గొండన నిల్పి వానిచే
మేలుగ మూడ ముప్పదియు మేలుగ నేరెడ బోటి పాడునున్
మేలుగ టేకు మామిడులు మేలుగ రెండయ రాజు సంగడుల్

సూత్రధారి కొమ్మోజన ఒరహ శ్రీ శ్రీ శ్రీ
అడ పగట్లు దేవరకు జను॥

[ఈ శాసనమునకు విస్తృత వ్యాఖ్యతో గూడిన పాఠాంతర స్వార్యాస్య చర్చ, శబ్దార్థ వివరణ, శుద్ధ ప్రతియు ''నా కాకతీయాంధ్ర చరిత్ర'' యందు జూడగోరుదును]

కాకతీయులు దుర్జయ వంశస్థులు సిద్ధేశ్వర చరిత్రవలన రాష్ట్రకూటుడైన గుండ్యన ఈ వంశమున జేరి ''పెండ్లి గుండ్యన'' యైనాడని తెలియవచ్చును. మైలాంబ శాసనముగూడ ''పిండిగుండ నృపతిః తతోభవత్'' అని సామాన్యము బేర్కొనుచు, కాకతీయుల కీతని బంధుత్వమును సూచన మాత్రముగా వదలి, ''జాతోస్మాత్ గరుడాంకబేత నృపతిః తన్నామవాహోన్వయాత్'' అని చెప్పుచు, పిండిగుండన కుమారుడే మొదటి బేతన యనుచున్నది. దీనిని గుముడూరు శాసనమున గల ''కాకతివల్లభు పిన్నవాని... గరుడాంక బేత భూవిభుని... దాబరగగ చేతబట్టి...'' కామమసాని రక్షించెనను వాక్యము స్పష్టముగా సమర్థించుచున్నది.

శాసనమున్న గ్రామము గుముడూరు. [రచయిత పేర్కొన్నట్లు, ''గూడూరు''గాదు.] 1 కామమసాని యుద్ధసమయమున శత్రువుల బారినుండి తప్పించుకొనుటకై గుమ్మడిపాదలో దాగి కొనినదని సూచించుటకై ఈ గ్రామనామము [గుమ్మడియూరు–గుమ్మడూరు–గుముడూరు] ఏర్పడి యుండవచ్చును. ఈ అభిప్రాయమును అనితల్లి కలువచేరు శాసనమునన్న ''కాకత్యాః పరాశక్తేః కృపయా కూష్మాండవల్లికా కాచిత్పుత్ర మసూత'' యను శ్లోక పాదమున ఆమోదించుచున్నది.

ముదిగొండ చాళుక్యులు బేతన శత్రువులు గారు విరియాల భీమనృపతి దాడినుండి రక్షించుకొనుటకై, ముదిగొండ చాళుక్య వంశజుడైన బొట్టుబేతనకు, కాకతిపురాధిపతియగు ఎఱ్ఱనయు, అతని అల్లుడు పెండ్లిగుండ్యనయు – సాధ్యమైనంత సహాయ మందజేసిరి. తూర్పుచాళుక్యుల సామంతులు అభిమానులగు వీరు ఒకే పక్షమునకు చెందినవారు. ముదిగొండ చాళుక్యుల వంశము నిర్వంశముగాలేదు. కుకునూరు శాసనము ననుసరించి, బేతన తర్వాతవాడగు ''కుసుమాయుధుని'' ప్రథమరాజ్య సంవత్సరమున భూమిప్రఘట్టంబు పుట్టినందున తాత్కాలిక ప్రవాసమేగి, పంద్రెండేడుల తర్వాత మరలి వచ్చినట్లు తెలియవచ్చుచున్నది వీరు కాకతీయుల సామంతులై, వారి నాశ్రయించి జీవించిరని క్రీ శ 1230 లోనిదగు పాలంపేట శాసనమునగల ''నాగతి రాజు'' ప్రస్తావనవలన స్పష్టమగుచుండగా, వంశమే నశించినదని వ్రాయుట రచయిత తప్పు.

మాటేడు శాసనములోని పద్యములు వీరుదాహరించినవి గరుడాంకబేతన నాటివి గావు. కాలవ్యత్యాసము గలదు గాన వేమబోల రేవయ ప్రసక్తియు ఈ సందర్భమున దేదగదు

నేల్పుగొండ రవ్వన్నపుని పాలనలోనున్నట్లు ఈ శాసనమునవే యుండగా జూచియు రచయిత ''కాకతి బేతరాజును వేలుపుగొండలో సింహాసనమెక్కించి'' యనుటయు తప్పే యగును. పై వాక్యమున ''కొరవి మండలాధీశుని జేసి'' యని వ్రాసియున్నారు. కొరవి మండలమునకు అధీశుని నివాసస్థానము వేలుపుగొండ యగునని వీరియుద్దేశమగుచో అదియును తప్పేయగును. కొరవిలోను వేల్పుగొండలోను, వేర్వేరు వంశములవారి పాలనయున్నది.

టేకుమామిడి యనునది ఒక గ్రామము ''రెండయరాజు సింగడుల్'' అను పేరుగల భూభాగము గ్రామనామమగుచో – ''దొండయరాజుసింగరమ్ము'' [నేడు దొంగల సింగారమని పిల్వబడుచున్న గ్రామమగునా యన్నది పరిశీలింపవలసి యున్నను] అని సరిదిద్దుకొనవలసి యున్నది.

వీరికి కాకతీయులని పేరు వచ్చుటకు గల కారణము ''క్రాకళిక' యను దేవత గల్గుటయు, అదే వీరికి మూలపురుషుడగు దుర్జయుని కాలమునుండి ఉపాస్యదేవత యగుటయు, కాకాధిరూఢయగు త్రికళిక [లేక] త్రిపుర సుందరి – కాకత్రికళిక – కాకతిక – కాకతియను రూపాంతరములు జెంది – దేవీవాచక శబ్దమునుండి ఉత్పన్నమైన నామమే. [కాకతి వంశమునకే గాక] క్రాకళిక యన్నది దేశ[ప్రాంత] వాచకమునైనది. [త్రికళింగ

శబ్దోత్పత్తియు నిట్లే క్రమపరిణామ మేర్పడుటకు దోహదకారి యగుచున్నది]. ప్రస్తుత తెలంగాణములోని వరంగల్, కరీంనగర్, ఖమ్మం జిల్లాలలోని కొంత భాగమునకు ఆ కాలమున ఆ పేరుండెడిది. తెలుగు విజ్ఞాన సర్వస్వము మూడవ సంపుటములో, పశ్చిమ చాళుక్య చక్రవర్తి తైలపుడు జయించిన ప్రదేశములలో "క్రాకళిక" దేశముగూడ పేర్కొనబడియున్నది. కరీంనగర్ జిల్లాలోని "జమ్మికుంట" గ్రామమున లభించిన పశ్చిమ చాళుక్య చక్రవర్తి శాసనమునుబట్టి ఈ ప్రాంతమంతయు వారి స్వాధీనములో నుండెనని స్పష్టమగుటచే ఈ ప్రాంతమే "క్రాకళిక" దేశమని నిర్ధారించుకొనవచ్చును. 2

"భద్రంగ విద్రావణ" పద ప్రయోగము కాకతీయులను తైలపుడు జయించెననుటకు సాక్ష్యముగాదు. నేడు వరంగల్ జిల్లా జనగామ తాలూకాలో నున్న "బెక్కల్లు" గ్రామమున కానాడు భద్రంగ పురమని పేరుండెడిది నేటికిని ఆ గ్రామముననున్న ఒక శాసనమున "భద్రంగపుర వరాధీశ్వర" యని వ్రాయబడియున్నది [శాసనప్రతి ఆంధ్ర ప్రభుత్వ ప్రచురణ "వరంగల్ జిల్లా శాసనలు" అను గ్రంధమున నున్నది] కాకతి మొదటి బేతరాజు కుమారుడు ప్రోలరాజు – సమీపముననున్న కొడపర్తి, పులుకుర్తి, మున్నగు చిన్న సామంత సంస్థానముల పాలకులతో గూడ నీ "భద్రంగపుర" సంస్థానాధిపతిని జయించి, తన రాజ్యాధికారము విస్తృపరచుకొనెనని – కాజీపేట శాసనము విశదపరచుచున్నది భద్రంగి మనగా చక్రకూటము [బస్తర్ జిల్లా] లోని వైరాఘర్ పట్టణమునకు సమీపముననున్న భద్రక్, [భాండక్] అను గ్రామమని శ్రీ వీరభద్రరావుగారు తమ "కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రను"న వ్రాసిన తప్పు వ్రాతనే విశ్వసించి, అనంతర వ్యాఖ్యాతలు గూడ అది పదే పదే వల్లించినారుగాని – నాటికి చిన్న సామంతుడుగా నున్న – ప్రోలరాజెట్లు తన కంటె బలవంతుడగు చక్రకూటాధిపతిని జయించగలడని యెవరు విమర్శింపరైరి. అధిరాజగు చాళుక్య చక్రవర్తి పక్షమున పోరాడి జయించెనని చెప్పదలచినచో, నీ శాసనమున జెప్పబడినవన్నియు మిక్కిలి సమీపముననున్న చిన్న గ్రామములే యగుటయు, అదియొక్కటియే సుదూరమున, బలవంతుడగు రాజు అధికారముననున్న ప్రాంతమగుటయు అవరోధముగా పరిణమించుచున్నది. ఈ రచయితయు ఈ అభిప్రాయమును సమర్థించుట తప్పు

"ఒకవేళ తైలపునకు, బేతరాజునకు యుద్ధము జరిగియుండిన" యని ప్రస్తుత రచయిత వెలార్చిన సందేహాత్మక వాక్యము ఆధారములేనిది నలుబది మైళ్ళ పరిధిగల చిన్న సామంత రాజ్యమునకు పాలకుడు – కాకతి బేతరాజు, రాష్ట్రకూట రాజ్యము నెదిర్చి నిలచిన, తైలపుని వంటి మహా సామ్రాజ్యాధిపతి బృహత్ప్రయత్నమొనరించి జయించిన, గుజరాష్ట్ర, మహారాష్ట్ర, ఘూర్జర, యవనులను జయించెనను "సిద్ధేశ్వర చరిత్ర" వచనమతిశయోక్తి. తైలపునితో కాకతీయులకు యుద్ధమే జరిగినచో, ప్రారంభదశలోనే కాకతి రాజ్యము కూలియుండెడిది. మైత్రి పాటించియుండుట బట్టియే, తైలపుని పుత్రుడు ఇరివె బెడంగ సత్యాశ్రయుని శాసనమును "పున్నవోలు" లో [హనుమకొండకు మిక్కిలి సమీప గ్రామమమున] నుండుట తటస్థించినది

కాకతి బేతరాజు క్రమముగా గొప్పయోధుడై, కామమసాని అదుపాజ్ఞలలోనున్నట్లు భావింపవలయుననుటయు రచయిత తప్పు వయోభేదమువలన – క్రీ. శ 973 లో తండ్రి గుండ్యన మరణించిన నాటికి, 4–10 సంవత్సరముల మధ్య వయస్సుగలవాడైన "గరుడాంక బేత భూవిభుని...కాకతి వల్లభు పిన్నవాని–తా బరగగ జేతబట్టి" కాపాడిన కామమసాని వయస్సు 40-50 మధ్య నుండియున్నచో - బేతరాజు ప్రౌఢవయస్కుడై – గొప్ప యోధుడగు నాటికి, [30 40 ఏండ్లవాడగు నాటికి] బహుశ మరణించియో లేక జీవించియున్న అతి వృద్ధగనో ఉండియుండవలయును బాల్యమున తన్ను రక్షించినను, నాటికి జీవచ్ఛవమై, మృతప్రాయమైయున్న జీర్ణకాయము కామమసాని అదుపాజ్ఞలలో కాకతి బేతరాజు ఉండియున్నాడని చెప్పుట కాధారమేమియు లేదు.

నాల్గవ పద్యమునకు వీరిచ్చిన వ్యాఖ్య పూర్తిగా తప్పు. చాళుక్య చక్రవర్తి తైలపుడేగాని, "తైలపుడు కాకతీయులపై విజయము సాధించియున్నచో" కాకతీయ సామంతము తర్వాత ప్రత్యేక రాజ్యముగా, సామ్రాజ్యముగానెట్లు అభివృద్ధి జెందగలదో రచయిత చెప్పనేరరు. గాన ఈవ్యాసము "దీర్ఘకాలము విమర్శించి వ్రాసినది".

కాదని తెలియవచ్చును. కాకతీయులు చాళుక్యులకు మిత్రులై, సామంతులై, గౌరవపాత్రులైయుండియు సంపూర్ణ స్వతంత్రాధికార మనుభవించిరి. "త్రైలోక్యమల్ల వల్లభ ప్రసాదా సాదిత మహో మహిమాస్పదుడ"నని కాకతి ప్రోలరాజు [క్రీ. శ. 1052–క్రీ. శ. 1073] తన్ను నిర్దేశించిన శాసనములను ఈ రచయిత చూడ లేదని తెలియుచున్నది.

ఇక నా వ్యాఖ్యానమునకు — పూర్వ పీఠిక—జూడుడు.

ఈశాసనమున ప్రస్తావింపబడిన సంఘటనలు జరిగినకాలము క్రీ. శ 920-973. స్థలము ప్రస్తుత హనుమకొండ పట్టణమునకు మిక్కిలి సమీపముననున్న [20–40 మైళ్ళ పరిధిలో] చిన్న చిన్న గ్రామములు గుముడూరు, కొరవి, వేల్పుగొండ మున్నగునవి. ఇందు ప్రముఖ పాత్రధారులు — తూర్పు చాళుక్య చక్రవర్తి అమ్మరాజ విజయాధిత్యుని ఓడించుటకై — కుట్రజేసిన సవతితమ్ముడు — దానార్ణవునకు సహాయుడుగా, రాష్ట్ర కూట మూడవ కృష్ణరాజుచే పంపబడిన సైనికాధికారి "గుండ్యన"గాక, మిగిలినవారు ఈ ప్రాంతమున [అనగా ఆకేరు నదికి ఇరువైపుల తీరములందు, దక్షిణ ప్రాంతమున] నున్న సామంత సంస్థానాధిపతులు నలువురు.

కొఱవియందు ముదిగొండ చాళుక్యవంశస్థుడగు బొట్టు బేతనయు, సమీపగ్రామము "కాకతిపురము"న దుర్జయ వంశస్థుడగు పొరంకి వెన్న నృపతి కుమారుడు ఎఱ్ఱన కుమారుడు ఎఱ్ఱనయు [వీరి సంతతివారే తర్వాత కాకతీయులు] గుముడూరు గ్రామమున — విరియాల భీమనృపతియు [వాని సమీప బంధువు సూరనయు] వేల్పుగొండలో [కాకతి ఎఱ్ఱన సంబంధీకుడగు] కాటయనాయకుడును విషయాధిపతులుగ నున్నారు. [విషయమనగా సుమారు నలుబది మైళ్ళ పరిధిగల భూభాగము లేక అతి చిన్న సంస్థానము].

కృష్ణరాజుచే దానార్ణవునకు సహాయుడుగా బంపబడిన "గుండ్యన" కొఱవి ప్రాంతముననే సరిహద్దు రక్షణకుగాను "సంచార రక్షకభటాధికారి"గా నున్నాడు.

కథాకాలము నాటికి ముందుగా [అనగా క్రీ. శ 920–950 మధ్యకాలమున] "కొఱవి" యొక్కయు, నీ నల్వురు వ్యక్తుల యొక్కయు, పూర్వచరితమును వివరముగా జూతము.

తర్వాత కాకతీయులని పేరొందిన ఈ దుర్జయ వంశస్థులు— తూర్పుచాళుక్యుల అధికార పరిధిలోనుండిన — మంచికొండ నాడు పాలించుచుండిన — ముదిగొండ చాళుక్యుల కులస్థుడగు కుసుమాయుధుడును, అతని సంతతియు పాలించుచున్న [సామంతులుగానున్న] కొఱవికి సమీపగ్రామమున [కాకతిపురమున] నివశించుచున్నారు.

ఈ కొఱవి ప్రాంతము రాష్ట్రకూట, వేంగీచాళుక్య [పశ్చిమ చాళుక్య] రాజ్యముల సరిహద్దు ప్రాంతమైయుండి,

ఈ రాజ్యాధిపతులకు జరిగిన పెక్కు సంఘర్షణలలో—పలుమారులు చేతులుమారిన రణక్షేత్రము.

రణమర్దనుడను పేరుగల [యుద్ధమల్లుడనునది పర్యాయ నామముగాగల] గుణగవిజయాదిత్యుని సోదరుడు, మొదట ప్రత్యేక వంశముగా నేర్పడి, ప్రత్యేక రాజ్యాధికారము ప్రారంభించినవాడు గావున వానిపేర ఈ ప్రాంతము "రణమర్దకంఠియ" యనియు వ్యవహరింపబడు చుండెడిది. ఈ రణమర్దనుని సంతతివారే ముదిగొండ చాళుక్యులు. రణమర్దనుని తర్వాత కొక్కిరాజు పాలించెను. అతడు మరణింపగనే, రాష్ట్రకూట కృష్ణరాజు స్వాధీనమైన కొఱవి మండలము, కొక్కిరాజు కుమారుడు ప్రథమ కుసుమాయుధుడు సహాయము జేయగా జయించి, తనదగు వేంగీ సామ్రాజ్యమును గూడ కృష్ణరాజు దాడినుండి రక్షించుకొని, ప్రథమ చాళుక్య భీముడు [క్రీ. శ 892–922] ఆ కుసుమాయుధుని సామంతునిగా నియోగించి, అర్ధసింహాసనార్హునిగా జేసి గౌరవించెను. కుసుమాయుధుని కుమారుడగు గొణంగయ్య [గుణగవిజయాదిత్యుని పేరు మరల ధరించిన మనుమడు] కొంతకాలము పాలించి, సోదరుడు నిరవద్యుడు వెడల నడువగా వేములవాడ రెండవ అరికేసరి మహారాజు శరణుజొచ్చి, ప్రవాస కాలముననే మరణించెను. నిరవద్యుడు కొంతకాలము పాలించిన తర్వాత నీ కొఱవి మండలము రాష్ట్రకూట మూడవ కృష్ణరాజు స్వాధీనమయ్యెను.

[కొఱవి శాసనము, వేములవాడ అరికేసరి శాసనము, నాల్గవ కుసుమాయుధుని మొగల చెరువుల శాసనము, కుకునూరు శాసనము చక్కగా సమీక్షించినచో ఈ పై వివరములు యదార్థములని తెలియవచ్చును]

క్రీ. శ 965—973 మధ్యకాలమున, పశ్చిమ చాళుక్య చక్రవర్తి తైలపుడు సామ్రాజ్యకాంక్షియై విజృంభించుచున్న సమయమున, కొఱవి ప్రాంతము మరల రణక్షేత్రమయ్యెను పై జెప్పిన "విషయాధిపతులు" ప్రమాదమునకు లోనై, తమ అధికారమును సంరక్షించుకొనుటకే ప్రభువు నాశ్రయింపవలయునో నిర్ణయించుకొనజాలక పరస్పర శత్రువులై, రాజ్యకాంక్షులై, అంతఃసంఘర్షణలోనై అలజడిజెందిరి

రాష్ట్రకూట రాజ్యము తైలపుని ధాటికి పతనమగుచుండగా, తూర్పుచాళుక్య సామ్రాజ్యమునకు జటాచోడభీముని ప్రమాదము పైకొనుచుండగ ...ఈ నల్వురు విషయాధిపతులకు సంఘర్షణ జరిగిన కాలమున ... కాకతీయుల అధికారము బీజప్రాయమై, వెంటనే వికసించి, పరిస్థితు లనుకూలించుటచే, "కాకతి రాజ్యస్థాపనకు" "అంకురార్పణ" జరిగెను. గాన నిది ప్రత్యేకముగా గమనింపదగిన అంశమగును.

ఎఱియ రాష్ట్రకూటుని పాత్రుడగు గుండ్యన — రాష్ట్రకూట మూడవ కృష్ణరాజుచే, అమ్మరాజ విజయాదిత్యునకు ప్రతిస్పర్ధియగు దానార్ణవునకు సహాయుడుగా నియమింపబడి, మాంగల్లు

శాసనమున ప్రస్తావింపబడిన, వంద్యమాంబ, బేతియ, రాష్ట్రకూటుల తనయుడగు గుండ్యనార్యుడు—ఇట ప్రముఖపాత్ర వహించెను గావున అతని గత చరిత్ర గమనింపదగియున్నది.

[ఈ సందర్భమున గుముడూరు శాసనము, మైలాంబ బయ్యారము చెరువు శాసనము సమన్వయించుకొని, అర్థవివరణ గావించుకొనుట యుక్తము. మాంగల్లు శాసనము గూడ సంప్రదింప దగినదే యగును ]

కాకతి పురాధిపతియగు ఎఱ్ఱన వంశస్థులు – ఈ గుండ్యన వంశ్యుల పరాక్రమమును, అధికార దర్పమును, రాష్ట్రకూట సంఘమున నీ కుటుంబమునకున్న ప్రత్యేక గౌరవస్థానమును, గమనించి, స్నేహ సహకార సంబంధ బాంధవ్యములు నెరపుకొని, శాంతి సామరస్యములు సాధించుటకై తహతహలాడిరి. తనకు పుత్ర సంతానము లేనందున కాకతి ఎఱ్ఱన, గుండ్యన గుణగణములను, శౌర్య పరాక్రమములను, రూప రేఖా విలాసములను గమనించి, [మాంగల్లు శాసనమును బట్టి గుండ్యన రూపమున కందర్ప సముడనియు, దాన గుణము, దేవ బ్రాహ్మణ భక్తిగలవాడనియు స్పష్టమగును] ఉభయ కుటుంబములను [తద్వారా ఉభయుల రాజకీయాధి కారములను] బలములను, స్థిరపగచుకొనదలచి, కుండ్యనకు తన కుమార్తెనిచ్చి, తన తదనంతరమతని సంతానమునే తన సామంతమునకును ఉత్తరాధికారులుగా గుర్తింప నిశ్చయించెను [అల్లుడైనందుననే ''పెండ్లిగుండ్యన''యని వ్యవహరింప బడెననిమున్ను గమనించితిమి]. కొరవి ప్రాంతమున ముఖ్య సైనికాధికారిగనున్న గుండ్యన కాకతి ఎఱ్ఱన దృష్టినాకర్షించి [క్రీ శ. 915–925 మధ్య] ఎఱ్ఱన కుమార్తెను వివాహమై, – కాకతి [పారంటి] వంశమునకు–ఉత్తరాధికారియై విశేష ప్రాబల్యము గల్గియుండెను.

ఇతడు వివాహమైన నాటినుండి, తన రాష్ట్రకూట సంబంధమును వదలుకొని, అత్తవారింటి సంపద నభివృద్ధిపరచి, స్వతంత్రము ప్రకటించి, రాష్ట్రకూట, వేంగీ రాజ్యముల సరిహద్దు ప్రాంతమున ''తటస్థ రాజ్యముగా'' నుండినచో మేలగునని ఆలోచించు చుండి యుండవచ్చును. తైలపుని విజృంభణవలన రాష్ట్రకూట రాజ్యము క్షీణదశ యందుండుటయు, జటాచోడ భీముని ప్రమాదముచే వేంగీ రాజ్యము కల్లోలమగుచుండుటయు గమనించి – ఇదే అదనుగా భావించి – స్వాతంత్రమునకు ప్రయత్నించి యుండును. అంతవరకును తూర్పు చాళుక్యులతో సన్నిహిత సంబంధములు గల్గియుండి, తనలోగల అసంతృప్తిని, రాజ్యాభిలాషను, స్వార్థమును, [కాకతి, కొఱవి ప్రాంతములను పాలకుల సన్నిహితత్వము వలన తనకు గల్గిన ఈర్ష్యను] అణచియుంచుకొనిన విరియాల భీమ నృపతియు—ఇదే అదనుగా భావించుటచే—అవకాశమును విడువ నిచ్చగింపక – కొఱవిపై దాడిజేసియుండును.

విరియాల భీమనృపతి దప్ప, తక్కినవారు త్రికరణశుద్ధిగా తూర్పు చాళుక్యుల సామంతులై యుండిరిగాన, అందునను కొఱవి యందున్న బొట్టుబేతన [చిరకాల సంబంధము వలన] కుసుమాయుధుని సంతతి యగుట వలనను, తాను దానార్ణవునికి ఒకాడగుట వలనను, బేతన గుండ్యనల సన్నిహితత్వము బలమై యుండి యుండును. భీమనృపతి దాడిజేయగా – బేతనకు సహాయుడైనిల్చి గుండ్యన యుద్ధరంగమున మరణించియుండును. బొట్టు బేతన అధికారమును గోల్పోయియుండును.

అల్లుడు మరణింపగా, అతని మిత్రుడు రాజ్యభ్రష్టుడు గాగా, జూచి వృద్ధుడయ్యును, కాకతి ఎఱ్ఱన విజృంభించి, ప్రతీకార వాంఛ ప్రబలముగాగా లభించిన నూతనోద్రేకమున, భీమనృపతిని జంపి, తిరిగి బొట్టు బేతనను ''కొరవి యందు ప్రతిష్ఠించెను.'' వెంటనే భీమనృపతి బంధువైన సూరన – [ధారిలో తన్నడ్డగించిన వేలుపుగొండ కాటయ నాయకుని, కాకతి ఎఱ్ఱన సంబంధికు డగుట చేత – చంపివైచి] ఎఱ్ఱనపై ప్రతీకార చర్యగా దాడిచేయగా ఎఱ్ఱన మరణించెను. అట్టి క్లిష్ట సమయమున, ఎఱ్ఱన భార్య కామసాని, సూరన బారినుండి [గుమ్మడిపొదలో దాగుకొని, ఎట్లో తప్పించుకొని] పారిపోయి వచ్చి, – తూర్పు చాళుక్యులు జటాచోడ భీమునితో యుద్ధమున మునిగియున్నందునను, వారి సామంతులగు కుసుమాయుధుని సంతతివారు – [బొట్టు బేతన సంబంధికులు ప్రవాసముపోయిరని కుకునూరు శాసనము జెప్పుననియు ముందు గమనించితిమి] నిస్సహాయ స్థితిలో నున్నందునను, తన అల్లుడు రాష్ట్రకూటులతో సంబంధములు ఏనాడో వదలుకొనుటచేతను, రాష్ట్రకూటులు ప్రస్తుతము తైలపుని వలన యుద్ధమున తలమునకలు మునిగియున్నందునను వీరెవ్వరును సహాయము జేయజాలరని గుర్తించినదై ... ఎట్లో హనుమకొండ జేరి – అనాడచ్చట నున్న లకులీశ్వర పాశుపత శైవాచార్యుల ఆశ్రమమున ఆశ్రయము నొంది, వారుపాసించుచున్న దుర్గయే, తమ కులదైవమగు కాకతి యనియు, యాకె మేల్గలదనియు [ఆమెయే మేలు గలిగించగలదని విశ్వసించి] వారి సహాయమున, అనగా తమకు అబిమాన దైవమగు [గోపీ జన] వల్లభరాయని యోగి శరణము జొచ్చి, ఆ లకులీశ్వరాగమ సిద్ధాన్త రసామృత రసాస్వాదియగు మొదటి రామేశ్వర పండితుని, అతని అంతేవాసియగు మంత్రకూట గోపీజనవల్లభరాయని భక్తుడూ, శుద్ధాగమాన్త శైవపీఠాధిపతియునగు, సురేశ్వర పండితుని సహాయమున, వారి ప్రబోధము వలన, తైలపుడు విజయుడగుచుండుట గమనించి, తానును తైలపుని ఆశ్రయించి, ఆతని రాజకీయరక్షణ ప్రోద్బలమున, తన ''విషయాధికారము'' నిల్పుకొన నుద్యమించినదై, కాకర్త్యగుండ్యన కుమారుడును, తనకు మనుమడును గావున, తమ[ఉభయులకు] వంశాంకురమగు ''గరుడాంక బేత భూ విభుని'' ''కాకతి వల్లభు పిన్నవాని'' సంరక్షించుకొని, తిరిగి తమ గ్రామమునుజేరి, కులమును, వంశమునేగాక తమ కులదైవమగు ''కాకతి''ని గూడ పునః స్వాధీనపరచుకొని, సంతుష్టి నొందినది గావున ''కాకతి నిల్పుట'' [''అనంతకోటి పుణ్య ఫలదం జీర్ణాలయోద్ధారణం''అను ఆర్యోక్తికి ఉపలక్ష్యముగా] కోటికి విలువైన పని చేయుట యగునని శాసనకర్త యనుచుండగా – ''కోటి సేయుదే'' యని సంప్రశ్న మొనర్చుచుండగా – కాదనగల సమర్థులే లేరుగదా.''

ఇది గుదూరు శాసనమునకు పూర్వాంగమగు పీఠిక. ఇప్పుడు గుముడూరు శాసనము జదివిన, పూర్వాపరసందర్భములతో గూడ చక్కగా నర్థమగును.

## అధో జ్ఞాపి క లు

1 ప్రస్తుతమీ గ్రామము గూడూరనియే వ్యవహరింపబడు చున్నది గాన రచయిత వ్రాత సరియగుచున్నది.

2 క్రాకళిక – కాకతియను పేర్లెట్లు ఏర్పడినవో, సూత్ర శాస్త్ర, పురాణసమ్మతములగు సాక్ష్యాధారముల సహాయమున ఉత్పత్త్యర్థ విశేషములతో నిరూపించియున్నాడను అట్లే కాజీపేట శాసనమునగల శివపుర, కాకతిపురములను గురించియు, నా పరిశోధనలవలన లభించిన నూతనాంశముల సహాయమున, నిస్సంశయముగ వివరించియున్నను. ప్రస్తుతమా ప్రసక్తి గ్రంథవిస్తర భీతి పరిహరింపబడుచున్నది.

శ్రీ కృష్ణాది కొండయ్య

జూన్ 78 సంచికలో శ్రీ పి. వి పరబ్రహ్మశాస్త్రిగారు వ్రాసిన "సిముక సాతవాహనుడి నాణాలు" అన్న వ్యాసం చాల ఆసక్తికరంగా ఉన్నది శాస్త్రిగారు సిముక శాతవాహనుడివని చెప్పే, ఒకవైపు తొండం పైకెత్తి ఎడమపక్కగా నిలబడియున్న ఏనుగు, మరొకవైపు ఉజ్జయిని చిహ్నం గల నాణాలు కొన్ని మా గ్రామంలో దొరకినవి మా గ్రామం అర్కవరం. నల్లగొండ జిల్లాలో సూర్యాపేటకు సమీపంలో గల నక్రేకల్‌కు 10 మైళ్ళ దూరంలో ఉన్నది. దీన్ని ఇప్పుడు ఆకారం అని పిలుస్తారు ఇక్కడ కాకతీయ శిల్పంతో కూడిన సూర్యదేవాలయం కలదు. సూర్యునికి మరో పేరు అర్కుడు. ఈ అర్కదేవుని పేరుమీదుగానే ఆ ఊరికి అర్కవరం అనే పేరు వచ్చిందంటారు. ఆ దేవాలయం ప్రాంగణం బయట ఒక పెద్ద వినాయక విగ్రహం కలదు. ఆ వినాయకుడు పెద్దబొజ్జతో చాళుక్య శిల్పపద్ధతిలో మలచబడినాడని నా అభిప్రాయం. అంతేగాక ఆ దేవాలయం చుట్టూ గల చెలకలో దున్నుతూ ఉంటే చిన్న చిన్న రాతి విగ్రహాలు దొరుకుతూ ఉంటాయి అల్లా దొరికిన ఒక 7, 8 సెంటిమీటర్ల ఎత్తుగల వినాయకుడి విగ్రహం కూడ చాళుక్య వినాయకున్ని పోలియున్నది. ఈ దేవాలయానికి కొద్దిదూరంలో ఇప్పుడు అర్కవరం గ్రామం ఉన్నది. ఈ గ్రామంలో ఒక మట్టికోట కలదు. నా చిన్నప్పుడు నాలుగువైపుల నాలుగు మట్టి బురుజులు, ఆ బురుజులను కలుపుతూ చాల ఎత్తైన, దళసరియైన మట్టిగోడలు ఉండేవి బురుజులు, గోడలు కాలపు తాకిడిచే కూలిపోగా మిగిలినవానిని ఆ గ్రామప్రజలు త్రవ్వి ఆ మట్టిని తమ పొలాల్లో ఎరువుగ ఉపయోగించుకుంటున్నారు. ఆ మట్టి పోస్తే పంట బాగా పండుతుందని వారంటారు. ఆ మట్టికోటను అలా త్రవ్వుతుండగా ఒక మట్టి ముంతలో కొన్ని నాణాలు దొరికినవి. ఈ నాణాలను గూర్చి ఒకరిద్దరు చరిత్ర ప్రొఫెసర్లతో ప్రసంగించగా వారు వాటిని గూర్చి శ్రద్ధచూపలేదు ఆంత్రోపాలజిస్టు అయినా భారతీయ ప్రాచీన చరిత్ర నాణాలు అంటే అభిరుచి గల మా జర్మన్ స్నేహితుడు ఊవే బ్యోర్న్ ఆబెల్స్‌గారు రెండు నెలల క్రితం భారతదేశం వచ్చినపుడు వాటిపై చాల శ్రద్ధచూపి కొన్ని నాణాలను జర్మనీ తీసుకొనిపోయినారు శుభ్రంగా కడిగి వాటిని గూర్చి మాకు తెలుపుతానని ఆయన చెప్పినాడు. ఆయన జాబు త్వరలోనే రాగలదు. అయితే శాస్త్రిగారి వ్యాసం చదివిన తరువాత వారు చెప్పిన లక్షణాలనుబట్టి ఆ నాణాలు 'సిముక సాతవాహనుడి'వని తెలుస్తూ ఉన్నది అంటె ఆ నాణాలు దొరికిన అర్కవరప్రాంతం కూడ శాతవాహన (స్వతంత్ర) రాజ్య స్థాపకుడగు సిముక సాతవాహనుని పరిపాలనలో ఉండెనని తెలుస్తున్నది.

— డా. ముదిగంటి సుజాతారెడ్డి

## లేఖలు

డా. ముదిగంటి సుజాతారెడ్డిగారియొద్దనున్న నాణెములను కొన్నిటిని పరిశీలించితిని. అవి కొన్ని సివసిరి పుళుమావి అనే పేరు గల సాతవాహన రాజువి. గౌతమీపుత్ర శాతకర్ణి తర్వాత అతని పుత్రుడు వాసిష్ఠీపుత్ర పుళుమావి (పుళుమావి II), ఇతని తర్వాతి సివసిరి పుళుమావి (పుళుమావి III) రాజ్యము చేసినట్లు పురాణములలో జెప్పబడెను. ఈ పుళుమావి సుమారు క్రీ శ. 150 ప్రాంతములో రాజ్యముజేసెను. ఇతని నాణెములు ఇతర ప్రాంతములలో కూడ దొరకెను. ఇతనిని చరిత్రలో 'శివసిరి' అని మాత్రము పిలుచుదురు, మరికొన్ని నాణెములపైన 'సాతకర్ణి' పేరు కలదు అక్షరములు క్రీస్తుశకము రెండవ శతాబ్దివి గనుక ఈ నాణెములు కూడ పై జెప్పిన మూడవ పుళుమావికి సమీపమునందున్న శివస్కందసాతకర్ణి గాని, మరొక సాతకర్ణిగాని కావచ్చును నాణెములు చెడిపోవుటచే పేర్లు సరిగా గుర్తింప వీలుగకున్నవి అన్ని ఒకే విధముగ గుండ్రముగను, బరువుగను, పోతపోయబడి యున్నవి. సాతవాహన వంశములో తుది రాజులకు చెందినవి. నాణెములను పరిశీలించుట కనుమతించినందుకు శ్రీమతి సుజాతారెడ్డిగారికి కృతజ్ఞతలు తెలుపుచుంటిని

శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

## సంప్రదాయం

జూన్ '78 'భారతి' సంచికలో శ్రీ సి. ప్రభాకర్‌గారు "సంప్రదాయం"పై వ్రాసిన వ్యాసం(ముక్క!) చదివాను. ఏది వ్రాసినా, చేసినా, మనం అర్థంచేసుకునే పద్ధతిలో కూడా కొంత తేడా వుంటుంది. వేదాలు, ఉపనిషత్తుల్లో ప్రతిపాదించబడిన 'సంప్రదాయం' ఒక వర్గంచేతనే అధ్యయనం చేయబడుతూ, సంఘంలోని మిగతా అసంఖ్యాక వర్గాలవారికి అందుబాటులో లేకుండా చేయబడింది అన్నారు; వివరణ మెచ్చుకుంటూనే!

అందుబాటులో లేకుండా చేయబడింది పూర్వం అని అనుకున్నా; గత ముప్పయి వత్సరాలుగా బ్రాహ్మణాధిక్యతపోయి, మిగతా అసంఖ్యాకవర్గాల వారికే అన్నిటా, అన్ని సదుపాయాలూ కల్పింపబడి, ఏ నవారు వారికోసమే సర్వం ఖర్చుబెట్టి, యితరుల సుఖాన్నీ, అర్హతలనీ పురిదీస్తున్నారే! మరి యింతకాలం వీళ్ళు ఏం చేస్తున్నట్టు? ఔను మరి! శంఖులో పోస్తేనే తీర్థం బ్రహ్మ ముఖము నుండి వెలువడిందే వేదం. వీరికి 'బ్రాహ్మణాధిక్యతే' సంప్రదాయంగా కనబడినట్టున్నది. ఒక్క వ్యాసుడెవరో వీరికి తెలియదేమో! 'అక్కసు' అభ్యుదయమైతే, బ్రాహ్మణాధిక్యతే సంప్రదాయమై తీరుతుంది. తథాస్తు!

**శ్రీ ములుమూడి ప్రసాదరావు**

# శ్రీనాథుని జన్మస్థలం

'భారతి'–జూన్ 1978 సంచిక–కలగూరగంపలో శ్రీ ఇల పావులూరి శేషగిరిరావుగారు ''శ్రీనాథుని జన్మస్థలం'' అన్న శీర్షికతో వ్రాసిన అంశాలు కేవలం ఊహాగానాలు శ్రీనాథుడు అద్దంకి సీమలో కొన్నాళ్ళు నివసించి యుండవచ్చు కాని కొండవీటిలోను, రాజమహేంద్రవరంలోను ఆతని ప్రాభవ వైభవాలు విస్తరిల్లి, ప్రఖ్యాతి కెక్కిన సంగతి యెల్లరకు తెలిసినదే. కనుక ఆతడు అద్దంకిసీమకు మాత్రమే పరిమితమైనట్లు చెప్పరాదు. ఇక ఆయన జన్మస్థలం ఆనాటి కాల్పట్టణమనీ, అది యిప్పటి ''కొలచనకోట'' అనీ చెప్పడం అసమంజసం. శ్రీనాథుడు తన తాత వారిధి తటీ కాల్పట్టణాధీశుడని చెప్పుకొన్నంతమాత్రాన ఆ కాల్పట్టణం కాని యీ ''కొలచనకోట'' కాని వారి జన్మస్థానం కాజాలదు కమలనాభామాత్యుడా పట్టణంలో రాజకీయోద్యోగం నిర్వహించాడని స్పష్టం. రాజకీయోద్యోగి ఆ వూళ్లోనే పుట్టియుండనక్కరలేదు. మేధావియు, సమర్థుడు నైనవాడు ప్రభుత్వోద్యోగం చేపట్టి యెక్కడికైనను పోయి యుండవచ్చు. ఇప్పటివరకు శ్రీనాథుని జన్మస్థలాన్ని గూర్చి చరిత్రకారులూ, సాహిత్య పరిశోధకులూ యిదమిద్ధంగా ఒక నిర్ణయానికి రాలేకపోయారు. పొన్నపల్లి తామ్రశాసనం చూచినవారికి శ్రీనాథుని జన్మస్థలం సులభంగా, సుస్పష్టంగా తెలియగలదు పొన్నపల్లి యీశాన్య సరిహద్దుల్లో తన భూమియున్నదని శ్రీనాథుడే ఆ శాసనంలో వ్రాసుకొన్నాడు. ''శ్రీనాథ భట్టరు శాసనాచార్య దక్షిణభాగం వకటి'' అన్న వాక్యం వున్నది. కనుక శ్రీనాథుని జన్మస్థలం పొన్నపల్లి అది గుంటూరు జిల్లా రేపల్లె తాలూకాలో చందోలు–భట్టిప్రోలు రోడ్డుమీద వున్నది దానికి పడమరగా మూడు మైళ్లలో పూర్వం దగ్గుపల్లి వుండేది

అది యిప్పుడు నామావశిష్టమై గోవాడ బాలకోటేశ్వర క్షేత్రంగా ప్రసిద్ధికెక్కి యున్నది. ఇదే నాసికేతోపాఖ్యానకర్తయు, శ్రీనాథుని అనుంగు మరదియునైన దగ్గుపల్లి దుగ్గన్న జన్మభూమి. ఈ దగ్గుపల్లి గోవాడ కైఫియత్తులోను, సదాశివదేవరాయల తామ్రశాసనంలోను పేర్కొనబడి యున్నది. ఇంతకు — శ్రీనాథుని యొక్కయు, అతని పూర్వీకులయొక్కయు జన్మస్థలం ''పొన్నపల్లి'' అనీ, శ్రీనాథుని అత్తవారి వూరు గోవాడ (పూర్వపు దగ్గుపల్లి) అనీ మనవి చేయుచున్నాను. విజ్ఞులింకను పరిశీలింతురుగాక!

**విద్వాన్ తుమ్మల వెంకటరత్నము**

# మరుపూరు విమర్శనా ధోరణి

జూన్ 78 'భారతి'లో ''శ్రీ రామచంద్రిక పద్యకావ్యాన్ని'' విమర్శ చేయుటలో మరుపూరు కోదండ రామరెడ్డిగారు తప్పటడుగు వేశారని చెప్పకతప్పదు.

ఇది రామాయణ కథాసారం. కొత్త పోకడలతో చెపుతానని కవి శపథం. పెద్ద పాత్రల జోలికి పోకుండా ఋష్యశృంగుడుతో మొదలుపెట్టి పరమేష్టితో పూర్తి గావిస్తారు. అగ్గిపుల్ల, సబ్బుబిళ్ల కథా వస్తువులైన ఈ రోజుల్లో గూడా చిన్న పాత్రలతో రామాయణాన్ని పల్కించడం గొప్పా? రారాజి, వి.వి యస్ అయ్యర్ (ఇంగ్లీష్) రామాయణాన్ని నడిపించిన పద్ధతి ఇట్లే పాత్రాను గుణంగా ఉందని మీరే అన్నారే ఒక చతురుడు తన ముక్కు ఎక్కడుందో చూపడానికి ముప్పదారు రకాల చూపాడట. అలాగే అనిపిస్తుంది రామాయణాన్ని పలుపోకడలతో చెపుతానని శపథాలు చేయడం. ఇంతకంటే పాడిందే పాడరా పాసుపండ్ల దాసరి నయం కదూ? శ్రీరామ చంద్రికలో పాత్రలు ఉత్తమ పురుషలో కథ చెప్పి, సొంపు గూరుస్తున్నాయంటారు. ఒక దొర గురించి పాలేరు ప్రథమ పురుషలో చెప్పగలడా పోనీ ద్వితీయ పురుషలో. ఇక్కడా అంతే. కవి దృష్టిలో రాముడు దేవుడు. పూజ్యనీయుడు. కవి సృష్టించిన పాత్రల దృష్టిలోనూ అంతే.

విషయసూచిక ఉంటే చదువరికి సులభంగా ఉండేదంటూ ముగించిన మీ విమర్శనా ధోరణికి జోహార్లు మరుపూరుగారు 'శ్రీరామ చంద్రిక'ను మరోమారు తీసుకొని పరిశీలిస్తే మంచిది. అందులోని పాత్రలు తమ సొంత గొడవను విన్పించడం లేవు, రామ కథనే తెలియ పరుస్తున్నాయి. పాఠకులు తప్పుత్రోవ పట్టకుండా ఉండడానికనే కవి అష్టకాలగారు విషయసూచిక ప్రచురించలేదేమో? అయినా ముఖ పత్రములోని పూవు చుట్టూయున్న రెక్కల్లో ఆయా పాత్రల్ని చిత్రకారుడు చిత్రీకరించాడు బహుశా మీరు గమనించలేదేమో?

మరుపూరుగారూ విప్లవ వాదులంటే మీ కెందుకంత అయిష్టం? వారేమైనా నడిబజార్లో నిలేసి మిమ్మల్ని దుమ్ము దులిపారా? విప్లవవాదులు కాగితం వేస్ట్ అంటే మహా బాధపడిపోతున్నారా? కాగితం విలువ తెలియని మిమ్ముల చూస్తుంటే ఆంధ్రప్రదేశ్ విద్యా శాఖామాత్యులు జ్ఞప్తికి రాకమానరు. రెండవ తరగతి పుస్తకాల అచ్చుకు కాగితం లేదు కాని ఆంధ్రప్రదేశ్ లాంటి పత్రికల ప్రచురణకు కాగితం బోల్డంత. (అది తమ ప్రగతి ప్రచారక కేంద్ర మవడమేనేమో ?) ఇంకా కేంద్రాన్ని తప్పు పట్టడాలు. అలాగుంది మన వ్యవస్థ.

రామ బాణాలు, రమణుల బాణాలు ఈ జన్మాన్ని కర్మసిద్ధాంతం వైపు మళ్ళించడానికే. ఈ దేశాన్ని నిస్సత్తువతో నడిపించడానికే.

అహంకారి ఆడదైన ఇందిర (జనతా పార్టీపై) ఏదుపులా ఉంది మీ విప్లవాదులపై దేబిరింపు. ఇక రాముడు అవతార పురుషుడో, అధికార మదాంధతతో వెలుగొందిన భగవంతుడో మీరూ, నేనూ కళ్ళతో చూడలేదు ఇంకెందుకండీ ఈ ప్రచారాలు. బాకాలు ఊదడాలు. ఉడుగన్ కేశవదాస్ రచించిన రామాయణము పేరు రామచంద్రిక. ముందర శ్రీ తగిలించుకొనియున్న శ్రీరామచంద్రిక అష్టకాల గారిది. కావ్యానికి నామకరణము చేయడంలో కూడా కాపీ చేయక తప్పలేదు కవిగారికి. ఇకనైనా మరుపూరుగారు కావ్య విమర్శను విడనాడి, విప్లవ వాదులపై దూకడం మానుకుంటే మంచిది.

**శ్రీ కె. అంజయ్య**

# శ్రీనాధుని జన్మస్థలము "పాకలే"

జూన్ నెల 'భారతి'లో — పరిశోధన పరమేశ్వరులు, సాహితీ మిత్రులగు శ్రీ ఇలపావులూరి శేషగిరిరావుగారు కవిసార్వ భౌముడగు — శ్రీనాధుని జన్మస్థానము ప్రకాశం జిల్లాలో గుండ్లకమ్మ నదీతీర మందుండు "కొలసనకోట" గ్రామమని తమ యూహలతో నిర్ణయించినారు. ఆ లేఖ చూచినపిదప ఈ నాల్గుమాటలు వ్రాయవలయు ననిపించింది.

(1) పాకల గ్రామ వాస్తవ్యులైన శ్రీ వాసాలక్ష్మి నారాయణరెడ్డి గారు — శ్రీనాధుడు తమ గ్రామస్థుడేనని 77 మార్చిలో ఒక చిన్న గ్రంధమును రచించి — దాని యావిష్కరణను పురస్కరించుకొని — "శ్రీనాధ జయంతి" జరిపి, శ్రీ శేషయ్యగార్ని ఘనముగా సన్మానించినారు. నాకును ఆ సభలో పాల్గొను భాగ్యను కలిగినది. ఆ గ్రంధమున వారు - తమకడ పురాతనమైన వ్రాత ప్రతిలో — "కనకక్ష్మాధరధీరు ... వార్ధి తట పాకలే పట్టణాధీశ్వరు..." అను పాఠాంతరమున్నదని తెలుపుటేగాక, శ్రీనాధుడా గ్రామవాసియే యనుటకు తగిన యాధారములను — శ్రీనాధ కావ్యముల నుండియే చూపినారు వలయువారు : శ్రీ రెడ్డిగారి పేరు, పాకల, కందుకూరు తాలూకా, ప్రకాశంజిల్లా అని వ్రాసి యుచితముగా పొందవచ్చును. కాన—శ్రీ "రావు" అభిప్రాయం ప్రకారము గాక — పాకల వాడని తేలినది కదా!

2. పాకల, చాల పెద్ద గ్రామము. సాహితీ సంపన్నులకు నిలయము. ముక్కారు పండు బంగరు భూములు. సముద్ర వ్యాపారమునకు అనువగు రేవు పట్టణము (నేటి శిధిలమైనది) ఆ కాలముందు వ్యాపారము వడవలద్వారా ఇతర దేశములకు—ఎగుమతుల — దిగుమతులు జరుగుచుండెడివి కాన — వాని చిహ్నములు ఇప్పుడక్కడక్కడ కనుపడుచున్నవి: "చందనాగరు గర్పూర హిమాంబు కుంకుమ రజః కస్తూరి కాద్రవ్యము" లు తెప్పించిన 'వైశ్య కులోత్తముండగు అవచి తిప్పయశెట్టి పాకల పరిసర గ్రామ వాస్తవ్యుడై యుండి నెల్లూరు మున్నగు పెద్ద పట్టణములలో వ్యాపారము నెరపుచుండి యుండును. నేడు 'పాకల', 'ఊళ్ళపాలెం' మున్నగు గ్రామములందలి వైశ్యవరులు మద్రాసు మున్నగు నగరములలో వ్యాపారము చేయుచుండుట మన మెరుగుదుము కదా! అట్లే.

అందుననే శ్రీనాధుడు తనకు బాల సఖుడైన అవచితిప్ప ప్రభుని — ఉదారతయు, గంభీరతయు, సదాచారతయు విశేషించి తనకు సమీప గ్రామస్థుడగు, వానికి తన హరవిలాసమును కృతి యిచ్చియుండును కాన, కృతి కర్తయు, కృతిభర్తయు, ఒక్క మండలివారే! యగుట — సువర్ణ సౌరభ సంయోగ మొందినట్లైనది. ఇంకను పరిశీలకులు పరిశీలింతురుగాక!

"కందుకూరు తాలూకా పాకనాటి చరిత్ర" అను గ్రంధమున రచించిన — ఆనందపుర గ్రామవాసి — శ్రీ తలపనేని చెంచయ్య గారు — తమ గ్రంధమున ప్రాచీన కవుల పరిచయము చేయుచు శ్రీనాధుని — కందుకూరు తాలూకా పాకల వాడనియే వ్రాయుచు—తమ కడ తాళ పత్రమున 'కనక...వార్ధితట పాకలే పట్టణమనియే' యున్నదని వ్రాశారు. (పే. 115) ఇది ఈ వత్సరమున వెలసిన గ్రంధము. దీని ననుసరించి జన్మస్థానం శ్రీనాధునిది — పాకలనియే ధృవపడుచున్నది కదా!

3. నెల్లూరు మండల సర్వస్వమునందు — శ్రీమాన్ నవులూరి మాలకొండయ్య పంతులవారు— ఈ పాఠమునే బలపరుచుచు తమ వ్యాసమును సాగించిరి.

నా ప్రార్ధనయేమన్న — శ్రీ రెడ్డిగారి గ్రంధమును పరిశీలించి పాకల గ్రామమును సందరిసించినచో — పై యూహలు, అపోహలు తొలగి — శ్రీనాధుని జన్మస్థానము — పాకలనియే నిశ్చయము కాగలదని, నేను చూచితి కొన్ని సత్యములనియే అనిపించినది.

శ్రీ రావుగారన్నట్లు, (కొలసనకోట కాకపోయినను) పాకల వాడైనందులకు — ఆ మహాకవి కన్నందుల ధన్యము కాక ధన్యతమ యని నాయభిప్రాయము. శ్రీ రావుగారు ఒక పర్యాయము పాకలను సందర్శింప కలరని ప్రార్ధన.

**— విద్వాన్ కొమాండూరి రామానుజాచార్యులు**

# గ్రంథ విమర్శలు

## మిశ్రకృతి

[రచన : శ్రీ గుంటూరు — శేషేంద్రశర్మ, క్రౌను 43+42+71 పుటలు, వెల 4 రూ లు. దొరకుచోట్లు —(1) విశాలాంధ్ర బుక్ డిపో, విజయవాడ, ఆదితరశాఖలు. (2) ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాదు. (3) సి. ఎల్. ఎస్. బుక్‌షాపు, స్టేషన్ రోడ్డు, హైదరాబాదు.]

శేషేంద్రశర్మగారు అనేకరంగాలలో సవ్యసాచులు. ప్రాచీన నవ్య కవిత్వాలలోను, కథలలోనూ, శాస్త్రాలలోను, ఆంధ్రాంగ్ల కవితలలోనూ, ఆశుధారా — ప్రాసంగిక కవిత్వాలలోనూ — బహుముఖంగా రచనలు సాగించే ప్రజ్ఞాధురీణులు. ఆయన యిదివరలో ముద్రింపించి ప్రకటించిన ఒక గద్యపద్యాత్మక కృతి, ఒక నాటిక, కథా చతుష్టయం. ఇప్పుడు సమష్టిగా — మిశ్రకృతిగా ప్రచురింపబడ్డాయి.

చంపూ వినోదిని గద్య పద్యాత్మకమైన కృతి. నిజంగా అది వినోదాన్ని కలిగించే చంపూ ప్రబంధమే. ఇందులో గద్యభాగం వ్యావహారికంలో ఉన్నది. పద్యాలు ప్రాచీన కవితా పద్ధతికి చెందినవి. ఆ యా సంవత్సరాలలో జరిగిన సంఘటనలు, వాటికి సంబంధించిన పద్యాలు శృంగార, హాస్యాది రసాలకు సంబంధించినవి ఉన్నవి. కవి పేరు చెప్పకపోయినా — యివన్నీ రచయితకు సంబంధించినవనే గ్రహించవచ్చును.

1947 లో కాలేజీలో విద్యార్థిగా ఉన్నప్పట్నుంచీ ఆ యా సందర్భాలలో చెప్పిన పద్యాలు — కొన్ని అధిక్షేపణలు, డోస్‌లు — ఎంతో అనుభవజ్ఞులైన కవుల పద్యాలవలె ఉండి, తిరుపతి వెంకట కవుల ధోరణిని తలపిస్తున్నవి. ఇది తొలిసారి 1961 లో ప్రకటితమైనది. ఈ రచనను బట్టి చూస్తే అప్పటికి శేషేంద్రశర్మగారికి 'నవ్యకవిత్వం' అంత అభిరుచి ఉన్నట్లు కానరాదు. 1954 నాటికి దానిమీద గౌరవం అణుమాత్రం లేదు. వార్తాపత్రికల్లో వార్తలు తీసుకుని కత్తిరించి, కిందామీదా చేసి రీ ఎరేంజి చేస్తే కవిత్వమైపోతుందనీ, అర్థం వున్నదా, లేదా అని చూడనక్కర్లేదనీ ఆక్షేపించారు కూడా. అయితే నవ్యకవిత్వంలోనూ, వచన పద్యాలలోనూ ఈయన ఇప్పుడు అగ్రశ్రేణిలో ఉన్నారు తొలిసారి 1961లో ముద్రితమైన యీ చంపూ రచన ఈ 'మిశ్ర కృతి'లో 1977 లో పునర్ముద్రిత మయింది.

"మబ్బుల్లో దర్బారు" ఒక నాటిక. ఇందులో రెండు రంగాలున్నవి. రెండవ రంగమే 'మబ్బుల్లో దర్బారు'. మొదటి రంగం మానవ మహాచక్రవర్తి దర్బారు. దానికి ముందు పంచ భూతాల విష్కంభం ఒకటి ఒక పుటకు పైగా ఉన్నది. పంచ భూతాలను లోబరచుకొని దురాశాపరుడు, స్వార్థపరుడు అయిన మానవుడు అన్ని ప్రాణులనూ తన సుఖం కోసం వినియోగించుకోవడం, అతని దౌర్జన్యం, వక్రబుద్ధి ఇందులో ఎంతో హృద్యంగా చూపబడినవి. రచయితకు గల దూరదృష్టికీ, సత్యాన్వేషణకూ ఇది తగిన తార్కాణ. ఇదివరలో ఇది రెండు కూర్పులు పొందింది.

మూడవది కథా పంచకం. విప్లవ, హిరణ్మయి, రంగుల చేప, హరిణ ఎగిరిపోయిన హంస ఈ విభాగంలోని కథలు. మొదటి కథ పేరే శీర్షికగా స్వీకరించ బడింది. ధనిక — దరిద్ర వర్గాలకు చెందిన యిద్దరు పసిబాలికల మనస్తత్వం, అన్యోన్య ప్రేమ గౌరవాలు ఉన్నతస్థాయిలో ఇందు చిత్రించబడినవి. పసిపిల్లల అమాయక మనస్తత్వాన్ని గ్రహించడంలో రచయితకు గల దక్షతను ఈకథ వెల్లడిచేస్తున్నది. ఇవి యీ కథలన్నిటికీ మకుటాయమానం. హిరణ్మయి ప్రేమించిన ప్రేమికుడు ఆమె ప్రేమను తిరస్కరించి, తనకు వృద్ధాప్యం వచ్చేక మనస్సు మార్చుకోవడం, ఈలోగా ఆమె మనస్సు మారడం రచనా చమత్కృతిని స్పష్టం చేస్తున్నవి మగవాని హృదయ దౌర్బల్యం, మహిళకుండే ఆత్మాభిమానం పరాకాష్ఠను అందుకొన్నాయి. 'రంగుల చేప' పుత్రప్రేమ ఎట్టిదో తెలుపుతున్నది.

"హరిణ" స్కూళ్ల యిన్‌స్పెక్టరు కొడుకు తన్ను వశం చేసుకోడానికి పెడుతున్న బాధలను సహించలేక ఆత్మాహుతి చేసుకున్న బడిపంతుల భార్య దయనీయ గాథను తెలిపే కథ. హరిణ ఈ విషయాన్ని భర్తతో చెప్పక ఆత్మాహుతి చేసుకునే ముందు వ్రాసిన చీటీవల్ల భర్తకీ విషయం తెలిసింది. అధికార మదాంధుల కిది గుణపాఠాన్ని బోధిస్తుంది.

పసివాడైన దుర్గాప్రసాద్ తన మిత్రురాలికి చేసిన వాగ్దానాన్ని నెరవేర్చడానికి భారత—చీనాలకు సరిహద్దు ప్రాంతంలో జరుగుతున్న యుద్ధరంగానికి బయలుదేరుతాడు. ఆంధ్రదేశంనుంచి ఆ పసిబాలుడు తవాంగ్ చేరడం అస్వాభావికంగానే ఉంది. రచయితకి కూడా ఇది ఆశ్చర్యంగానే తోచింది మరి. యుద్ధరంగంలో ఆ బాలుడు చూపిన ధైర్యసాహసాలు, కార్యసాధన కోసం ఆత్మార్పణ అస్వాభావికంగా ఉన్నవి. భాషా సమస్య తీరనేలేదు. మరి అక్కడివారీ బాలుడి భావాలను తూ, చా తప్పకుండా ఎలా గ్రహించారో! ఏది ఎలా ఉన్నా ఆధునిక యుద్ధ పద్ధతులు, వ్యూహరచన కళ్లకు కట్టినట్లు శేషేంద్రశర్మగారు వర్ణించారు ఈ 'మిశ్రకృతి' వివిధ మనస్తత్వాలను, వివిధ వయస్సులలోని వాటిని, చిత్రిస్తూ పాఠకుల మనస్సును బాగా ఆకర్షిస్తున్నది.

## సౌందర్యలహరి

[శ్రీ శంకర భగవత్పాదుల సంస్కృతి మూలమునకు శ్రీ గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యంగారి ఆంధ్రానువాదం. డెమ్మీ

సైజు 10+43+20 పుటలు, వెల 3 రూ. [ప్రకాశకులు— శ్రీ గుట్టిము వేంకటసుబ్రహ్మణ్యం, సాహితీ సమితి, వేదంవారి అగ్రహారం, నెల్లూరు.]

శ్రీ శంకర భగవత్పాదుల అసంఖ్యాక కృతులలో స్తుతిరూప మైన యీ సౌందర్యలహరి ఒక్కటి. నూరు శ్లోకాలుగల యీ స్తుతిలో తొలి 41 శ్లోకాలూ ఆనందలహరిగాను, తర్వాతి 59 శ్లోకాలూ సౌందర్య లహరిగాను ప్రసిద్ధమై ఉన్నవి దీనికి యిదివరకే చాలా అనువాదాలున్నవి. కొన్ని కేవలం అనువాదపద్యాలు గాను, కొన్ని మూలంతో కూడిన అనువాదాలుగాను ఉన్నవి. తాత్ప ర్యంతో కూడినవి ఉన్నాయో లేవో తెలియదు. ఇందులోమాత్రం రచయిత ఎదురెదురుగా మూలానువాదాలను ఇస్తూ పుస్తకం చివర ప్రత్యేకంగా ప్రతి పద్యానికీ తాత్పర్యం యిచ్చి పాఠకులకు మహోపకారం చేశారు.

ఈ గ్రంథాన్ని భాషాంతరీకరించడం చాలా కష్టం. ఒక మూల రసభంగం కాకుండా మూలాన్ననుసరించాలి అందులో ఇమిడియున్న శాస్త్ర విషయాలకు లోపం రాకుండా రచన సాగిం చాలి. ఏమాత్రం అశ్రద్ధ చూపినా, అనువాదానికి ప్రయోజనం ఉండదు. ఏమంటే —ఆనందలహరి యోగశాస్త్రం, మంత్రతంత్రాలు మున్నగు దురవగాహ విషయ రహస్యాలతో మిళితమై ఉన్నది. సౌందర్యలహరిలో జగన్మాత వర్ణన కేశాదిపాదాంతంవరకూ సంఘ టితమయి ఉన్నది. సంస్కృతమూలాన్ని ప్రగాఢంగా మననంచేసి, భగవత్పాదుల ఆశయాన్ని ఆకళించుకుని ఒక్కగా రచన సాగించగల వారికే అది సాధ్యమవుతుంది. కడు శ్రద్ధతో సాగిన యీ అను వాదం యథామూలమై రచయిత రచనా సామర్థ్యాన్ని వ్యక్తం చేస్తున్నది ఒక్క ఉదాహరణ—

శ్లో॥ ప్రకృత్యా రక్తాయా స్తవ సుదతి
దంతచ్ఛదరు చేసి
ప్రవక్ష్యే సాదృశ్యం జనయతు
ఫలం విద్రుమలతా,
న బింబం తద్బింబ ప్రతిఫలన
రాగా దరుణితం
తులా మధ్యారోఢుం కథమపి
నలజ్జేత కలయా. [62]

అనువాదం—

పెదవుల సామ్యమేదయినం
బేర్కొనవచ్చునె నీకు? నేను జె
ప్పెద నొకదాని, నో సుదతి!
విద్రుమవల్లరి పండు పండనీ,
కుదురదు బింబ మయ్యెఱుపు
కూడిక తత్ప్రతిబింబ మౌటయే
అది సరియెట్టులౌను పదు
నాఱువ పాలును కామితెల్లయే.

తాత్పర్యము—

సుదతీ! సహజారుణిమతో విరాజిల్లు నీ యధరమున కేది సాటి? ఒకటి చెప్పెదను పో; పగడపు తీవ పండు పండనీ! మతి బింబమునకు (దొండపండునకు) సామ్యత్వార్హత లేనేలేదు. ప్రతి బింబము కావుటచే కలిగినదా యెఱుపుదనము. అసలునకు నకలు నకు సాటియెక్కడ ?

ఇలా సంగ్రహంగా తాత్పర్యమున్నా మూలార్థావగతికి చాలా అనుకూలంగానే ఉన్నది. విశేషార్థాలు చూపితే గ్రంథం ఎంతో పెరుగుతుంది. కాబట్టి మచ్చునకు 72వ శ్లోకానికిమాత్రం 'జగ జ్జనని స్వరూపము' అనే శీర్షికతో భావం వివరింపబడింది. దీని పీఠికలో డాక్టర్ దివాకర్ల—వేంకటావధానిగారు మూలాన్ని గురించి, అనువాద ప్రాశస్త్యాన్ని గురించి అనేక విషయాలు వెల్లడించారు

'సౌందర్యలహరి' అనువాదాలలో ఇది ఉత్తమశ్రేణికి చెంద గలదు.

— శ్రీ బులుసు వేంకటరమణయ్య

## "కమలనయన్"

[రచయిత : కంఠంనేని రాధాకృష్ణమూర్తి. డిస్ట్రి బ్యూటర్స్ : ఆంధ్రప్రదేశ్ బుక్‌డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాదు, వెల : అయిదు రూపాయలు.]

"కమలనయన్" అన్న కథగాక, మరో పది కథలున్న యీ పుస్తకం మాధవనగర్ నిహిత ప్రచురణవారు తమ మొదటి ప్రచురణగా తెలుగు చదువరి కందించారు. కథలన్నీ ఒకే రచయితవి లోగడ పత్రికలలో వచ్చినవే

"అనాసక్త" లో కథానాయకుడు తన మేనమామ కూతురు హైమను ప్రసన్నురాలునిగా చేసుకోడానికి నానా హైరాణాపడతాడు. కానీ ఆమె అనాసక్తే గాక పురుష ద్వేషి. కౌగిలించుకు ముద్దు పెట్టుకున్నా ఆమెలో చలనం వుండదు. ఆ రాత్రి ఎలాగైనా ఆమెను ప్రసన్నురాలునిగా చేసుకోవాలనుకుని ఆమె గదికి వెళ్లి, ఆమె, ఆమె స్నేహితురాలు పడకమీదున్న స్థితి చూసి కొయ్యబారి పోతాడు అంతే ఆ మర్నాడు తన వూరికి ప్రయాణం కట్టాడు. వెళ్లేముందు ఆమెతో "హైమా, ఒక స్త్రీ తన జీవిత లైంగిక భాగస్వామిగా వో పురుషుణ్ణి ఎన్నుకోడం సహజంగానీ, ఓ స్త్రీని ఓ స్త్రీ ఎన్నుకోడం విచారదాయకం ... నువ్వు వో మనస్తత్వ శాస్త్రవేత్తను కలవడం మంచిది" అంటాడు.

"సరస్వతీ పటం" ఓ విపరీత కథ. నరేంద్ర అహర్నిశలూ సరస్వతీపటం ఒళ్ళోపెట్టుక్కూర్చుని జీవితాన్ని, భార్యను కూడా నిర్లక్ష్యం చేస్తూంటాడు. తన చేతిలో పటం లాక్కుని పగల కొట్టిందన్న కోపంతో అతడు తన భార్యను హత్య చేస్తాడు పటంలోని సరస్వతితో తాను కంటున్న ప్రేమ కలల కంతరాయం వచ్చిందన్న ఆవేశంతో తానూ ఆత్మహత్య చేసుకుంటాడు.

''కమలనయన్'' లో కమలనయన్ తానెన్నడూ చూడని తన తల్లి ఫోటో చూసి, ఆమె అందానికి పరవశుడై ఆమెతో ప్రేమకలలు కంటూంటాడు. తన స్వప్నసుందరిగా పూజించు కుంటాడు ఇది మరో విపరీతమైన కథ.

రచయిత కథనంలోని నేర్పు, శైలి చాలా బాగున్నవి. కథలన్నీ చాలా చురుకుగా వున్నాయి. ఎటొచ్చి విపరీత యితి వృత్తాలను ఎన్నుకోకుండా వుంటే కాస్త బాగుండేది. ఈ పుస్తకాన్ని తెలుగు చదువరికి అందించిన నిహిత ప్రచురణవారు, రచయిత కంఠంనేని రాధాకృష్ణమూర్తి, పుస్తక పంపిణీదారులు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ సికిందరాబాదువారూ అభి నందనీయులు.

## ''రథ చక్రాలు''

[రచన : మహీధర రామమోహనరావు, ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ ]

382 పేజీల యీ బృహత్ నవల ''రథ చక్రాలు'' యితివృత్తం 1946–48 నాటిది కథనిండా ఆనాటి రాజకీయా లున్నాయి. కమ్యూనిజం అంటే ఏమిటి దాని ఆశయాలు ఏమిటి అనే విషయాలు మరియమ్మ పాత్రచేతా, కాంగ్రెసు విషయాలు సత్యానందం పాత్రద్వారా రచయిత చెప్పించారు ఈ రెంటికీ సంబంధం, వ్యత్యాసం అనే విషయం యీ రెండు పాత్రల సంభాషణ ద్వారా, తర్కవితర్కాల ద్వారా చదువరికి రచయిత తెలియజేశారు.

కథలో నిమ్నజాతులవారు, గొప్పజాతులవారు, వీరు వారికి సహాయం చేయడం, వాటిలో రాజకీయాలు, స్వార్థాలూ, వగైరా లన్నీ ముమ్మరంగా వున్నాయి. సత్యానందం, మరియమ్మల రాజకీయ చర్చలు కొన్నిచోట్ల కాస్త ఎక్కువైనట్టనిపిస్తుంది. సత్యానందం పాత్ర, ఆ పాత్రతోపాటు విశ్వం పాత్ర చాలా గంభీరంగా వున్నాయి.

1962 లో విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ నవలల పోటీలో యీ ''రథచక్రాలు'' ప్రథమ బహుమతి పొందినదట. రాజకీయ విషయాలమీద కాస్త వుత్సాహం వున్నవారికీ నవల బాగా నచ్చు తుంది. కథాగమనం చక్కగా, సాఫీగా, ఒకటొకటే సాగడంవల్ల చదువరి కథతో ప్రయాణం చేస్తూపోతాడు. శైలి చక్కగా వున్నందువల్ల విసుగుపుట్టదు. రచయిత మహీధర రామమోహనరావు, ప్రకాశకులు విజయవాడ విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్‌వారూ అభినందనీయులు.

## ''తొందరపాటు'' (పిల్లల కథలు).

[రచయిత : నరిశెపల్లి లక్ష్మీనారాయణ, వెల : రూ. 3–00]

''తొందరపాటు' లో పదహారు కథలున్నాయి అన్ని కవలూ చిన్న చిన్న నీతులతో అల్లుకుని వున్నాయి. సాంఘిక, చారిత్రిక, పౌరాణిక యితివృత్తాలున్నా యీ కథలలో

''నిమిత్తమాత్రులు'' కథలో శ్రీకృష్ణుని కాలిబొటన వ్రేలి మీద వేటగాడు వేసిన బాణానికి శ్రీకృష్ణుడు తన అవతారాన్ని చాలిస్తూ ''శివసాయుజ్యం'' పొందడం అనే ముక్క ప్రయోగం బాగుండలేదు శైవులు శివసాయుజ్యం పొందారు అంటాం. వైష్ణవులకీ వార్త వాడరు మరి.

రచయిత నరిశెపల్లి లక్ష్మీనారాయణే యీ పుస్తకాన్ని ప్రచురించారు. గుంతకల్లు రోషన్న వీధి చిరునామాకు వ్రాస్తే ప్రతులు దొరుకుతాయట.

## ''నసీరుద్దీన్ కథలు''

[డాక్టర్ మహీధర నళినీమోహన్. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ. వెల : రూ. 3=00.]

అజర్ బైజాన్ (ఓ దేశంలోని వో ప్రాంతం) జానపద కథలలో యీ నసీరుద్దీన్ కథలు పేరుమోసినవి. నసీరుద్దీన్ అనే అతని తెలివి తేటలను అనేక సందర్భాలలో చూపడమే యీ కథల లక్ష్యం. బీరబల్, తెనాలి రామలింగని కథల వంటివే యివి

ఈ కథలు చదివితే నిజంగా యివన్నీ జరిగాయో, లేక అతని తెలివి తేటల మీద మోజున్నవారు యీ కథలు అతని కోసం అనే రాశారో అనిపిస్తుంది. ఈ మౌల్వీ నసీరుద్దీన్ కుంటి తైమూరు కాలం నాటి వాడని కథలను బట్టి అనిపి స్తుంది. ఈ కథలలో నసీరుద్దీన్, సమయస్ఫూర్తి, తిరిపెరితనం, నిర్లక్ష్యం, హాస్యం, వ్యంగం అన్నీ కనుపిస్తాయి ఈ పుస్తకం లోని అరవైమూడు కథలూ చక్కగా, సరదాగా వున్నాయి

రచయిత డాక్టర్ మహీధర నళినీమోహన్ తాను 1960-63 కాలంలో రష్యాలో పి హెచ్.డి కి కృషి చేస్తున్నప్పు తన అజర్ బైజాన్ మిత్రుల సంభాషణలలో తరుచు దొర్లే యీ కథల వినగా, యివి తెలుగు చదువరులకు అందించాలనే కుతూ హలం తనకు కలిగినట్లు తొ పలుకులో పలికారు ఈ కథలన్నీ 1965-66 ప్రాంతంలో ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వచ్చాయి

మూడు పాయలు నిలువచేసే యీ పుస్తకాన్ని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ విజయవాడవారు ప్రచురించారు. ఈ పుస్త కానికి చక్కని ముఖచిత్రం రచించిన చిత్రకారుని పేరీ పుస్తకంలో ఎక్కడా లేకపోవడం ఆశ్చర్యం.

— పాలాక్షుడు

## గాలిబు

[గ్రంథకర్త ఎం ముజీబు తెలుగు అనువాదం : కె. గోపాలకృష్ణారావు ప్రచురణ కర్తలు : సాహిత్య అకాడమి. న్యూఢిల్లీ 92 పుటలు వెల రూ 2-50.]

సత్యజిత్ రే గీచిన ముఖచిత్రం గల జాకెటుతో ముస్తాబైన ఈ పుస్తకం ముచ్చటగా ముద్రింపబడ్డది. 'భారతీయ సాహిత్య నిర్మాతలు'' అనే పరంపరలోనిదే ఈ 'గాలిబు'. ఈ గ్రంధాన్ని రచించిన ఆచార్య ముజీబు చారిత్రకులు గనుక గాలిబు యుగాన్ని, అతడనుసరించిన కవితా సంప్రదాయాన్ని స్పష్టంగా చిత్రించకలిగినాడు తెలుగు అనువాదకులు గూడా ఆచార్యులే. డా॥ కోవూరు గోపాలకృష్ణారావుకు ఉర్దూ సాహిత్యంతో మంచి పరిచయమున్నదనటానికి వేమన పద్యాలను ఉర్దూకరించుటే తార్కాణం. చక్కని తెలుగులో, హృద్యమంగా అనువదించి మూలానికి వన్నెపెట్టి, గాలిబు గులాబీ గుచ్ఛాన్ని తెలుగు చదువరుల చేతుల కందించి ధన్యులైనారు.

గాలిబును గూర్చి ఎంతైనా రాయవచ్చు కాని గ్రంధకర్త సంక్షిప్తపరచి, 48 పుటలలోనే సముద్రాన్ని కుండలో ఇమిడించినట్లు చేసినాడు. ఇక మిగతా 33 పుటలలో 158 కవితల అనువాదాలున్నవి. ఉర్దూ సాహిత్య వనంలో, వనరాజువలె ఎదురులేక విహరించి తన పేరునూ, కవితా నామాన్ని సార్థకం చేసిన కవిసింహము గాలిబు. అతని పేరు అసదుల్లాఖాన్. అసద్ అంటె మృగరాజు మొదట్లో 'అసద్' అనే 'తఖల్లుస్' (కవితా నామం) పెట్టుకున్నాడు. తర్వాత 'గాలిబ్' అని మార్చుకున్నాడు గాలిబ్ అంటె పైబడేవాడు, ఆక్రమణ చేయువాడు అని అర్థం. ఈ విధంగా అసద్, గాలిబ్, ఒకే అర్థాన్ని స్ఫురింపచేస్తవి ప్రతి ఉర్దూ కవికి తఖల్లుస్ పెట్టుకోవటం ఆచారం అది అతని చిత్త ప్రవృత్తికి దర్పణంగా ఉంటుంది.

అన్నట్లు గాలిబ్ ఉర్దూ కవితా ప్రపంచాన్ని ఆక్రమించినాడు. ''ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరాయ షష్ఠిపూర్తి సంచిక'' (1946) లో పూజ్యులు బూర్గుల రామకృష్ణారావు గారు ''ఉర్దూ భాషా సారస్వతములు'' అనే చక్కని వ్యాసం వ్రాసినారు అందులో గాలిబ్‌ను గూర్చి 19 వ శతాబ్దమందు 'గజల్' కవిత పరిణతి నొందెను...'ఇన్షా' తో ఆరంభమైన ఈ యుగము 'గాలిబ్' తో సమాప్తమయ్యెను. మిర్జా అసదుల్లాఖాన్ గాలిబ్ ఉర్దూ సాహిత్యమున శ్రీనాధునితో పోల్చదగినవాడు. మేధావి, పండితుడు. ఇతని కాలము 1796 – 1869 ఈ కాలపు కవులలో పేర్కొనదగినవారు జఫర్, మోమిన్, జౌక్. కొందరు విమర్శకులు 'జౌక్' గాలిబు వంటి ప్రతిభాశాలి అని అన్నారు. కొందరు అంతకంటెను మిన్న అన్నారు. కాని మొత్తముపైన గాలిబ్‌కు ఉర్దూ సారస్వత చరిత్రమునందు గల ప్రాముఖ్యత, పలుకుబడి జౌకునకుగాని మరితరులకు గాని లభింపలేదు. వీరిరువురును ఫారసీ, అరబ్బీ పండితులు. బహు గ్రంథ నిర్మాతలు. వీరిద్దరి కవిత సంస్కృత పదభూయిష్టమైన కఠినమగు మార్గ కవితవలె జటిలమై దీర్ఘసమాసయుతమై యుండును. గాలిబ్ కవిత నారికేళ పాకమనియే చెప్పవచ్చు. జౌక దేశీయపదములు కొంచమెక్కువగ వాడినను భావగాంభీర్యము తక్కువగు కోణమునగాలిబ్‌కు కలిగిన పలుకుబడి గలుగలేదు. గాలిబ్ సుఖజీవిగా నుండి బ్రిటిషు ప్రభుత్వము వారు తన యుపకార వేతనమును తగ్గించిన తర్వాత, మన శ్రీనాధుడు తన పోషకులైన ప్రభువులను దలంచి కస్తూరికై ఏడ్చినటులె, మధుపానమునకు తగిన అవకాశము లేదని దుఃఖించుచు వాపోవుచున్నాడు. వీరిద్దరి స్వభావములకును, కవితా శైలికిని, జీవితా దర్శములకును చాల సన్నిహితమగు పోలిక గలదని చెప్పవచ్చును'' అని వ్రాసినారు

ఢిల్లీసుల్తాన్ బహదూర్‌షా; సమకాలికుడైన గాలిబ్‌కు నజముద్దౌలా, బీరుకముల్క్, నిజాంజంగ్ అనే బిరుదులను ప్రసాదించినాడు. గాలిబ్‌కు తినుడు, తాగుడు, తిరుగుడుతో బాటు ఆడుడువ్యసనం గూడా ఉండేది. ఒకసారి జూదమాడగా పట్టుబడ్డాడు ఢిల్లీసుల్తాన్ రసిడెంటును కోరినాడు గాలిబును విడిపించవలసిందిగా. కాని కేసు కోర్టులో ఉన్నందున అతడు తన నిస్సహాయతను తెలిపినాడు. కాని గాలిబు మరొకసారి జేలు బాధ తప్పించుకో కలిగినాడు. అది న్యాయాధికారికి గాలిబు పట్లగల అభిమానంవల్ల సాధ్యమైంది. అప్పుతెచ్చి తాగినాడు కాని చెల్లించనందుకు అప్పిచ్చినవాడు దావా వేసినాడు కోర్టులో ''అప్పుచేసి తాగినాను ఎప్పుడో ఈ గతి పడుతుందని అనుకున్నాను'' అనే కవిత వినిపించినాడు అది విన్న న్యాయాధికారి వాది వైపు తీర్పుచెప్పి, పైకం తాను చెల్లించినాడు. ఈ విధంగా జేలు తప్పింది

గాలిబ్‌కాలంలో 'గజల్' కవిత పరిణతి చెందినదిగదా! గజల్ అనే శబ్దానికి ''స్త్రీతో సంభాషించుట, ప్రేమభాషణము'' అని అర్థం. జింక కండ్లను ''గజాల్ ఆంఖే'' అంటారు కాబట్టి గజల్ శృంగార కవితా సాహిత్య మనవలసి వస్తుంది ఉర్దూపై ఫారసి సాహిత్య ప్రభావం పడినందువల్ల సూఫీ తత్త్వం ఆవిర్భవించింది భౌతికప్రేమ 'ఇష్కెమజాజీ' ఆధ్యాత్మికప్రేమకు 'ఇష్కెహఖీఖీ' సోపానమని సూఫీల తలంపు గాలిబు సూఫీతత్త్వాన్ని అధ్యయనం చేసి ఒకవిధమైన అద్వైతాన్ని అంగీకరించినాడు. అందుకే ఈ కవితలలో ప్రేమభాషణలకు, నృత్యగీతాలకు, గాన, పానాలకు ఒకవిశిష్టమైన ఆధ్యాత్మిక అర్థాలు గోచరిస్తవి. అది అద్వైత సిద్ధాంతమూసలో తపనమంది పరిపుష్టి నొందినది. అందుకే ప్రేయసితో ఐక్యముతప్ప తక్కినవాని అస్తిత్వమునే నిరాకరించినాడు గాలిబ్

గాలిబుకు మతాచార్యుల ఆడంబరాలు, మత దురహంకారాలు గిట్టవు. అందుకే ఒకసారి నిలదీసి అడిగినాడు 'ఓ షేక్ నన్ను మసీదులో తాగనీలేదా దేవుడు లేని చోటును చూపించు'మని. గాలిబుకు పునర్జన్మపై విశ్వాసమున్నట్లు తోస్తుంది, ఒక ఖండికలో. ''ఈ జీవితాన్ని అనంతర జన్మానికి అవతారికగా చేయటానికి ఉదాత్త ప్రణయ మార్గాన్ని అనుసరించు'' అంటాడు. మజ్నూను గూర్చి వ్రాస్తూ గాలిబు ''నా చిన్నతనంలో మజ్నూపై రాయి విసరాలనుకున్నాను కాని అంతలో నాకూ తలఉన్నదని స్ఫురించింది'' అంటాడు. ఎంతటి ఉదాత్తభావము!

సాహిత్య సృష్టి సంబంధించినంతవరకు 19వ శతాబ్దం చాల ముఖ్యమైనది. ఉత్తరాన గాలిబ్, జౌక్, జఫర్‌వంటి మహా

కవులు సూఫీ తత్త్వాన్ని ఆకళించుకొని సాహిత్యాన్ని సృష్టించినారు. అయితే ఆ కాలంలోనే, తెలుగునాట పటిష్ఠమైన సాహిత్య సృష్టి జరుగుట గర్వకారణం. ఆధ్యాత్మికదృష్టితో, భారతంతో తులతూగే 'సీతారామాంజనేయం'' అనే వేదాంత గ్రంథాన్ని పరశు రామపంతుల లింగమూర్తిగారు రచించినారు. తూము రామదాసు గారు 'ఆంధ్ర పదనిదాన మనే నిఘంటువును రచించినారు. దీనిని శేషాద్రి రమణ కవుల సంపాదకత్వాన కాకతీయ గ్రంథమాల ప్రకటించింది. అల్లెరాయడప్ప రంగారావు బొబ్బిలి రాజాగారు 'సంకల్ప సూర్యోదయము' అనే ఉద్గ్రంథాన్ని రచించినారు. అట్లే మరాఠ, కన్నడమున్నూ మొదలైన వివిధ భారతీయ భాషలలో ఎంత గానో సాహిత్యసృష్టి జరిగివుంటుంది. దాన్ని వెలుగులోకి తేవటానికి సాహిత్య అకాడమీవంటి సంస్థలే పూనుకోవాలె.

శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు

## "కంబమహాకవి"

[ఆంగ్లమూలము : ఎస్ మహరాజన్; తెనుగుసేత : మరుపూరు కోదండరామరెడ్డి; డెమ్మీసైజు 116 పేజీలు; వెల : రూ. 2-50, ప్రచురణ : సాహిత్య అకాడెమీ, రవీంద్రభవన్, న్యూఢిల్లీ-1; ప్రాంతీయ కార్యాలయాలు : మదరాసు-6, కలకత్తా-29, బొంబాయి-14.]

''ప్రాచీన, ఆధునిక భారతీయ సాహిత్య నిర్మాతలను గురించి తెలుసుకోవడంద్వారా భారతీయ సాహిత్య చరిత్రలోని ప్రధాన ఘట్టాలను సామాన్య పాఠకుడుసైతం గ్రహించవచ్చు. ఏ భారతీయ భాషలోనైనా దాని అభివృద్ధి వికాసములకు తోడ్పడిన సుప్రసిద్ధ రచయిత జీవిత కథనూ, ఆయన సాహిత్య సేవనూ ఈ శీర్షిక క్రింద ఆంగ్లంలో వెలువడే ప్రతి రచననుంచి గ్రహించవచ్చు'' అన్న లక్ష్యంతో 'భారతీయ సాహిత్య నిర్మాతలు' అనే శీర్షికక్రింద సాహిత్య అకాడెమివారు వెలువరించిన పుస్తక పరంపరలో 'కంబ మహాకవి' ఒకటి.

ఆ కార్యక్రమంలో, మదరాసు హైకోర్టు న్యాయమూర్తిగా పనిచేసి, యిటీవల పదవీ విరమణ చేసిన జస్టిస్ ఎస్ మహరాజన్ రచించిన 'కంబన్' ఆంగ్లమూలాన్ని సాహిత్య అకాడెమి దక్షిణ ప్రాంతీయ సంఘంవారు అనువాదం చేయించారు.

మూలరచయిత వ్రాసుకున్న అవతారికలో ప్రాచీన తమిళ భాషా సాహిత్య ప్రాభవాన్ని గురించీ, కంబని కవితా వైదుష్యాన్ని గురించీ, కంబరామాయణంపట్ల తమిళ ప్రజానీకానికున్న తన్మయీభావాన్ని గురించీ సంగ్రహంగా ప్రస్తావించడం జరిగింది. తమిళ భాష క్రీస్తు పూర్వమే సంఘకవులచేత, క్రీస్తుశకారంభ కాలంలో తిరువళ్ళువర్‌చేత, పిమ్మట వైష్ణవ ఆళ్వారులు, శైవనాయన యారులచేత సుసంపన్నం చేయబడి, దాక్షిణాత్య భాషలలో ఒక ప్రత్యేకమైన దేశీయతను సంతరించుకొన్నది. పండిత పామర హృదయాహ్లాదకరమైన కంబరామాయణ పుట్టుకతో తమిళ సాహిత్య వైభవం ఇనుమడించింది. కంబరు కవిచక్రవర్తిగా, జాతీయ కవిగా కీర్తింపబడి, తరతరాల తమిళజాతి సంస్కృతికి హృదయ స్పందనమైనాడు

ఈ గ్రంథంలో 'కంబకవి కాలము' అనే తొలిప్రకరణంలో కంబకవిని గూర్చి ఆధారపూర్వకంగా తెలుసుకోగలిగిన విషయాలు చాలా తక్కువ కవికాలం వివాదాస్పదమైనది. ఒక సిద్ధాంతం ప్రకారం ఈయన క్రీ. శ. 13వ శతాబ్దంవాడు. 9వ శతాబ్దంలో ఉండినాడన్నదే ఎక్కువ ఆమోదయోగ్యంగా పరిగణింపబడుతున్నది. అట్టలోపలి పేజీలో, 4వ శతాబ్దిలో వెలసి ఉండినాడని పేర్కొన్నరు ప్రచురణ కర్తలు. ఇది పొరపాటు కావచ్చు కవి నివాస స్థానం గురించిమాత్రం పండిత లోకంలో ఏకాభిప్రాయమే ఉంది. నేటి తంజావూరు జిల్లా, మాయవరం తాలూకాలో తిరువళందూరు (తేరళుదూర్) గ్రామవాసి అనీ, అక్కడి పెద్ద భూస్వామి సడయప్ప వళ్ళాలకంబుని కవిత్వానికి ముగ్ధుడై కొనియాడి, పోషించి, ప్రోత్సహించాడనీ చెప్పబడింది కంబకవి జీవిత విశేషాలు కాక, ప్రధానంగా అతని రామాయణ గుణవైశిష్ట్యాన్ని వివరించటానికే ఈ గ్రంథం ఉద్దేశింపబడింది.

తక్కిన ప్రకరణాలన్నీ, పదివేల గేయాలకు పైబడ్డ కవి రచనలోని ఔన్నత్యాన్ని అక్కడక్కడా స్పృశిస్తూ, కంబరురీతిలో సంక్షిప్తంగా చెప్పబడిన రామాయణ కథాభాగాలు అవి-బాల, అయోధ్యా, అరణ్య, కిష్కింధా, సుందర యుద్ధకాండములు. కంబుని కల్పనాచాతురి, వర్ణనా కౌశలం, యదార్థ ప్రపంచదర్శనం, పరిణత ఆధ్యాత్మిక ప్రవచనం ఇందులో అడుగడుగునా గోచరిస్తాయి తాను సృష్టించిన పాత్రలన్నిటిలోను ప్రేమస్వరూపాన్ని, దైవాంశను దర్శింపగలుగుతున్నాడు కంబుడు. తన కావ్యానికి మూలం సంస్కృత మహాకావ్యమైన వాల్మీకి రామాయణమే అయినప్పటికీ, పాత్రచిత్రణలోను, సన్నివేశ కల్పనలోను పలుచోట్ల స్వంతపోకడలు పోయినాడు ఆయా సందర్భాలను వివరిస్తున్న ఈ పరిచయాత్మక గ్రంథంలో సందర్భవశంగా మచ్చుకు మూల పద్యాల అనువాదాలు కొన్ని తారసపడుతుంటాయి.

వాల్మీకి రామాయణానికి భిన్నంగా నడిచిన కొన్ని అంశాలు, ఘట్టాలు చాలా చోట్ల ప్రస్తావనకు వస్తాయి. పాత్రచిత్రణ, నాటకీయత, కథాకథన వైచిత్రి, పాత్రలలో లయించగలిగిన కంబుని మహోన్నత సంస్కారం మొదలైన విషయాలదృష్ట్యా, ఆ యా మార్పులన్నీ సహజసుందరములనీ, ఔచిత్యవంతమైనవనీ పేర్కొని పాఠకుల్ని అంగీకరింపజేస్తున్నాడు గ్రంథకర్త.

ఈ విధమైన స్వతంత్ర సుందర భావశ్రేణిలో ప్రధానంగా కుంభకర్ణుని పాత్రను విశిష్ట విలక్షణరీతుల్లో మలచినాడు కంబుడు. ''రావణుని తమ్ముడు—కుంభకర్ణుడు లేచి, సీతను అపహరించడంవల్ల రావణుడు నైతికాపరాధం చేసినాడని చెప్పినాడు. 'సీతను విధవనుజేసి నీవు ఆమెను పెండ్లిచేసుకొనే అనువు కల్పిస్తాను' అని రావణునితో చెప్పిన వాల్మీకి కుంభకర్ణునివలెగాక, కంబకవి కుంబకర్ణుడు ధర్మాధర్మముల సూక్ష్మవిభేదములను బాగా ఎరిగిఉన్నాడు.''

తన హృదయంగమ నాటకీయ కల్పనా చాతురికి నిదర్శనంగా, కంబుడు వాల్మీకి మూలంలోలేని ఒక అద్భుత సన్నివేశాన్ని రణరంగంలో కల్పించాడు. యుద్ధానికి వచ్చిన కుంభకర్ణుని శిబిరానికి రాముని పనుపున నడిచి వెళతాడు విభీషణుడు ''సర్వజగత్తుకు ప్రభువైనవాడు, అదిగో అక్కడ! ప్రయోగ సన్నద్ధమైన శరాసనంతో నిలబడియున్నాడు! ఆయన వెనుక మిగత వీరులంతా నిలుచుండియున్నారు. విధి— మృత్యువు మనలను తుదముట్టించనే కృతనిశ్చయములై ఉన్నవి ఇప్పటికీ పరాభూతులై యున్న వీరికడకు, ఆ రాముని త్యజించి ఇప్పుడిట్లా ఎందుకు వచ్చినావు?'' అని కుంభకర్ణుడు తమ్ముని మందలిస్తాడు

'ఉదాత్త శౌర్య వైలక్ష్యము, సూక్ష్మ న్యాయగ్రహణ బుద్ధి, హృదయ లాలిత్యము గలిగిన ఈ కుంభకర్ణుడు కంబమహాకవి అమర సృష్టి! ఇక వాల్మీకి కుంభకర్ణుడో — వికృతరూపుడు, కంబకవి పాత్రకు కేవలమూ భిన్నుడు! అందుచేత, విభీషణుని స్తుతించి కుంభకర్ణునికి అశ్రుతర్పణం చేస్తాం.''

వధింపబడిన వాలి ''ముఖాముఖిగ నిలువలేక దొంగమాటున దాగి, ఒక నిరాయుధ నిస్సహాయుని గుండె చీల్చను—బాణప్రయోగం చేయుటకేనా విలువిద్య సృష్టింపబడినది? ... కలుషభూతమైన నీ పెద్ద కార్ముకము ఎందుకు, కాల్పనా?'' అంటూ రామునిపై నిందను మోపినపుడు, ధర్మ పక్షపాతియైన కంబుడు రాముని చేష్టను సమర్థించలేక పోయినట్లుంది.

''వాలి రామునిపై మోపిన ఈ గురుతర నిందను సమర్థించే దానికిగా, సాంప్రదాయోన్మాద భక్తులు ఈ పాట తరువాత గల కొన్ని పాటలను అల్లి కంబ రామాయణములో దూర్చినారనుట సహేతుకంగా ఉన్నది. ఈ సమర్థనాత్మకమైన పద్యాలలో కంబుని ప్రామాణికమైన ధ్వనిలోపించి ఉన్నది. ఇవి పేలవంగా నమ్మబలుకలేకున్నవి. కవిత్వ విషయమున పారపారెరుగని సహజ జ్ఞానం గలిగిన — స్వర్గీయ, రసికమణి టి. కె. చిదంబరనాద మొదలియారు ఈ పద్యాలు కృతకములని సహేతుకంగానే త్రోసిపుచ్చుతున్నారు. ఆయన ఈ సందర్భమున ఈ ఊహాకల్పన చేస్తున్నారు. కంబుని రాముడు అరమర దాపిరికము లేకుండా, తాను చేసిన తప్పును ఒప్పుకొని ఉండవలెను, దానిపై తాను చాటునుండి వాలిని చావుదెబ్బ కొట్టినందులకు ధైర్యంగానే క్షమాభిక్ష కోరియుండును...'' ఇదే నిజమైతే, కంబకవికి నివాళు లెత్తటానికి ఆ ఒక్క అర్హతే చాలు.

ఈ గ్రంథాన్ని అనువదించిన కోదండ రామరెడ్డిగారి ఆంధ్ర భాషా పాండిత్యం అనల్పం అన్న విషయం తెలసిందే. ఈ అనువాదంలో ఆయన అరుదైన అచ్చతెనుగు మాట లెన్నిటినో కుప్పతిప్పలుగా కుమ్మరించారు కరుదువ్వు కొండ, ముమ్మొనవాలు, అరపరాని విల్లు, గమిడి, వీటి ఊరేగింపు, రేసకడ, మున్నీడులు, రాచసింగపు గద్దె, గయ్యాళి గరిత, మందుటేల్పు, అగ్గలకపు గోడు, వేయి పడవల ఎకిమీడు, కాసెకోక, చీకటి పోసలు, ఎన్నవలు, కారియపెట్టను, గోడు గుడిచి, మొక్కట్లు, అడుగు దామరలు, ఉడుప, మిన్నువాక, పుట్టుపోన, ఏణి, వితాకు, ఎక్కటి కయ్యము, పొలికలను — వంటి సుందర ప్రయోగాలు కోకొల్లలు

రాజహర్మ్యపు వలభి, శింజినీ బంధము, ధనుశ్శింజనీరావం, మేఘ చుంబిత నగ నిర్ఝరణీ జలం, వివిధ విద్యాసంయోగ మార్మిక జాలం — వంటి శబ్దాడంబర పరిపుష్టమైన ప్రౌఢతరవాక్య విన్యాసానికీ కొదువలేదు.

ఉండాల, అప్పగించాల, వంచాల, కూర్చోని (కూర్చొని), తప్పించుకోని, వినేదానిక (వినుటకు), తాకేదానికి జరిపేదానికి, గావించేదానికి, పొయ్యేదానికి, అనుభవించేదానికి, సీతతట్టు (వైపు), గమనం (జ్ఞప్తి), అస్తిభారం (ఆధారం), తారికాడి (తారాడి), కావాలనా? (కావలెనా?), రాండి, దిగే తలికి, పందిలి — వంటి మాండలిక పద ప్రయోగాల ఊతతో చాలవరకు రచన సాగింది.

అక్కడక్కడ అనువాదకుడు వాడిన—ఈపట్టున, ఆసందున, ఆ సందులో, ఈ సందుకట్లలో -అనే మాటలకు సగటు పాఠకుడు సందర్భానుసారంగా, ఆ అదనులో, అప్పటికి, ఆ సందర్భంలో, ఆ పరిస్థితుల్లో అంటూ అర్థం ఊహించుకోవలసి వుంటుంది.

కఠిన గ్రాంధిక శైలీ అందంగానే ఉన్నా అర్థం సామాన్యులకు అందుబాటులో లేని అచ్చ తెనుగు పలుకుబళ్ళూ, ఏవో కొన్ని ప్రాంతాలలో మాత్రమే వాడుకలో ఉన్న మాండలిక శబ్ద ప్రయోగాలూ వీటితోబాటు ఈనాటి వ్యావహారిక రూపాలూ—ఈ అన్నిటినీ కలిపి పేనినట్లుంది అనువాదం. ఈ అన్ని రీతులూ ఆమోద యోగ్యాలే అయినప్పటికీ, వీటి కలబోతవల్ల ఈ గ్రంథంలో కంబ మహాకవి వెనుకబడిపోయి, అనువాదకుడు ముందర నిలబడుతున్నాడు. కేవలం అచ్చ తెనుగులోనో, స్వచ్ఛ గ్రాంథికంలోనో, మాండలిక భాషలోనో — కథలో, కావ్యలో వ్రాస్తే, అవి రాణిస్తాయి, రసవంతమూ అవుతాయి. ఇటువంటి చారిత్రిక సాహితీ సాంస్కృతిక విషయ ప్రధానమైన రచనల్ని అనువదించేటపుడు, పాఠక జన బాహుళ్యానికి ఉపయుక్తంగా సరళ గ్రాంధిక భాషనుగానీ, శిష్ట

వ్యావహారికాన్ని గానీ చేపట్టితే ఔచిత్యంగానూ ఉంటుంది, పాఠకులకు సౌలభ్యమూ దక్కుతుంది. సామాన్యపాఠకుడు స్వైతం గ్రహించాలన్నదే కదా, సాహిత్య అకాడెమీ వారి ఆశయం!

అనువాదంలో శబ్దాల కూర్పునుబట్టి కంబ మహాకవి కవితా మాధుర్యాన్ని చవి చూడటం సాధ్యంకాదు. గ్రంధకర్త చెప్పినది కూడా యిదే. అర్థాన్నిబట్టి మాత్రమే మూలంలోని ఆనందానుభూతిని అంతో యింతో అందుకోగలం.

రాముడు అరణ్య గమనానికి ఆయత్తపడుతున్న సమయంలో —దిగ్భ్రాంతులైన ఇల్లాండ్రు గృహకృత్యాలు చేయడంమానేశారు...

''పొయ్యిలలో పొగరాజలేదు;
గంధ ధూప సాంద్ర సువాసనలను
గృహోపరితలాలు పోగొట్టుకొన్నవి!
పెంపుడు చిలుకలకు
బంగారు పాలగిన్నెలు కరవైనవి.
ఊచే వనితాజన కరస్పర్శను
ఉయ్యేల తొట్లు ఎరుగనందున
శిశు రోదనము ఎక్కువైనది''

అడవిఎండలకు తట్టుకోలేవనీ, తనవెంట కానలకు రావద్దనీ చెబుతున్న రాముడితో సీత అంటుంది:

''ఆ కానన భూరి దవానలం
మీ వియోగాగ్ని కంటె భీషణంగా
మండగలదా?''

కంబుడు కోయరాజు — గుహుని వర్ణించే ఘట్టంలో ''ఆ లోతు గంగను తలమున్కగాకుండా దిగి నడిచిపోగలిగినంత పొడగరి'' అని ఉత్ప్రేక్షిస్తాడు.

''నీ సత్తాకు తగినట్లు ఈ విరోధిలంక ఏడు సముద్రాల కావల ఉండకపోవడం నీ బాహుబల వీర్యానికి ఒక కళంకం కదా?'' అని సీత, సముద్రం దాటి లంకకు చేరుకున్న హనుమంతుణ్ణి నర్మగర్భంగా స్తుతిస్తుంది.

శరణాగతుడై వచ్చిన విభీషణుడు రాముని చూడగానే దిగ్భ్రాంతిలో — ''ధర్మపు మేని ఛాయ నలుపా?'' అని ప్రశ్నిస్తాడు

కంబకవి ఊహా సౌందర్యాన్ని కనులకు గట్టించే పద్యం మరొకటి — లంకకు వంతెన కట్టే ఘట్టంలో —

''వానర ముఖ్యుడు కుముదుడు
విసరె పెను శిలనొండు శిలావయో జలధి బడగ;
నర్తకీ పదలాస్య గతుల బెంప
అదియు కొండచరియల దొర్లి కడలిజేరె;
అందు అది మధించి ఘూర్ణించి
శీకరాసార తతిచేత తడిపె స్వర్గసీమనెల్ల;
మరల దుగ్ధ వారాశిలోన
సుధాపూర ముద్భవించి
తమ్ము జేరునన్న ఆశతో
ఆడిపాడిరి అమరులెల్ల!''

అలా ఉద్భవించిన సుధా కలశమే కంబ రామాయణం. ఆ సుధా కలశాన్ని అందుకోగలిగిన అదృష్టవంతులు తమిళులు!

**శ్రీ కలువకొలను సదానంద**

# కృత్యష్టకం

## 1. మారుకోసం (కథల సంపుటి)

[ క్రౌన్ 1/16 — 200 పేజీలు; వెల రు 5/—; ప్రతులకు : 21 ఫస్ట్ సెంచరీ రైటర్స్, 26—3—22 దాసన్నపేట విజయనగరం—531202].

ఉచ్చారణలో సెంచ్యురీని సెంచరీచేయడం గూడ భావి శతాబ్ద చిహ్నమేమో! ఈ కథలు మనకంటే 22 ఏండ్లు ముందుండాలనుకొన్నవారు వ్రాసినవి — అంటే 21స్ట్ సెంచ్యురీ రైటర్సు ఆనాటికిఅంతా ఇంగ్లీష్మయం (బ్రిటిషుపాలనలోకంటె) అయ్యేటట్లున్నది వీరికి ఆగామిదృశ్య ఛాయలే ఇవి ఆయితే మిశ్రఫలితంగా ఉండబోతున్నవి భాష మొదటి కబళం అయినా నానా ప్రాంతాలవారు ఆడ మగ వ్రాయసగాండ్రు- భావైక్యత కలిగి చాలా దూరాన ఒకచోట సంఘం కట్టడం ఎన్నదగిన ఉద్యమం గుణాకర్షణానికి దూరంమేమున్నది? కమలం సూర్యుడికి దగ్గరఉన్నదా?

చెప్పదలచుకొన్నదానిని, మనసులో దాచుకోకుండా కట్టెవిరచి పొయిలో బెట్టినట్లు చెప్పగలిగిన ఆత్మప్రత్యయం వీరికున్నది. వెగటు బుట్టిస్తున్న ఈనాటి కథానికా వాఙ్మయాన్ని — ''వీటిలో మీకు వంటింటి కథలు, గుమస్తాకష్టాలు, ప్రేమలు, ప్రియురాలి కన్నీళ్ళు, హీరో వెధవ సాహసాలు, పోజులు, సెక్సు బూతులు, పత్రికా కాలక్షేప కథలు ఉండవు'' అని చావు దెబ్బ కొడుతున్నారు. దెబ్బతిన్నవారి రియాక్షన్ ఏమిటో వింటుందాం

కథలు చెప్పేతీరు ఇంకా ప్రాణం పోసుకోవాల భాష స్థానిక గ్రామ్యం కాబట్టి అందరికీ రుచించదేమో. ఈనాడు వ్యావహారికాన్ని కాదనేవాళ్ళే లేరుగదా! తిక్కన, శ్రీనాథ, పోతనాదులు ఆనాటి మాండలికాలనే ఉపయోగించినారని మురిసి పొయ్యేవారున్నారు. కాని బస్ స్పీడ్ ఎక్కువైతే ప్రయాణికులకు ప్రమాదం గదా. అనిశెట్టివారి ఆడుబిడ్డ రజిత ఇవి వ్రాసుకొంటున్నది. అది రజత అంటే, మా యిష్టమంటారేమో వీరు. అంతేగాకుండా ''మేము వ్రాసేది జ్ఞానులకు'' అని అంటారేమో!

వీరికి — డి ఎం. కె. వారివలె ఇంగ్లీషుపై మోజు ఎక్కువ కేంద్ర మంత్రి —రాజనారాయణ్ మాటసాగితే రాబొయ్యే శతాబ్దంలో మనదేశంలో దానిపాట్లు ఎట్లుండబోతవో! వంకాలమ్మి కథలో మెన్స్రియా అనే పదం వాడుతాడు. చదువుకొన్న అజ్ఞానికి సందర్భాన్నిబట్టి అది ఏదో ఒక మానసిక జాడ్యం అని తోస్తున్నా, వీరు అంకితమిచ్చిన జ్ఞానులేమనుకుంటారో! ఒకచోటనైనా వివరణం ఉండ పనిలేదా?

కథలలో ఎంచి ఎగతాళి, ఎత్తిపొడుపు, పొగడ్త తెగడ్త ఉన్నవి. రామాయణాన్ని హేతువాద బుద్ధితో చేసిన విమర్శ ఛాందస మూఢవిశ్వాసానికి గూడ నొవ్వు కలుగదు. పోనుపోను ఆవేశపు పొంగు తగ్గితే వీరి రచనలు చదివించి, యోచింపజేసి ఆనందింప జేయగలవు.

## 2. బతుకు పాట (గేయరూపకం. కర్త—బిగుళ్ళు)

[క్రౌన్ 1/16 — 24 పేజీలు; వెల రూపాయి; ప్రతులకు — హైదరాబాదు అభ్యుదయ రచయితల సంఘం, ముఖ్ద్దూం మార్గ్, హైదరాబాదు—24]

జానపద గేయంగా (యాంపదం) ప్రదర్శనానికి అనువుగా వ్రాసిన గేయనాటకం ఇది; ప్రయోగంలో రక్తికట్టేటట్లున్నది. పల్లెసీమవారి "ఉడుకు నెత్తురుతోనే తల్పుకోక, గునం తెలుసుకొన్న" ప్రేమ ఇది; కులగోత్రాలకు అతీతం. ఇందు ఉదారభావాలు కవితాత్మను వెల్లడిస్తున్నవి.

గ్రామ్యవ్యావహారిక గ్రాంథిక భాషలను గురించి, నేడు ఏర్పడిన పేరీ పేరని భాషా సందిగ్ధ—నియమాతీత స్థితిలో—పెద్దలు ఒక నిర్ణయానికివస్తే ఆరోగ్యకరమైన అభివృద్ధి చేకూర గలదను కొంటా; ఏ రంగంలోగూడ అరాజకం పనికిరాదుగదా! రాష్ట్ర అరస సంఘ అధ్యక్షుడు — డాక్టర్ సి. నారాయణరెడ్డి దీనిని "సుందర మాండలికభాష" అన్నాడు. ఈ సంఘ అధ్యక్షిణి—డాక్టర్ నాయని కృష్ణకుమారి "నాకు పానమంతా నీ మీదనే" అన్నముక్క స్వచ్ఛమైన తెనుగు అన్నది. ఇక అప్పళాచార్యస్య సన్నిధిలోనేగాదు—ఎక్కడా గూడా అపశబ్ద భయం నాస్తి! ఈ ఇద్దరూ తమ రచనలలో ఈ పాటల భాషను ఎందుకు చేపట్టడంలేదో!

కృష్ణకుమారి ఇంకొక పితూరి లేవదీస్తున్నది: అభ్యుదయకవి ప్రేమను కావ్యవస్తువుగా తీసుకోరాదని శాసిస్తున్నది. ప్రేమ మధ్యతరగతి జంనికి చెందినదట; కమ్యూనిస్టుల భాషలో బూర్జువాలది. పాటకజనం మానవులు కారా ఏమిటి? ఈమె చెప్పిన ఈ కామసౌఖ్య వైరాగ్యాన్ని పాటిస్తే కుటుంబ నియంత్రణ శాఖనే ఎత్తివేయవచ్చునేమో! ఏమో అవ్వా! ఇదంతా జీర్ణానికి రాని భావ సంకులంగా ఉన్నది.

## 3. చైతన్య స్రవంతి (కవితా సంపుటి)

[రావెళ్ల వెంకటరామారావు. డెమ్మీ 1/8; ధర—రు. 6/ ప్రచురణ — నవప్రచురణలు, గోకినేపల్లి; ఖమ్మం జిల్లా; 507158]

నేలతీపు పంటపెంపుచూచి పరవశించిన ఒక సేద్యగాడు కవియై, తరుణేందుశేఖరు భక్తి తత్పరుడై అన్నిటా ఒప్పునే కోరి ఆనందించి వ్రాసిన ఖండికలివి. వాసనాబలం అబ్బజేసిన సమన్వయ బుద్ధితో— "మతం, కులం, బలం, ధనం, రాజకీయం, సాహిత్యం అన్నీ మానవునిలో మహాదేవుని ప్రతిష్ఠించే సాధనాలు కావాల" అన్న ఉదాత్త కాంక్షా తత్పరతతో కవిత్వం చెపుతున్నాడు—ఈ కృషీవలుడు. తనచుట్టూ వికసించిన ప్రకృతి దగ్గర పాఠం నేర్చుకుని, ఆ ప్రకృతి సందేశాన్ని ప్రతిమనిషికి అందజేయాలని ఆత్రపడి, "ఆ ధ్యేయానికి అద్దం పట్టగల భావనా పటిమకు ప్రార్థిస్తున్నాడు." షేక్స్‌పియర్ మహాకవి. "To hold mirror upto the nature" అన్న భావం ఇట్టిదేగదా! మంచికి మానవుడు ప్రతిరూపం కావాలని ఈయన కోర్కె.

ఈ కవికి ఉన్న శిల్పప్రీతిని కొరదు (ఇంద్రధనుస్సు) వన్నెల సిరాలతో కొన్ని పుటలు అచ్చువేయించి ప్రీతిని పొందినాడు.

కవి సంస్కృతాంధ్రాలను మధుర గంభీరంగా, భావ పూర్ణంగా నడుపుతాడు. దానికి పారవశ్యగుణం గూర్చను, ఇవి గేయాలైనవి. సాంప్రదాయిక మార్గాన భాష భావం నడచినవి. వీటి పాకం వెగట పుట్టించని తీపు. దైవభక్తి, దేశభక్తి మహాపురుషుల కీర్తి ఈ గానానికి వస్తువులైనవి. "శివసుందరాకార" అన్నగేయం పుట్టపర్తివారి శివతాండవంవలె ఊపు ఆవేశాన్ని పుట్టిస్తున్నది. ఇందు భాషలయాన్వితమై నుడికారపు సొంపుతో తన్మయను కలిగిస్తున్నది.

"ఉగ్రయాగం"లో సెయ్ రుద్రా అనే దానికిమారు ఓం అనరాదా? అన్నీ కలిసి వస్తవే!

భూమిని నమ్మకొని రైతుగా, ఈయన కృషిక జీవనంపై వ్రాసిన ఖండికలు గ్రామ జీవన సౌభాగ్యాన్ని, ప్రజల ఆరమరలేని మనస్సును వెల్లడిస్తున్నవి. సేద్యపు పనిలోను, కవితా కృషిలోను చేయి దిరిగిన మనిషిగదా! పల్లెపదాల నుడికారం చవులూరించి, సంస్కృతార్పటి వీనులకు విందు చేస్తున్నది. దేశనాయకుల స్తోత్రం బాగున్నది. భారత భానుడన్న శీర్షికలో ఆ భానుడెవడో తేలటం లేదయ్యా.

అప్పటమైన గాంధేయుడు —మధురాంధ్రకవి— తుమ్మల సీతారామమూర్తి కైవారము, భద్రాద్రి గోపన్నస్తుతి రసవత్తరంగా ఉన్నవి.

"మానవ మనత్వస్త్వ వికాసానికి, తూర్పార(న)బట్టి, నుంచిన గాదెల కెత్తడం" తన పని అని అనుకొనే ఈ కవి కృతకృత్యుడు.

## 4. నిశ్శబ్ద సంగీతం (కవితా సంపుటి)

[పైడిపాల (సత్యనారాయణరెడ్డి) డెమ్మీ 1/8—70 పుటలు, ధర — రు 3—75/; ప్రతులకు: పి. వెంకట నారాయణ రెడ్డి; పసలపూడి; రామచంద్రపురం తాలూకా; తూర్పు గోదావరి; 533261.]

ఈ రచయిత, వచన కవిత్వం, ప్రబంధ కవిత్వం మధ్య నడుస్తున్నాడు. ఇది కొంత నయము! ఇది నిశ్శబ్ద సంగీతమైనా గ్రంథాన్ని సప్తస్వరాలుగా విభజించినాడు. ఈ కవి భావకమనీయతకు మెరుగులు దిద్దినది భాషా సౌభాగ్యము, తెనుగు నుడికారపు

తీరు. కొన్నిచోట్ల భావానికి విస్పష్టత కొంత తగ్గినా, ఎక్కువ భాగం బాగున్నది. ఈయనకు ఎత్తిపొడుపు మనసుకు నచ్చిన ఆయుధ గా ఉన్నది. ''మానవుడు చంద్రతలంపై పాదంమోపినా, చాంద్రాయణ వ్రతాలు సాగుతున్నయి'' అని మూఢాచారంపై వజ్రాయుధం ప్రయోగించినాడు. ''భద్రకాళిని'' భయ పెట్టినట్లు విప్లవ కవులు ''స్వగుచ మర్దనానికి సింబల్'' అంటూ గేలిగొట్టినాడు. నేటి విచ్చలవిడి కవిత్వాన్ని గూడ విమర్శించినాడు భావానికి దగిన ఇంపైన భాష : ''కాలం హారతి పళ్ళెంలో క్షణం క్షణం హరించుకపోతున్న కర్పూరంజీవితం — భూదేవి చిగురాకు మేలి ముసుగేసింది—గాలి వీచింది, చెలి సొగసు తోచింది, అని ప్రియుని కామోద్దీపనాన్ని ధ్వనింపజేస్తున్నాడు. రేపటికోసం రెపరెపలాడే క్యాలెండరు కాగితం నిజం నిటల నేత్రాన్ని తెరుస్తుంది—పసిమొగ్గలు తీగతెగి గుండెలలో మూగబాధ రగిలించి — ఇటువంటి కవితా శిల్ప కోరకాలుచాలా ఉన్నవి

ఇంత చదువుకొన్న వ్రాతగాడు — స్వంత (సొంత) శంఖు (శంకు) స్థాపన అనడం, అందమైన ముఖాన అమ్మవారి కనుమలు (స్ఫోటకపుమచ్చలు) ఉన్నట్లున్నది ఇంగ్లీష్ పదాలు కొంతతగ్గిస్తే సామాన్య పాఠకులు ఇంకా బాగా ఆనందించగలరు.

ఉపోద్ఘాతం వ్రాసినాయన ఉన్నతస్థాయి భావాలను నింద్య గ్రామ్యంలో అలంకరించడం మంచి అభిరుచి కాదేమో అనుకొంటా! ఇంతకూ వీరు అరాచకవాదులుకారే! ఎత్తుకుంటుండగానే కసిత్వం అనే సమాసమేమిటి? కవులు నిరంకుశులనేనా? బావున్ను వంటి పదాలు కర్కశాలై చెవులకు ములుకుల గా తాకుచున్నవి. మంచి భాష నాగరక లక్షణం గదా!

## 5. రేపటి మనిషి

[వచన కవితా సంపుటి, టి. గౌరీ శంకర్. డెమ్మి 1/8 80 పేజీలు; మూల్యం రు 3/–; ప్రతులకు : రచయిత, 1 8–78/79; చిక్కడ్‌పల్లి; హైదరాబాదు20; 500020.]

ముఖ చిత్రం — తలాతోక తెలియరాకుండా, వికృత భయంకరంగా రాబొయ్యే మనిషిని కాబోలు చూపుచున్నది వికార రూపాల సృజించడంలో వాల్మీకి ఏమీ వెనుక బడలేదు ఆయన కబంధుడు పొట్టలో తల — కండ్లతో Fantastic గానే ఉన్నారు. పోను పోను అంద చందాలతో మానవ జాతి బాగుపడుతున్న దంటారే — ఈ వికృత రూపం ఏలనో! కాని కవితలో భావం కలిగించిన ఊపుతో భాష పరుగెత్తుతున్నది; అనుకున్నది సూటిగా చెప్పగలడు.

అయితే ఏమి? గ్రంథమందు ''కన్నీళ్ళతో కడుపు నింపుకొనే వాళ్ళు (ఈ నుడికారం బాగున్నది) బంగరు బంగళాలముందు సంగిలి విస్తరాకు వెదకేవారి''తో విషయం కొత్త అనిపించడంలేదు. భాగ్యంపై విసరులు విప్లవాలు ఇవీ పడికట్టు రాళ్ళవలె నేటి కవితా సామగ్రి అయి ఉన్నవి గదా; ఆసరకే ఈ పుస్తకం నిండి యున్నది. వీరి శపనార్థాలు, కలిగిన వారిని కాస్తనైనా కదిలించ లేవా? విని విని వినుగెత్తుడందప్ప ఈ మాటవల్ల ప్రయోజనమేమైనా ఉన్నదా? రాజకీయ కాలుష్యాన్ని నల్ల బజారును నేడు తిట్టని కవి లేడు, ఇందు కొత్త సొంపు ఉంటే విని ఆనందించగలం గదా! ప్రబంధ కవుల పాత పాటకు, కొత్త స్వరాలు ముక్తాయింపులేగదా ఇంతకాలం ఊపిరిపోస్తున్నది కాని, ఈకవులు ఒక్క సంఘ ద్రోహినైనా పోలీసులకు పట్టించినాడా? ఈ కవి ద్వేషానలం అంతగా క్రక్కడు

కవిత, కవిలో స్పందించి పరితను స్పందింపజేయాలని 2, 3 చోట్ల సొంపైన మాటలన్నాడు. సత్కవిత ధేయం ఆనందమే విప్లవ ద్వేషం కాదేమో. రాముడు బుద్ధుడుపుట్టిన పావన భారతావని ఇప్పుడు పాడైనదని మూఢాచార సంపన్నులైన పౌరాణికుల ధోరణిలో పడినాడు గాని (ఇదినరలోకము) ఆనాడు ధర్మం నాలుగు కాళ్ళతో నడచి, ఈ కలికాలంలో కుంటుతూ నడవడంలేదు, మంచి చెడ్డలు ఆనాటివలెనే పడుగుపేకలుగా ఈనాడు ఉన్నవని నేటికవులు తెలుసుకొని ఆనందించడం మేలు. రాతిని గురించి (మీలో ఎందరికి తెలుసు)చెప్పిన భావాలు సుందరంగా, సముచితంగా ఉన్నవి ''నన్ను దేవుడుగా మంచారు'' అని జ్ఞాపకం చేస్తున్నది. లేకుంటే ఇంటి కడప రాయైనా కాలాపులు తినదా? ఇంగ్లీషు నాగరకతా వ్యామోహం వల్ల, మన నాగరకతను మరచిన దానికి వగచి, మన సంస్కృతిని జ్ఞప్తికి దెచ్చిన ఖండిక (నన్నడిగితే చెప్పలేను) భావపూర్ణంగాఉన్నది.

ఈ దారిన పడితే ఈ కవికి ముమ్ముందు మంచి దినాలున్నవి.

## 6. యుగరశ్మి

[కవితా సంపుటి, ఎస్. వెంకటరంగారెడ్డి డెమ్మి 1/8— 48 పేజీలు; ధర—రు 4/—ప్రతులకు గ్రంథకర్త—1—4—18; కొల్లాపూర్; మహబూబ్‌నగర్ జిల్లా; 509102.]

''ఎవరికోసం ఈ కవిత?'' అని ప్రశ్నిస్తూ — ''దేదీప్యమానంగా వెలుగవలసిన శ్రమ జీవుల కోసం'' అని ఒక మధ్యతరగతి కళాశాల అధ్యాపకుడు — ఈ కవి ప్రత్యుత్తరమిస్తున్నాడు. శాస్త్ర దృష్టి గలవాడైనందున (వృక్షశాస్త్రం) ''పరిమితులులేని ఆవేశం ప్రళయం సృష్టిస్తుంది'' అంటూనే, ఈనాటి కొత్త కవులందరి వలెనే బీదలపాట్లు వర్ణించి, కన్నీరులేని నగవును చూపుతున్నాడు.

''ఇది మా ఇల్లు'' అన్న ఖండిక నికృష్ట దరిద్రుని మురికి కొంపను వర్ణిస్తున్నది. ఇది ఈకవి అనుభవమా? లేక, కాంగ్రెసు వారికి ఖద్దరు ఫ్యాషన్ అయినట్లు, అభ్యుదయ కవులకు ఇది వాలాయమా? ఈ ఇల్లు నిజంగా ఈయనది కాకుంటే — అరకలు కూలికి ఏడ్చినట్లుంటుంది. విప్లవమే సౌభాగ్యానికి మూలమని మావో వాదం చేస్తాడు. ఇది ఈ కోవవారి వాదం. కాని, ఈయన బుద్ధి శాస్త్రీయ విమర్శనాత్మకం గదా, విప్లవం లేకుండా— రక్తం చిందించకనే అమెరికా, ఇంగ్లండు, పడమటి జర్మనీ, జపాను బాగుపడలేదా ?

ఇందలి భాష సారికాడిపోతూ, భావాన్ని ఇంకా బాగా నిలబలక లేకున్నది. ఈ నూనూగు మీసాల నూత్న యౌవనపు కవిత, కోరమీసం వచ్చే ప్రాయానికి వన్నెకెక్కే గుర్తులున్నవి. బంగ్లాదేశం మీద మూడు గీతాలున్నవి.

''శిల శిల్పంగా మారితేనే అందం'' అన్నది కళాత్మక మధురసత్యం. ''చిగురించే ఆశల పందిరి''లో ఊహాలతలు ఎగ ప్రాకించుకోగలదని ఆశపడుతున్నా! అప్పుడే ఈ రశ్మికి సాఫల్యం.

# 7. వె లు గు

[నలబై ముగ్గురి కవితా సంకలనము. డెమ్మి 1/8 32 పేజీలు; ధర రు. 2/—ప్రతులకు : నటరాజ కళానికేతన్; జిల్లేళ్ల శాఖ.]

పట్టణ నాగరకత, బస్సులతో, సినిమాలతో పల్లెలకు ప్రాకినట్లే, కవితలల్లడం గూడ ఊరి చావళ్లలో వినబడటం ముదావహం. సొంపైన జాతీయ తెనుగు నుడికారము- లోకజ్ఞాన దీపకమైన (సెన్సు విషయంకాదు) ఊహాలు సహజ శోభలో పల్లెల భావుకులలోనే పుట్టి పెరుగుతవి—అన్నది, పాచీనపు పెద్దలన్న మాట నూటికి నూరుపాళ్లు నిజం. చూడండి—తిక్కనాదుల లౌకిక జ్ఞానం, అప్పటమైన తెనుగుదనం పల్లెలలో రేపుమాపు అంటే పట్నాలలో ఉదయం సాయంత్రం అంటారు.

వేములవాడ, నటరాజ కళానికేతనం వారి జిల్లేళ్ల శాఖ ప్రచురణం ఇది. సాధకులు చాలమంది, తమ తొలి మల చిన్న కవితల ప్రకటించినారు. ఈ చిన్న చిన్న చిరు వెలుగు దివ్వెలు మున్ముందు దీప్తతారలు కాగలవు. భాషలో, భావాలలో కొత్త పోకడలు చూపాల. ''జాగృతి''లో మూఢ విశ్వాసాలపై దాడి ఉన్నది. పేదల కన్నీటి కల్లబొల్లి కవితలను వదల యువకవులు బయట పడవలసి ఉన్నది. ఇదీ ఒక అంధవిశ్వాసాంధకారం.

ఈ ప్రచురణమంతా అభ్యాస స్థాయిలోనే ఉన్నది. విషయాలు చాలా పరిపాటివి; ఇక అలవరచుకోవలసినది — వీటిని కొత్త రీతిలో చెప్పటాన్నే. భావ ప్రకటనకు భాష ఇంకా తడబడుతున్నది. పట్టుదలతో వీరు మంచి కవులు కాగలరని ఆశపడతున్నా.

# 8. మనసు గీచిన చిత్రాలు (కవితా సంకలనం)

[రంగినేని సుబ్రహ్మణ్యం డెమ్మి 1/8—48 పేజీలు; వెల రు 4/—ప్రతులకు—రచయిత, శ్రీనాజీ నిలయం, కొల్లాపురం, మహబూబ్ నగరంజిల్లా-509102 ]

నేటి రచనలు ఎక్కువపాలు, భావంలో, భాషలో కొత్త లేక, కవితారీతిలో విశేషం లేక, ఏడ్పించేటంత విసుగుతో రూపొందుతున్నవి ధనికుల దౌష్ట్యం-(ప్రభుత్వం ముండమోసి ఉన్నదా?) బీదల దైన్యం, ప్రగతి— మానవత—సమత — మొదలైన ఊతపదాలతో చదువుకు సొంపులేదు; సానుభూతితో చదవాలనుకొన్నా నవ్యత ఆకర్షణలేక రుచింపకున్నవి. ఈ పరిపాటి భావాల పదాలు ఇరవై ఏండ్లుగా వింటూనే ఉన్నాము వీటి నన్నిటిని దంచి మొరటు మూసలో కరగి, కళాశూన్యమైన అచ్చుబోసినట్లున్నవి. భావ శబ్దలత, భాషామాధుర్యం, కవితా కమనీయత గలిగి రుచులూరించె రచనలు పుట్టితేనె తప్ప ఈ కవితకు చరమ దినాలు చేతి వేళ్ల మీద లెక్కబెట్టే స్థితికి వచ్చిన వనవచ్చు. నవ్యభావుకతా సుందర పదబంధాలు నూతన రీతులే ఈ కవితకు పునరుత్థానం కలిగించ గలిగినది. ఎవరేమనుకొన్నా ఈ చెత్తను గురించి అనవలసినమాటే ఇది. వీరి కవితలు బాగుపడితే ఆనందించేవారిలో నేనొకణ్ణి.

ఈ చిత్రాలలో, ప్రతి పేజీల - మమత, సమత. మానవత మొదలైన, అతివ్యాప్తి దోషం పట్టిన పదాలు, రెండు మూడు మాట్లయినా కండ్లు ఉరిమి చూస్తుంటవి కూలీల స్థితికి వగచే దానికి ప్రభుత్వం ఊరుకుంటున్నదా? పెట్టుబడిదారుని పీల్చి పిప్పి జేసే శాసనాల ఈ కవితా లోలురకు ఎరుకలేదా ? నేడు రైతుకు చేటెడు గింజలైనా మిగులుచున్నవా ? వీరు వర్ణించే స్థితి ప్యూడలజంలో ఉండి ఉండవచ్చును.

ఈ కవి చెప్పిన విషయాన్నే మరల మరల చాలా చోట్ల చెప్పినాడు. ఈ సంకలనంలో ఆర్తి—శవాలు తాండవం చేస్తున్నవి. చదివిన వానికి హాయిని గొలిపే ఒక్క చిన్న ఆశాకిరణం గూడలేదు ఈ దుర్భర స్థితికి పరిహారమేమిటి? 4, 5 ఖండికలలో, ఉత్తమ పురుషలో విశ్వరూపం చూపుతానంటాడు. ఈ తెగ కవులకు ప్రణయం ఒక తెగులని, కవితా వస్తువుగా దానిని చేపట్టరాదని ఒక కవయిత్రి శాసనం. దీనిని లెక్కబెట్టలేదు ఈయన. ప్రణయాభిసారిక (26 పేజీ) అంటాడు. ఇంక దేనికైనా బయలుదేరిపోతే దానిని అభిసరణమంటారా ?

కొన్ని భావాలను కొన్నిచోట్ల వెల్లడించిన భాషా వైఖరి బాగున్నది.

శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.**

# అమృతాంజన్ లిమిటెడ్

## 75 సంవత్సరాల పైగా గృహౌషధములు తయారుచేస్తున్నారు!

- అమృతాంజనం బాధానివారిణి
తలనొప్పి, ఒళ్ళునొప్పులు, బెణుకులు, జలుబు, దగ్గు, కండరాల నొప్పులకు.
- అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్
పసిబిడ్డల అజీర్ణానికి, పళ్ళు వచ్చేటప్పుడు కలిగే బాధలకు.
- అమృతాంజన్ డెర్మల్ ఆయింట్ మెంట్
తామర, తీట, గజ్జి వగైరాలకు.
- అమృతాంజన్ ఇన్ హేలర్
జలుబుచేసి ముక్కుదిబ్బడ, తుమ్ములు వగైరాలకు.
- అనోలియమ్-కోల్డ్ రబ్
దగ్గు జలుబులను పారద్రోలే అమోఘమైన ఒక కొత్త శక్తి.
- సాలోఫెన్ -బాధానివారిణి మాత్రలు
తలనొప్పి, ఫ్లూ, ఒళ్ళు నొప్పులకు.

...ఇండియాలోను,
ఇతర దేశాలలోను
పేరు పొందినవి.

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు-4

